246/2-85

# సోమదేవభట్టు కథాసరిత్సాగరం

అనువాదం
[illegible]

ప్రచురణ:
తిరుమల తిరుపతి
దేవస్థానములు, తిరుపతి

ఐదవ సంపుటము



# విషయసూచిక

పుట

## 8. సూర్యప్రభలంబకం

### ప్రథమ తరంగం



### ద్వితీయ తరంగం



### తృతీయ తరంగం



### చతుర్థ తరంగం



### పంచమ తరంగం

## షష్ఠ తరంగం



## సప్తమ తరంగం





# మనవి

కథాసరిత్సాగరం నాలుగు సంపుటాలు ముగించి ఈ అయిదవ సంపుటాన్ని పాఠకుల ముందుంచ గలుగుతున్నందుకు మా కెంతో సంతోషంగా ఉంది. అత్యద్భుత కథాప్రపూర్ణమైన ఈ ఉద్గ్రంథంలో ఎక్కడి కక్కడే ఎన్నో కథలు మూలకథాసూత్రానికి అనుబద్ధాలై వస్తున్న సంగతి మీరిప్పటికే గ్రహించి ఉంటారు.

ఈ గ్రంథాన్ని గురించిన పరిపూర్ణ వివరణ మొదటి సంపుటం. ఉపోద్ఘాతంలో దీని అనువాదకులు, మా ప్రధాన సంపాదకులు డా॥ విద్వాన్ విశ్వంగారు విపులంగా వ్రాసే ఉన్నారు.

ఈ సంపుటంలో సూర్యప్రభుడనే నరపాలుడు విద్యాధరత్వాన్ని సంపాదించుకున్న కథ ప్రధానం. ఇందులో కొన్ని ఉపకథలూ ఉన్నవి.

ఎంత అందంగా కథ చెప్పే వీలున్నదో అంత అందంగానూ చెప్పడం ఇందలి విశిష్టత. ఇది మా పాఠకులను అలరిస్తుందని విశ్వసిస్తున్నాము. మిగత సంపుటాలన్నీ త్వరలోనే ముద్రించి ప్రచురించ గలమని ఆశిస్తున్నాము.

**తిరుపతి,**
అక్టోబరు 25, 1983.

**జి. కుమారస్వామిరెడ్డి,**
కార్యనిర్వహణాధికారి,
**తిరుమల తిరుపతి దేవస్థానములు.**

# ఒక మాట

మహోత్తమ కథాచయనిక అయిన ఈ కథాసరిత్సాగరంలో అయిదవ సంపుటం పూర్తి అయినది. నా అనువాద పద్ధతి మీ కిప్పటికే తెలిసి పోయి ఉంటుంది. పదే పదే చెప్పడం చర్విత చర్వణమే కాగలదు.

వ్రాత వరకు పది సంపుటాలు పూర్తి అయి సిద్ధంగా ఉన్నవి. ఇక రెండే వ్రాయవలసి ఉన్నవి. అచ్చుపని కూడా త్వరత్వరగా జరుగుటకు తగిన ఏర్పాట్లను తిరుమల తిరుపతి దేవస్థానముల కార్యనిర్వహణాధికారి శ్రీ జి. కుమారస్వామి రెడ్డి ఐ. ఏ. ఎస్. గారు చేస్తున్నారు. అందుకు వారికి నే నెంతో కృతజ్ఞుడను. అందరి సహకార సహాయాలతో ఈ ఉద్గ్రంథాన్ని త్వరలో పూర్తిగా పాఠకులకు అందించ గలమని నమ్ముతున్నాము.

\- విశ్వం



# 8. సూర్యప్రభలంబకం

ఇదం గురు గిరీంద్రజా
ప్రణయ మందరాందోలనాత్
పురాకిల కథామృతం
హరముఖాంబుధేరుద్గతమ్
ప్రసహ్య సరయంతి యే
విగత విఘ్నలబ్ధర్ధయో
ధురం దధతి వైబుధం
భువి భవప్రసాదేన తే.

పూర్వం పార్వతీ ప్రణయ మందర మథనంతో హర ముఖాబ్ధినుండి ఈ కథామృతం ఆవిష్కృతమైనది. పట్టుదలతో ఈ సుధను పానం చేసేవారు శివానుగ్రహంవల్ల నిర్విఘ్న సిద్ధులను పొంది దివ్యపదమును చేరగలరు.

# ప్రథమ తరంగం

తన చెవుల కదలికవల్ల కలిగిన గాలితో పైకి లేచిన సిందూరంతో ఆకసమంతా అరుణితం కాగా అకాలంలో సంధ్యాకాలాన్ని సృష్టించే గజాననునకు జయము.

ఈ విధంగా వత్సరాజ కుమారుడైన నరవాహనదత్తుడు కౌశాంబీనగరంలో తండ్రి ఇంట భార్యలతో పాటూ సుఖంగా ఉన్నాడు.

ఒకసారి తండ్రి ఆస్థానంలో ఉండగా దివ్యరూపం కల ఒక పురుషుడు ఆకసం నుంచి దిగివచ్చినాడు. అతను నమస్కరింపగా తండ్రితో పాటూ తానూ అతనిని వెంటనే సత్కరించి: "నీవెవరు? ఎందుకు వచ్చినావు?" అని అడిగినాడు. అప్పుడిట్లా అతను చెప్పసాగినాడు.

## వజ్రప్రభుని ఆత్మకథ

హిమవత్పర్వతం మీద వజ్రకూట మను పేరుగల పట్టణమున్నది. వజ్రసారమయమై నందువల్ల ఆ సార్థక నామధేయం దాని కేర్పడినది. అక్కడ ఉన్న వజ్రప్రభుడను పేరుగల విద్యాధరరాజును నేను. నా శరీరం కూడా వజ్రనిర్మితమై నందువల్ల దానివలెనే సార్థకమైనది.

—పూర్వం నేను మహేశ్వరునిగూర్చి తపస్సుచేయగా సంతుష్టుడై ఆయన ఇట్లా ఆదేశించినాడు: "నేను నిన్ను విద్యాధర చక్రవర్తిగా ఏర్పరుస్తున్నాను. నాభక్తుడవైన నీవు నేను నియమించినంతకాలం నా అనుగ్రహంవల్ల విపక్షులకు అజేయుడవుగా ఉంటావు." ఇప్పుడు నేను నా ప్రభువునకు ప్రణమిల్లుటకై ఇక్కడికి వచ్చినాను. వత్సరాజపుత్రుడు, కామాంశ సంభవుడూ అయిన నరవాహనదత్తుని మాకందరకూ ఒక దివ్యకల్పాంతం చక్రవర్తిగా చంద్రశేఖరుడు నియమించినాడు. ఆయన మానవుడైనప్పటికీ ఉత్తరదక్షిణధ్రువాలు రెండింటికీ చక్రవర్తి కానున్నాడు. ఈ సంగతిని నే నిప్పుడు విద్యాప్రభావంతో తెలుసుకొన్నాను.

— పూర్వంకూడా ఇలాగే మర్త్యుడైనప్పటికీశర్వుని అనుగ్రహంవల్ల సూర్యప్రభుడను చక్రవర్తి ఉండెను. ఆయన అప్పుడు దక్షిణధ్రువానికి అధిపతిగా ఉండెను. అలాగే ఉత్తరానికి శ్రుతశర్మ అను చక్రవర్తికలడు. రెండింటికీ కల్పాంతం ఖేచరులకు ఒకేచక్రవర్తిగా ఈయన ఉండడం మహాపుణ్యంవల్లనే—"

అని చెప్తున్న విద్యాధరుని చూచి వత్సరాజ సహితుడైన నరవాహనదత్తుడు కుతూహలంతో ఇట్లా అన్నాడు: "విద్యాధర సామ్రాజ్యం మనుష్యుడైన సూర్యప్రభునికి ఎట్లా సంప్రాప్తమైనది? ఆ పూర్వకథను తెలియజేయవలసింది."

అలా అడగగా రాణులు, మంత్రులూ మాత్రమే ఉండగా వివిక్తప్రదేశంలో వజ్రప్రభు డిలా చెప్పసాగినాడు:

## సూర్య ప్రభ చరిత్ర

"పూర్వం మద్రదేశంలో శాకలమనే నగరంకలదు. అక్కడ అంగారప్రభుని కొడుకు చంద్రప్రభుడను వాడు రాజుగా ఉండెను. సార్థకనాముడైన ఆయన ప్రపంచానికి ఆహ్లాదకారి అయినప్పటికీ, అగ్నిప్రభుడై శత్రువులకు మాత్రం సంతాపకారి అయ్యేను. ఆయన రాణి కీర్తిమతి. వారికి అతిశుభలక్షణ సమేతుడైన ఒకపుత్రుడు ఉదయించినాడు. అతనే సూర్యప్రభుడను రాజు. త్రిపురారి అనుగ్రహంతో భావి విద్యాధరచక్రవర్తిగా నియమితుడైనవాడు."

అప్పుడు ఈ విధమైన వాక్కు స్పష్టంగా వినిపించినది. ఆ మాటలు చంద్రప్రభ మహారాజు కర్ణములకు సుధావర్షమైనది. ఆ విధంగా చంద్రశేఖరుని ప్రసాదోత్సవశాలి అయిన సూర్యప్రభుడు, తండ్రి ఇంట క్రమంగా పెరుగుతూ వచ్చినాడు. బాల్యంలోనే విద్యలను, కళలను క్రమంగా నేర్చుకొని గురుసేవనంతో సర్వవిశారదుడైనాడు. పదహారేళ్ళు నిండగానే ప్రజలను గుణములతో ఆకర్షించిన వానికి, తండ్రి చంద్రప్రభుడు, యౌవరాజ్యాభిషేకం చేసినాడు.

తన మంత్రి పుత్రులైన భాస, ప్రభాస, సిద్ధార్థ, ప్రహస్త ప్రభృతులైన అనేకులను అతనికి సమర్పించినాడు. వారితోపాటూ యువరాజత్వ భారాన్ని వహిస్తుండగా, ఒకసారి మయుడను మహాసురుడు అక్కడికి వచ్చినాడు. రాజాస్థానంలో సూర్యప్రభుడుండగా, ఆ మయుడు, చంద్రప్రభుని దర్శించి, అతడిచ్చిన ఆతిథ్యాన్ని స్వీకరించి, ఆ రాజుతో ఇట్లన్నాడు:

"ఓ మహారాజా! మీ పుత్రుడైన ఈ సూర్యప్రభుడు విద్యాధరేశులకు భావి చక్రవర్తిగా త్రిశూలి నిర్మించినాడు. తత్సంప్రాప్తికి దారితీసే విద్యలను ఈయన స్వాధీనపరచు కొనవలసి ఉన్నది. అందుకే శంకరుడు నన్నిక్కడికి పంపించినాడు. విద్యాధర చక్రవర్తిత్వానికి కావలసిన విద్యాసాధన క్రియలను, నాకు తెలిసిన వాని నన్నిటినీ ఇతనిని కొనిపోయి ఉపదేశిస్తాను.

ఇతనికి ఈ విషయంలో ఒక విరోధి కలడు. అతను ఖేచరేశ్వరుడైన శ్రుతశర్మ: అతను ఇంద్రునిచే నియమితుడైనవాడు. సిద్ధ విద్యాప్రభావంతో మాతో కలిసి ఈయన అతనిని జయించి విద్యాధర చక్రవర్తిత్వాన్ని పొందగలడు."

ఇలా మయుడు చెప్పగా చంద్రప్రభరాజు ఇట్లన్నాడు: "మేము ధన్యులం. ఇతడు పుణ్యశాలి. మీ ఇష్టం వచ్చినట్టు కొని పొండి."

ఆ తర్వాత ఆ రాజుతో సెలవు తీసుకొని ఆ సూర్యప్రభునితో పాటూ, అతని మంత్రులను కూడా తోడ్కొని, మయుడు పాతాళానికి పోయినాడు. ఆ రాజపుత్రుడు అమాత్యులతోపాటూ విద్యలన్నిటినీ త్వరగా నేర్చుకొనునట్టు అతనికి ఆ మయుడు వానిని ఉపదేశించినాడు. అట్లాగే విమాన సాధనాన్ని కూడా అతనికి ఉపదేశించినాడు. దానితో భూతాసనం అనే విమానాన్ని సంపాదించుకొని, ఆ విమానంపై అధిరోహింపజేసి, విద్యలలో సిద్ధుడైన సూర్యప్రభుని మంత్రులతో పాటూ, పాతాళం నుంచి మయుడు శాకల పట్టణానికి కొనిపోయినాడు.

అక్కడ మయుడు, అతని తండ్రి దగ్గరకు వెళ్ళి, 'నేను తిరిగి వచ్చేదాకా ఇక్కడ సిద్ధి భోగాలను అనుభవింప వలసిం'దని

చెప్పి బయలుదేరినాడు. అప్పుడు ఆ మయాసురుని రాజు సత్క రించినాడు. తన కొడుకు విద్యాసిద్ధిని పొందెనని చంద్రప్రభరాజు సంతోషించినాడు.

విద్యాప్రభావంవల్ల తన మంత్రులతో పాటు సూర్యప్రభుడు విమానం మీద నెక్కి నానా దేశాలలోను విహరించ సాగినాడు. ఎక్కడెక్కడ ఏ యే రాజకన్యక అయితే అతనిని చూచెనో. అక్క డక్కడంతా ఆయా రాజకన్యకలు కామమోహితలై, తమకుతామే అతనిని వరించినారు.

తామ్రలిప్తి నగరంలో వీరభటుడను మహారాజు కూతురు మదనసేన అను కన్య లోకైక సుందరి కలదు. సుభటుడనేరాజు రెండవ కూతురు చంద్రికావతి, ఆమె అపరాంత రాజు కూతురు. సిద్ధులు ఆమెను కొనివచ్చి వదలినారు. కాంచీ నగరాధిపతి కుబేరుని కూతురు వరుణసేన మూడవది.

లావాణక రాజు పౌరవుడనే రాజుకూతురు అందమైన కన్నులు గల సులోచన నాల్గవది. చీనాదేశపు రాజు సురోహుని కూతురు మనోహరమైన బంగారు చాయగలది. విద్యున్మాల అను పేరు గలది ఐదవది. కాంతిసేనుడనే శ్రీకంఠదేశరాజు కూతురు, కాంతితో అచ్చరలను జయించినది, కాంతిమతి అను నామె ఆరవది. కౌశాంబీనగరాధిపతి జనమేజయరాజు కూతురు మంజుభాషిణి వర పృష్ఠ ఏడవది.

వీరందరినీ ఎవరికీ కనబడకుండా తీసుకొని పోవడం తెలిసి నప్పటికీ వారి బంధువుల్కు విద్యాబలోద్ధతుడైన ఇతని విషయంలో వేతసవృత్తి (రెల్లు గాలివాన రాగా సమయం కాదని తలవంచి నట్లు) ని అవలంబించినారు.

ఆ విధంగా తాను సంపాదించుకున్న అనేక విద్యలతో ఒకే మారు అనేక రూపాలను ధరించి సూర్యప్రభుడు వారితో రమించ సాగినాడు. ప్రహస్తాది మంత్రులతో కలిసి, నభోవిహారంతోను, సంగీతపానగోష్ఠుల తోనూ రకరకాలుగా వారితో కలిసి క్రీడించి నాడు.

దివ్యచిత్ర కళాభిజ్ఞుడు గనుక విద్యాధరాంగనల నెందరినో చిత్రించి, నర్మోక్తులనాడి ఆ ప్రియురాండ్రను కుపితలను చేసి నాడు. బొమముడులతో కన్నెర్రజేసిన వారితో, పెదవి వడకు తున్నవారితో, మాటలుతడబడుతున్నవారితో అతను క్రీడించి నాడు.

భార్యతోపాటూ, తామ్రలిప్తికి వెళ్ళి గగనచారి అయి, ఉద్యానాలలో ఆ రాజకుమారుడు మదనసేనతోపాటూ విహరించి నాడు. తన ప్రియురాండ్రను తీసుకొని భూతాసన విమానంలో వజ్రసారమనే పట్టణానికి, ప్రహస్తమాత్ర సహితుడై వెళ్ళినాడు. అక్కడ రంభుడనే రాజుకూతును చూచినాడు. తారావళి అనే ఆమె అనురక్త అయి స్మరాగ్నితో దహ్యమాన అవుతున్నది. ఆమెనుకూడా గ్రహించినాడు. తామ్రలిప్తికి తిరిగివచ్చి విలాసిని అనే పేరుగల మరొకరాజకుమార్తెను కూడా ఉపహరించినాడు. అందుపై కోపపడి తనపైకి వచ్చిన ఆమె సోదరుడు సహస్రాయు ధుడనే పేరుగల వానిని, ఉద్ధతుడైన వానిని విద్యతో స్తంభింప జేసినాడు.

అలాగే అతని వెంటవచ్చిన మాతులుని, అనుచరులతో పాటు, ఆ కాంతను అపహరించదలచినందుకై అతనికి శిరోముం

డనం చేయించినాడు. భార్యకు బంధువులైన వారిపై క్రుద్ధుడై నప్పటికీ వారిని చంపలేదు. వారికి గర్వభంగం మాత్రమే చేసి నవ్వుతూ వదలివేసినాడు.

ఆ తర్వాత ఆ తొమ్మిదిమంది కాంతలతోనూ కూడిన సూర్యప్రభుడు, తండ్రి పిలువనంపగా విమానంపైనే తన ఊరు శాకలానికి వెళ్ళినాడు. అక్కడ తండ్రి అయిన చంద్రప్రభ భూపతివద్దకు తామ్రలిప్తినుంచి వీరభటభూపతి ఒక దూతను పంపినాడు. "నీ పుత్రుడు నా కుమార్తెలను అపహరించినాడు. అదలా ఉండనీ. విద్యాసిద్ధుడు గనుక అతను వారికి యోగ్యుడైన భర్తే. మా మీద మీకు అభిమానమే ఉంటే ఇక్కడికి వచ్చినట్టయితే వివాహాచార సత్కారాదులను ముగింపవచ్చును" అని అతనితో సందేశం పంపించినాడు.

ఈ మాటవిని ఆ దూతను సత్కరించి రేపే ప్రయాణమని చంద్రప్రభరాజు ప్రకటించినాడు. ఇందులో నిజమెంతో తెలుసుకొనవలెనని వీరభటరాజు దూత వెనుకగా, ప్రహస్తుని పంపించినాడు. ఆ ప్రహస్తుడు వేగంగా వెళ్ళి వీరభటునిచూచి కార్యమెరిగి అతనితో సత్కృతుడై ఉదయమే చంద్రప్రభుని వద్దకు ఆకాశగమనంతో వచ్చినాడు.

రాజునకు, వీరభటుడు సర్వసన్నద్ధుడయి ఉన్నాడని తెలియజేసినాడు, తన కుమారుని మంత్రి అయిన వానిని, రాజు అభినందించినాడు.

ఆ తర్వాత కీర్తిమతీదేవితో పాటు చంద్రప్రభ ప్రభువు, మదనసేనతోపాటు సూర్యప్రభుడు భూతాసన విమానాన్నెక్కి

సపరివారంగా మంత్రులతో పాటు మరునాడు ఉదయం బయలు దేరినాడు. ఒక జాము ప్రొద్దెక్కేసరికి తామ్రలిప్తిని చేరు కొన్నాడు.

జనమంతా కుతూహలంతో ఆకాశంవైపే చూస్తుండగా గగనంనుంచి క్రిందికి దిగి, ఎదురువచ్చిన రాజు వీరభటునితో పాటు పట్టణంలోనికి ప్రవేశించినాడు. చందనోదకం చల్లిన మనోజ్ఞ పురవీథిలో పౌరస్త్రీలు పదేపదే తమ కటాక్షాలతో ఇందీ వరాలను చల్లుతున్నట్టుండగా లోనికి వెళ్ళినాడు.

అక్కడ వీరభటుడు వియ్యంకుని, తన అల్లుని పూజించి, యథావిధిగా వివాహం జరిపించినాడు. సహస్రభారా (20 తులాలు) న్వితమైన విశుద్ధ సువర్ణాన్ని, నూరు ఒంటెలు మోయ గల రత్నాభరణాలను, నానావస్త్ర భారాన్వితాలైన ఐదువందల ఒంటెలను, వేయి గుఱ్ఱాలను, ఏడువేల గుఱ్ఱాలను, ఐదువేల ఏనుగులను, రూపాభరణయుక్తలైన వేయిమంది వారనారీమణు లను ఆ రాజు అరణంగా సమర్పించినాడు. ఇది కాక అల్లుడు సూర్యప్రభునికి, అతని తండ్రికి అనేక రత్నాదులతో ఉపచరించి నాడు. వారి మంత్రులు అయిన ప్రహస్తాదులను కూడా యథా విధిగా సత్కరించి పురజనులందరకూ పండుగ చేసినాడు.

అక్కడ సూర్యప్రభుడు పితృయుక్తుడై ప్రియాసఖుడై, వివిధాహార పానగేయాది భోగాలను అనుభవించినాడు. అంతలో రంభదేశరాజైన వజ్రప్రభుని వద్దనుంచి ఒక దూతవచ్చి ఆ స్థానంలో తమ ప్రభువు మాటగా ఇలా విన్నవించినాడు:

"విద్యాబల గర్వితుడైన యువరాజు సూర్యప్రభుడు నా తనయను అపహరించి నన్ను పరాభవించినాడు. ఇప్పుడు

మాలాగే అవమానితుడైన వీరభట రాజుతో మీరు సంధానం చేసు కొంటున్నట్టు తెలిసినది. ఇక్కడికి కూడా వచ్చి మీరు అదేవిధంగా సమాధాన పడవలసింది. కాకపోతే నా అవమానానికి మృత్యు వుతో తప్ప నిష్కృతి లేదు."

ఆ మాటవిని ఆ దూతను వీరభటుడు అర్చింపగా రాజు చంద్రప్రభుడు అతనితో ఇట్లన్నాడు: "నీవే వెళ్ళి మా మాటగా ఆ రాజుతో చెప్పవలసింది: —నీ వెందుకిలా వృథాగా బాధపడు తావు? విద్యాధరులకు భావి చక్రవర్తిగా శంకరుడే సూర్యప్రభుని నియమించినాడు. నీ కుమార్తెలు మొదలైనవారు ఆయనకు భార్యలౌతారని సిద్ధులు ఆదేశించినారు. ఆ విధంగా వారు భార్య లైనారు. కానీ ఇందులో కఠోరత్వమేమీ లేదు. అందువల్ల నీవు స్నేహంగాఉండు. మాకు మిత్రుడవు. అక్కడికి కూడా వస్తాము—" అని రాజు చెప్పిన సందేశాన్ని తీసుకొని ప్రహస్తుడు గగన గమ నంతో ఒక జాములో వజ్రరాత్రం చేరుకొన్నాడు.

అక్కడ ఆ రాజునకు సందేశాన్ని చెప్పి, అతని ఆమోదం పొంది అలాగే చంద్రప్రభరాజు వద్దకు వచ్చి తెలియజేసినాడు. చంద్రప్రభుడు మరొక మంత్రి ప్రభాసుని శాకలం నుంచి పంపించి తారావళిని రంభుని దగ్గరకు చేర్చినాడు.

ఆ తర్వాత విమానంలో సూర్యప్రభుడు వీరభటునితోనూ, ఇతరులతోనూ పూజితుడై వజ్రరాత్రానికి వెళ్ళినాడు. దారి పొడ వునా తలెత్తి జనం చూస్తున్నారు. రంభుడు ఎదురేగగా రాజ ధానిలో ప్రవేశించినాడు. అతను కూడా క్లుప్తంగా వివాహ ప్రక్రి యోత్సవాన్ని నడిపి, అసంఖ్య హేమహస్త్యశ్వ రత్నాదులను

కూతురికి ఇచ్చినాడు. అలాగే అల్లుడైన సూర్యప్రభుని అంతకు ముందత ననుభవించిన భోగాల నన్నిటినీ మరచునట్టుగా ఉపచరించినాడు.

వారక్కడ ఉండగా ఇంకా ఆ ఉత్సవాన్ని జరుపుకుంటూ సుఖిస్తుండగా కాంచీనగరం నుంచి ఒక దూత వచ్చినాడు. అతను చెప్పిన సందేశాన్ని విని రంభుడు చంద్రప్రభ రాజుతో ఇట్లన్నాడు: "కాంచీపుర అధీశ్వరుడు కుంభీరాఖ్యుడు మా అన్న. అతను ఒక దూతను నా దగ్గరకు పంపినాడు. సూర్యప్రభుడు మొదట నా కుమార్తెను తీసుకొని వెళ్ళి, తర్వాత నీ కూతురిని తీసుకొని వెళ్ళినాడు. మిగతా వారితో పాటూ నేనూ అతనితో మైత్రి చేసుకొంటున్నాను. అట్లాగే నాతో కూడా వారికి స్నేహం ఏర్పడేటట్లు చేయవలసింది. వారందరూ మా ఇంటికి రావలసింది. సూర్యప్రభునకు నా చేతులతో వరుణసేన అనే నా కుమార్తెను ఇస్తాను." ఇది అతను చెప్పినమాట. దీనిని నెరవేర్చవలసింది.

ఆ మాటకు చంద్రప్రభరాజు ఊకొట్టినాడు. ప్రహస్తుని తొందరగా పంపి శాకలపట్టణాన్నుంచి వరుణసేనను, ఆమె తండ్రి కుంభీరకుని వద్దకు చేర్పించినాడు.

మరునాడు విమానంలో సూర్యప్రభుడు, రంభుడు, వీరభటుడు సానుచరులై అందరూ కాంచీపట్టణం చేరుకున్నారు. కుంభీరకుడు ఎదురువచ్చినాడు. నానారత్న సంభరితమై భూమికి కాంచీదామం వలె నున్న కాంచీపట్టణం లోనికి ప్రవేశించినాడు.

అక్కడ రాజు కుంభీరకుడు సూర్యప్రభునకు తన కుమార్తెనిచ్చి యథావిధిగా పెళ్ళిచేసి ఆ వధూవరులకు భూరి ద్రవ్యాన్ని సమర్పించినాడు.

ఆ వివాహం ముగియగా భోజనానంతరం సుఖంగా కూర్చొని ఉండగా అందరి సన్నిధిలో చంద్రప్రభునితో ప్రహస్తు డిట్లా అన్నాడు: "దేవా! శ్రీకంఠదేశంలో పరిభ్రమిస్తూ వెళ్ళినాను. అక్కడ యాదృచ్ఛికంగా కాంతిసేనుడనే రాజును చూచినాను. అతనిట్లా అన్నాడు: "సూర్యప్రభుడు అపహరించుకొని వెళ్ళిన నా కూతురు కాంతిమతిని తీసుకొని ఇంటికి తిరిగి రావలసింది. విధి పూర్వకంగా అతనిని సత్కరిస్తాను. కాకపోతే నా శరీరాన్ని వదలి వేస్తాను. పుత్రికాప్రేమ మోహితుడను, మాట వరుసకు ఈ విషయం ప్రస్తావించాను."

ఈ విధంగా ప్రహస్తుడు చెప్పగా చంద్రప్రభుడు సరేనని కాంతిమతిని ఆయన వద్దకు కొనిపొమ్మన్నాడు. అప్పుడు మనం అక్కడికి వెళ్ళవచ్చును. ఆ మాట విని ప్రహస్తుడు ఆ విధం గానే ఖేచరుడై వెళ్ళినాడు.

తెల్లవారగానే కుంభీరకునితో పాటూ చంద్రప్రభాదులందరూ విమానంపై శ్రీకంఠ విషయాన్ని చేరుకొన్నారు. అక్కడ రాజు కాంతిసేనుడు తన ఇంటికి తీసుకొని వెళ్ళి తన కుమారీ వివాహ మంగళాన్ని ఆచరించినాడు. కాంతిమతికి సూర్యప్రభునకు రాజు లకు ఆశ్చర్యజనకమైన రత్న సంచయాన్ని అరణంగా ఇచ్చి నాడు.

ఆ విధంగా వారందరూ నానా భోగాలను అనుభవిస్తూ ఉండగా కౌశాంబినుంచి ఒకదూతవచ్చి ఇట్లా విన్నవించుకొన్నాడు: "జనమేజయ భూపాలుడు తమ కిట్లా నివేదించమన్నాడు. నా కుమార్తె వరపృష్ఠను ఇటీవల ఎవరో ఎత్తుకొని పోయినారు. ఆమె సూర్యప్రభుని చేతికి చిక్కెనని ఇప్పుడు మాకు తెలిసినది. కాబట్టి

ఆమెతో పాటూ ఆయన మా ఇంటికి నిశ్శంకంగా రావచ్చును నేను అతనిని భార్యతోపాటూ యథావిధిగా సత్కరించి పంపుతాను. అలా కాకపోతే మీరూ, మేమూ పరస్పరం శత్రువులమౌతాము" అని చెప్పి ప్రభువచనాన్ని వినిపించి ఆ దూత మిన్నకున్నాడు.

అప్పుడు చంద్రప్రభుడు వారందరితో ఇట్లన్నాడు: "ఇత నింత గర్వంగా మాట్లాడుతుండగా అతని ఇంటికి మన మెలా వెళతాము?" ఆ మాట విని సిద్ధార్థుడనే మంత్రి ఇట్లా అన్నాడు: "దేవా! మీరు అన్యథా భావించకండి. అతనిట్లా మాట్లాడే హక్కు కలవాడు. అతను మహాదాత. పండితుడు. సత్కుల సంజాతుడు. వీరుడు. అశ్వమేధయాగం చేసినవాడు. ఎప్పుడూ ఏ రాజుతోనూ పరాజితుడు కానివాడు. అతనన్న దానిలో కానిమాటేమున్నది? ఉన్నమాటే అన్నాడు. కాబట్టి ఇప్పుడు మనం అతనింటికి వెళ దాము. అతను సత్యసంధుడు. అయినా అతని మనసు తెలుసు కొనుటకు ఒకనిని పంపుదాము" అని సిద్ధార్థుడు చెప్పగా వారందరూ శ్రద్ధగా విన్నారు.

అప్పుడు చంద్రప్రభుడు జనమేజయుని ఆంతర్యం తెలుసు కొనుటకై ప్రహస్తుని దూతగా పంపినాడు. అతను కౌశాంబీ మహారాజు వద్దకు వెళ్ళి అతని నుంచి ఉత్తరం తీసుకొని వచ్చి చంద్రప్రభుని సంతోషపెట్టినాడు. ఆ రాజుకూడా ఆ ప్రహస్తుని శాకలానికి పంపి వరప్రష్ఠను జనమేజయునివద్దకు చేర్పించినాడు. అంతట చంద్రప్రభాదులు. సూర్యప్రభ పురోగాములై, కాంతిసేను నితో పాటు విమానంలో కౌశాంబికి వెళ్ళినారు.

అక్కడ వియ్యంకుని, అల్లుని ఇతరులను ఎదురు వచ్చి ఆదరించి వినమ్రుడై జనమేజయరాజు పూజించినాడు. పుత్రికా

వివాహాన్ని యథావిధిగా పూర్తిచేసి ఐదువేల ఏనుగులను. లక్ష గుఱ్ఱాలను రత్నకాంచన సద్వస్త్ర కర్పూరాభరణ పూరితాలైన సంచులు వేసిన ఐదువేల ఒంటెలను సమర్పించినాడు. జగమంతా వాద్యనృత్యైక మయంగా మహోత్సవం చేసినాడు. బ్రాహ్మణ శ్రేష్ఠుల నెందరినో పూజించినాడు. వచ్చిన రాజులనందరినీ సమ్మానించినాడు.

అప్పుడు ఆకాశం పింజరవర్ణ భరితమైనది. త్వరలోనే రక్తారుణమౌతుందన్న దానిని అది సూచిస్తున్నట్టున్నది. దిక్కులంతటా వెనువెంటనే తుములాకుల శబ్దాలు నిండిపోయినవి. ఆకసంనుంచి పరసైన్యం రావడం చూచి. దిక్కులు భయపడిపోయినట్టు కానవచ్చినవి. అంతలో ఒక మహాప్రభంజనం వీచ సాగినది. ఖేచరులతో యుద్ధం కోసమై భూచరులను పైనికి ఎత్తుకొనిపోవుటకా అన్నట్టది వీచినది. ఒక క్షణంలో గగనంలో విద్యాధర సైన్యం అధికాధికంగా కానవచ్చినది. తమ దీధితితో దిక్చక్రాన్ని వెలిగిస్తూ. మహానాదం చేస్తూ, మహాజవంతో అది రాసాగినది. ఆ సైన్యమధ్యంలో అతిసుభగుడైన విద్యాధర కుమారు డొకడు సూర్యప్రభాదులకు కన్పించగా వారెంతో విస్మయం చెందినారు.

"ఆషాఢేశ్వరుని కుమారుడు దామోదరుడను ఈ యువరాజునకు జయము. ఓ మర్త్యుడా! నేలపై నున్నవాడా! ఈయన కాళ్ళపై పడవలసింది. ఓ జనమేజయుడా! ఈయనకు ప్రణమిల్లు. తగని చోటికి నీ కూతురిని ఇచ్చినావు. మా ప్రభువును ఆరాధించక పోతే ఆయన నిన్ను క్షమింపడు –" అని ఆ సమయంలో విద్యాధర వంది మాగధులు ఆకసంనుంచి దామోదరుని ముందు నిల్చొని ఉచ్చైస్స్వరంతో చాటినారు.

ఆ మాటవిని ఆ సైన్యాన్ని చూచి కత్తిడాలు ధరించి సూర్య ప్రభుడు క్రోధోద్రిక్తుడై తన విద్యాప్రభావంతో ఆకసంపై కెగసి నాడు. ఆయన వెంటనే మంత్రులు కూడా ఆయుధాలు ధరించి పై కెగసినారు. ప్రహస్తుడు, ప్రభాసుడు, భాసుడు, సిద్ధార్థుడు, ప్రజ్ఞాఢ్యుడు, సర్వదమనుడు, విహితభీతి, శుభంకరుడు మొదలైన వారందరూ తలపడగా విద్యాధరులతో మహాహవం ప్రవర్తిల్లినది.

దామోదరు డున్నచోటికి సూర్యప్రభుడు ముందుకు ఉరికి తన ఖడ్గంతో శత్రువులను పరిమార్చి వారి శస్త్రాదులను తనడాలుతో అడ్డుకుంటూ యుద్ధం చేసినాడు. తామేమో తక్కువమంది. ఖేచరు లేమో లక్షమంది. అయినా పరస్పర యుద్ధంలో సమానంగానే కన్పించినారు.

ఖడ్గలతలన్నీ ఆకులములై, రుధిరారుణములై వీరుల శరీ రాలపై యమధర్మరాజు దృక్కులవలె పడజొచ్చినవి. విద్యాధరులు భయంతో శరణుజొచ్చు తున్నట్టుగా తమ శరీరాలతో, శిరస్సులతో చంద్రప్రభుని ముందు నేలపై పడజొచ్చినారు. సూర్యప్రభుడు లోకదృష్టమైన ఖేచరశ్రీతో శోభిల్లినాడు. ఆకసమంతటా సిందూరం చల్లినట్టుగా రక్తారుణమైనది. సూర్యప్రభుడు ఖడ్గచర్మధరుడైన దామోదరునితో ఎదురొడ్డి పోరినాడు. యుద్ధంచేస్తూ కరణప్రయో గంతో లోన ప్రవేశించి ఖడ్గంతో డాలును ఖండించి శత్రువును భూమిమీద పడవేసినాడు. నేలపై దొరలుతున్న అతని తలను ఖండింప నుండగా ఆకసంలో విష్ణువు కనబడి హుంకారం చేసి నాడు. అది విని హరిని చూచి నమ్రుడై ఆయన మీది గౌరవంతో సూర్యప్రభుడు దామోదరుని చంపకుండా వదలివేసినాడు.

ఆ విధంగా విముక్తుడైన ఆ భక్తుని తీసుకొని విష్ణుమూర్తి ఎక్కడికో వెళ్ళిపోయినాడు. భగవంతుడు తన భక్తుని ఇహమందు పరమందూ కూడా రక్షిస్తాడుకదా! దామోదరుని అనుచరులందరూ ఎక్కడెక్కడికో వెళ్ళిపోయినారు. సూర్యప్రభుడు కూడా గగనం నుంచి తన తండ్రి వద్దకు దిగివచ్చినాడు. అమాత్యు లందరితో పాటూ గాయపడకనే వచ్చిన అతనిని తండ్రి చంద్రప్రభుడు అభి నందించినాడు. అతని పరాక్రమాన్ని చూచిన ఇతర రాజులందరూ ప్రశంసించినారు.

ఆ తర్వాత సంతుష్టులైన వారందరూ ఆ సంగతిని గురించి మాట్లాడుకొంటుండగా సుభట సంబంధి అయిన ఇంకొక దూత అక్కడికి వచ్చినాడు. అతను చంద్రప్రభుని ముందు ఒక లేఖను సమర్పించినాడు. దానిని తెరచి సిద్ధార్థుడు సభలో ఇలా చదివి నాడు.

"శ్రీమాన్ ఉన్నత వంశ మౌక్తికమణి అయిన చంద్రప్రభు సన్నిధికి. రాజు శ్రీ సుభటుడు శ్రీ కొంకణంనుంచి సాదరంగా ఇలా తెలియజేసు కొంటున్నాడు. ఎవరో తెలియకుండా రాత్రిపూట మా కుమార్తెను అపహరించుకొని పోయినారు. ఆమె మీ కుమారుని చేరినదన్న వార్త విని మేము సంతుష్టులమైనాము. ఆమెతో పాటూ మీ కుమారుని పిలుచుకొని మా ఇంటికి నిరభ్యంతరంగా వచ్చే ప్రయత్నం చేయవచ్చును. పరలోకం నుంచి తిరిగివచ్చి నట్టుగా మా కుమార్తెను భావించి ఆమెను చూచుకొని సంతోషించి వివాహోత్సవం జరిపిస్తాను."

ఈ విధంగా సిద్ధార్థుడు ఆ లేఖను చదివి వినిపింపగా చంద్ర ప్రభ మహారాజు ఆ దూతను సత్కరించినాడు. సంతోషించినాడు.

అలాగే ప్రహస్తుని పంపి సుభటుని కుమార్తె చంద్రికావతిని తండ్రి వద్దకు పంపించినాడు. ఉదయమే వారందరూ సూర్యప్రభుని ముందిడుకొని అపరాంత పట్టణానికి విమానంపై జనమేజయ సంయుతులై వెళ్ళినారు.

తనయా సంప్రాప్తితో సంతుష్టుడైన సుభట మహారాజు వారందరినీ సత్కరించి కన్యా పరిణయోత్సవాన్ని చేసినాడు. చంద్రికావతికి అనేక రత్నాదులను ఇచ్చినాడు. అది చూచి వీర భటాదులు తామిచ్చినవానిని తలచుకొని సిగ్గుపడినారు.

ఆ తర్వాత మామగారింటిలో సూర్యప్రభుడుండగా లావాణకం నుంచి కూడా పౌరవసంబంధి దూత వచ్చినాడు. అతనుకూడా చంద్రప్రభునికి నిజస్వామి వచనాన్ని వినిపించినాడు. తన తనయ సులోచనను సూర్యప్రభుడు కొని పోయెనని, అందుకు తాను సంతాప పడడం లేదని, అది యుక్తంగానే భావిస్తున్నానని అయితే తన ఇంటికి ఆమెను కొనివచ్చి వివాహవిధిని నిర్వర్తించి కొని పోవలసినదని కోరినాడు. ఆ మాటవిని సంతోషంతో చంద్రప్రభ నృపాలుడు ఆ దూతను సత్కరించి ప్రహస్తుని ద్వారా సులోచనను ఆమె తండ్రి వద్దకు చేర్పించినాడు.

ఆ తర్వాత సూర్యప్రభునితో పాటూ సుభటాదు లందరూ కలసి ధ్యానమాత్రంతో వచ్చిన విమానంపై నెక్కి లావాణకానికి వెళ్ళినారు. అక్కడ సూర్యప్రభసులోచనలకు వివాహోత్సవం జరిగినది. ఆయన కూడా రాజుల నందరినీ రత్నాదులతో ముంచి వేసినాడు. అలా ఆయన ఉపచారం పొందుతూ సుఖిస్తుండగా చీవనరేశ్వరుడు సురోహుడు కూడా ఒక దూతను పంపినాడు.

అతను కూడా వాని ముఖంగా ఇతరుల వలెనే ఎత్తుకొని పోయిన తన కుమార్తెను పిలుచుకొని తన గృహానికి రావలెనని అభ్యర్థించినాడు.

అంతట చంద్రప్రభ మహారాజు సంతుష్టుడై ఆ రాకుమారి విద్యున్మాలను ప్రహస్తునితో పిలిపింప జేసినాడు. మరునాడు విమానంలో సూర్యప్రభునితో పాటు చంద్రప్రభాదులు సర్వులూ పౌరవునితో పాటు చీనదేశం వెళ్ళినారు.

అక్కడ ఆ రాజు సురోహుడు తన కోటకు పిలుచుకొని వెళ్ళి తన కూతురునకు వివాహవిధిని నిర్వర్తించినాడు. విద్యున్మాలకు సూర్యప్రభునకు హేమ హస్త్యశ్వ రత్న చీనాంబరాదులను అసంఖ్యాకంగా బహూకరించినాడు. అక్కడ అనేక రకాల భోగాలను చంద్రప్రభాదులు అనుభవిస్తూ సురోహుడు అర్చిస్తుండగా కొన్నిదినాలు అందరూ హాయిగా ఉన్నారు! సూర్యప్రభుడు కూడా ప్రావృట్కాలం విద్యున్మాలతోవలె విలసద్ఘన యౌవనుడై విద్యున్మాలతో శోభిల్లినాడు.

ఈ విధంగా ఆ యా కాంతలతోకూడి సూర్యప్రభుడు అత్త వారిళ్ళలో భోగాలను అనుభవించినాడు. ఆ తర్వాత వారిని వీడ్కొని, సిద్ధార్థ ప్రముఖులైన మంత్రులతో కలిసి, క్రమంగా వీరభటాదులను అశ్వికసేనా సమేతులను వారి వారి దేశాలలో వదలిపెట్టి సురోహమహీపతితో సెలవు తీసుకొని, ఆయన పుత్రికతో కలిసి తండ్రితో, అనుచరులతో పాటూ భూతాసన విమానాన్నధిరోహించి, వ్యోమమార్గంలో తన పట్టణమైన శాకల నగరానికి కృతార్థుడై చేరుకొన్నాడు.

ఒకచోట నృత్యవినోదం, మరొకచోట సంగీత సంరంభం, ఇంకొకట పానక్రీడలు, మరొకట యువతీమండన విధి, వీటితో పాటూ లబ్ధాభీష్టులై స్తుతిస్తున్న వైతాళికుల శబ్దాలు ఆ పట్టణంలో ఆయన రాకతో కల్గిన ఆనందాన్ని సూచిస్తూ ప్రవర్తిల్లినవి.

అక్కడికి వారివారి తలితండ్రుల ఇండ్లలోనున్న ఇతర ప్రియురాండ్ర నందరనూ రావించి వారి తలిదండ్రులిచ్చిన గజాశ్వ నివహాదులతో పాటు నానారత్న సంపూర్ణ భార వినతాలైన అసంఖ్యాకాలైన ఒంటెలతో పాటూ, విలాసాలతో తమ దిగ్విజయ యాత్రవల్ల కల్గిన సంతోషాన్ని వెల్లడిస్తూ, ప్రజలు తమ కౌతుకాన్ని ప్రదర్శింపగా, బహువిధాలైన భూరివస్తు నిధానమై, మహాభోగి అయిన రాజనివాసంతో సుర ధనద భుజగ నగరాలతోసాటిగా ఆ శాకలనగరం ప్రకాశించినది.

ఆ తర్వాత మదనసేనతో కలిసి ఆ సూర్యప్రభుడు కోరిన సుఖాల ననుభవిస్తూ సకల సంపత్ప్రపూర్ణుడై హాయిగా తండ్రితో పాటూ మంత్రులతో పాటూ, భార్యలతోపాటూ సభాసదనంలో చేరి అనుదినమూ మయునికై నిరీక్షిస్తూ ఉండినాడు.

ఇది మహాకవి శ్రీ సోమదేవభట్ట విరచితమైన
కథాసరిత్సాగరంలో సూర్యప్రభ లంబకంలో
ప్రథమ తరంగం.

# ద్వితీయ తరంగం

## మయాసురుని రాక

ఒకసారి ఆస్థాన స్థితుడై చంద్రప్రభ భూపాలుడుండగా. సూర్యప్రభుడు సమగ్ర సచివాన్వితుడై అక్కడ ఉండగా సిద్ధార్థుడు చెప్పిన కథా ప్రసంగంరాగా హఠాత్తుగా సభామధ్యంలోని భూమి చీలినది. ఆ భూవివరం నుండి విపరీతమైన శబ్దంతో సురభిళమైన గాలి పైకి లేచినది. ఆ తర్వాత అందులో నుంచి మయాసురుడు పైకి వచ్చినాడు. ఆ మయాసురుడు పర్వతం వలె నున్నాడు. అతని నల్లటి ఉన్నత శిరశ్శిఖరంపై కేశరూపంలో మహౌషధులు. ఆయన శరీరంపై రక్త వస్త్రరూపంలో వివిధ ధాతువులు వెలుగొందుతున్నవి. చంద్రప్రభ మహారాజు యథార్హంగా పూజించి రత్నాసనంపై ఉపవిష్టుని చేయగా ఆ దానవేంద్రు డిట్లా అన్నాడు:

"భౌతికమైన ఈ భోగాలను మీరు ఇప్పుడు అనుభవించినారు. ఇక మరికొన్నిటికై కృషిచేయవలసి ఉన్నది. ఇప్పుడు వాటిని గురించి ఆలోచించండి. దూతలను పంపి మీ సబంధి బాంధవులైన రాజుల నందరినీ పిలిపించండి. విద్యాధరేంద్రుడైన సుమేరువును కలుద్దాం. శ్రుతశర్మను జయింతాం. విద్యాధర లక్ష్మిని పొందుదాం. సుమేరువు కూడా బంధుబుద్ధితో మనకు సహాయ పడుటకై అక్కడ సిద్ధంగా నున్నాడు. సూర్యప్రభుని రక్షించి అతనికి నీ కూతునిమ్మని తొలుతనే భగవానుడు పినాకపాణి అతనిని ఆదేశించి ఉన్నాడు కదా।"

ఈ విధంగా మయాసురుడు చెప్పగా ప్రహస్తాదులను గగన చారులను సర్వమహీపతుల దగ్గరకు చంద్రప్రభుడు దూతలుగా పంపించినాడు. సూర్యప్రభుడు తన విద్యల నన్నిటినీ స్వభార్యా మంత్రులందరికీ మయుని ఆదేశం ప్రకారం ఇంతకు ముందు ఉపదేశించని వానిని ఇప్పుడు ఉపదేశించినాడు.

## నారదుని ఆగమనం

ఈ విధంగా వారు సభలో ఉండగనే దిక్కులను ప్రభా భాసితం చేస్తూ ఆకసం నుంచి నారదముని దిగివచ్చినాడు.

చంద్రప్రభ నృపాలుడు అర్ఘ్యపాద్యాదులనిచ్చి కూర్చుండ బెట్టిన తర్వాత ఆయన ఇట్లా అన్నాడు: "ఇంద్రుని కోరికపై నేనిక్కడకు వచ్చినాను. ఆయన నీకిట్లా చెప్పమన్నాడు. మహేశ్వరుని ఆనతిపై అజ్ఞాన మోహితుడైన మయాసుర సఖుడు ఈ మానవ శరీరంతోనే సూర్యప్రభుని మహోన్నతమైన సర్వ విద్యాధరాధీశ చక్రవర్తి పదవి సాధింపవలెనని మీరు కోరుతున్నట్టు నాకు తెలిసినది. అది సరే. మేము శ్రుతశర్మకు విద్యాధరకుల జల నిధి చంద్రపదవిని దత్తం చేసి ఉన్నాము. అతనికది క్రమాగత మైనది. మమ్ముల నెదిరించి మీరు ధర్మవిరుద్ధంగా ఏదైనా చేస్తే అది సర్వవినాశానికి కారణం కాగలదు.

— పూర్వం రుద్రయజ్ఞాన్ని చేయవలెనని యత్నించగా తొలుత అశ్వమేధయాగం చేయవలసిందని నేను చెప్పాను. నీ వలా చేయలేదు. ఆ విధంగా దేవతలతో నిమిత్తం లేకుండా రుద్రా దేశంతో నైనాసరే నీవేదైనా ఆచరిస్తే ఆ దర్పం నీదేకానీ శివునిది కాదు."

ఈ విధంగా ఇంద్ర సందేశాన్ని ఇంద్రుడు వినిపింపగా నవ్వుతూ మయుడిట్లా అన్నాడు :

"మహామునీ! సురేంద్రుడు చెప్పినది సరికాదు. సూర్య ప్రభుడు మానవుడనడం అపార్థకం. దామోదర సంగ్రామంలో ఆ సంగతి తెలిసిపోలేదా? మానవులే సత్త్వాఢ్య సర్వసిద్ధ్యర్థ కారణులై పూర్వం నహుషాదులు ఇంద్రపదవిని సాధించలేదా? ఇక శ్రుత శర్మకు సామ్రాజ్యం తానర్పించెనని అది అతనికి క్రమాగత మని చెప్పడం కూడా సమంజసం కాదు. దాత మహేశ్వరుడే అయి నపుడు ఆయనే ప్రమాణం. ఇందులో మరొకరి ప్రమేయంలేదు. హిరణ్యాక్షుని జ్యేష్ఠాగతమైన ఇంద్రత్వం ఏ విధంగా అపహృత మైనది? మరి తమకు విరోధమిది అని, అధర్మమని అనడంకూడ అబద్ధం. మాపై అతడే స్వార్థంతో హఠాత్తుగా వైరుధ్యం వహించి ఉన్నాడు.

"ఇందులో అధర్మమేమున్నది? మేము మా పరిపంథిని జయించదలచు కొన్నాము. మేము ఏ ముని భార్యనూ అపహ రించుటలేదు: ఏ బ్రహ్మ హత్యకూ పాల్పడుటలేదు.

— ఇక అశ్వమేధం చేయకపోవడం దేవతలను అవజ్ఞ పరచినట్టని అనడంకూడా సరికాదు. రుద్రయజ్ఞమే చేసిన తర్వాత మిగతా అధ్వరములతో ఏమి పని? దేవదేవుడైన శంభునే అర్చించిన తర్వాత ఏ దేవుని అర్చించినట్టు కాదు?

ఒక రుద్రుని మీద ఆస్థతోనే ప్రవర్తించడం శుభంకరం కాదన్నది సరికాదు. ఎక్కడ మహేశ్వరుని ప్రసక్తిఉన్నదో అక్కడ మిగతా దేవతలతో పని ఏమి? సూర్యు డుదయించగా ఇతర తేజస్సులు ప్రకాశించునా?

కాబట్టి ఓ మహామునీ! ఈ సర్వ వృత్తాంతాన్నీ దేవరాజునకు తామే చెప్పవలసింది. మేమేమో మా ప్రస్తుతాన్ని నిర్వర్తిస్తాము. తనకు తోచినట్టు ఆయన చేయవచ్చును."

ఈ విధంగా మయాసురుడు చెప్పగా నారదమహర్షి అట్లేనని ఆ ప్రతిసందేశాన్ని తీసుకొని దేవేంద్రుని వద్దకు వెళ్ళినాడు.

ఆ విధంగా నారదుడు వెళ్ళిపోగా ఇంద్రసందేశాన్ని విని తటపటాయిస్తున్న చంద్రప్రభ భూపతి నుద్దేశించి మయాసురుడిట్లన్నాడు:

"రాజా! ఇంద్రునికి మనం భయపడవలసిన పనిలేదు. ఒకవేళ శ్రుతశర్మ మన మీది పగతో దేవగణాలను కూడ కలుపుకొని ఎత్తి వచ్చినా మన పక్షంలో అసంఖ్యాకులైన అనేక దైత్య దానవులు ఉన్నారు. మనలను అనుగ్రహించి త్రిపురాంతకుడే అందుకు ఉద్యుక్తుడు కాగా ముల్లోకాలలోనూ ఎదిరించడానికి ఏ మరొక దరిద్రునకు శక్తికలదు? ఆ వీరులందరూ ఏంచేస్తారో చెయ్యనీ."

ఈ విధంగా మయుడు చెప్పగా వారందరూ అందుకు ఆమోదం తెల్పినారు. ఆ తర్వాత దూతలతో పంపిన సందేశం మూలంగా క్రమంగా సర్వరాజులు అక్కడికి వచ్చినారు. వీరభటాదులే కాక ఇతర మిత్ర బంధువులంతా వచ్చినారు.

సైన్యసమేతులైన ఆ రాజులకు ఉచిత మర్యాదలు చేసిన తర్వాత మయాసురుడు తిరిగి చంద్రప్రభ భూపతితో ఇట్లన్నాడు:

"ఓ మహారాజా! ఇప్పుడు ప్రతిరాత్రీ రుద్రునకు మహాబలిని ఇవ్వవలసింది. నేను చెప్పిన విధివిధానంతో అన్నిటినీ నిర్వర్తించవలసింది"

ఈ మయుని మాట విని చంద్రప్రభ భూపతి రుద్రునకు కావలసిన బలి సంభారాన్ని తక్షణమే సమీకరింప జేసినాడు. ఆ తర్వాత రాత్రి అడవికి వెళ్ళి మయుడు ధర్మోపదేష్ట కాగా చంద్ర ప్రభుడు స్వయంగా రుద్రునకు భక్తితో బలిప్రదానం చేసినాడు.

హోమకర్మ జరుగుతుండగా రాజు అనుకోకుండా సాక్షాత్తూ భూతగణాధిపతి అయిన నంది అందులోనుంచి ఆవిర్భవించినాడు. ఆయనను విధిపూర్వకంగా అర్చింపగా, హర్షించి ఇలా అన్నాడు: "స్వయంగా మహేశ్వరుడు నా ముఖంగా ఇట్లా ఆదేశిస్తున్నాడు-నా అనుగ్రహంవల్ల వంద ఇంద్రులు కలిసి వచ్చినా నీకు భయమేమీ లేదు. సూర్యప్రభుడు విద్యాధరులకు చక్రవర్తి కాగలడు."

ఈ విధంగా శంకరాదేశాన్ని వినిపించి బలి భాగాన్ని పరిగ్రహించి నందీశ్వరుడు భూతగణాలతోపాటు తిరోధానంచెందినాడు. ఆ తర్వాత తనయుని అభ్యుదయంపై విశ్వాసంకలిగి చంద్రప్రభ భూపతి బలిని సమాప్తిచేసి హోమం ముగిసిన తర్వాత మయునితో పాటూ పట్టణంలో ప్రవేశించినాడు.

ఆ ఉదయం దేవితోను, పుత్రునితోను, మంత్రులతోనూ ఏకాంతంలో ఉండగా ఆ చంద్రప్రభ భూపాలునితో మయుడిట్లా అన్నాడు:

"రాజా! విను. చిరకాలం నుంచి రక్షించుకుంటూ వస్తున్న ఒక రహస్యాన్ని నీ కిప్పుడు చెప్తాను విను. 'నీవు దానవుడవు. సునీథుడనే పేరు గలవాడవు. మహాబలుడవు నా పుత్రుడవు. సూర్యప్రభుడు సుముండీకుడు అనే పేరుగల నీ తమ్ముడు. మీ రిరువురు దేవతల యుద్ధంలో మడిసి తండ్రీ కొడుకులుగా పునర్జన్మ నెత్తినారు.

అనీ దానవశరీరాన్ని నేను భద్రపరచినాను. యుక్తితో దివ్యములైన ఓషధులతోనూ, నేతితోనూ, దానికి ఆలేపనం చేసినాను.

అందువల్ల ఈ వివరంలో ప్రవేశించి పాతాళానికి వెళ్ళి నేను చెప్పిన యుక్తితో నీ శరీరంలో నీవు తిరిగి ప్రవేశించు. ఆ శరీర ప్రవేశంతో తేజోవీర్య బలాధికుడవై యుద్ధంలో ఖేచరులను అందరనూ జయింపగలవు. సుముండీకావతారుడైన సూర్యప్రభప్రభుడు ఈ మనోహర శరీరంతోనే చిరకాలం జీవించి ఖేచరేశ్వరుడు కాగలడు."

ఈ మయాసురుని మాట విని ఆనందించి రాజు చంద్రప్రభుడు సంతుష్టుడైనాడు.

సిద్ధార్థుడు అప్పుడిట్లా అన్నాడు. "అన్యదేహాన్ని ప్రవేశించినట్టయితే ఈయన చనిపోయెనే అని భ్రాంతిపడే మాకు ధైర్యమెలా వస్తుంది? అదే కాక ఓ దానవోత్తమా! ఈయన దేహాంతర స్థితుడై, పరలోకగతుడై అప్పుడు మమ్ములనందరినీ మరచిపోవచ్చును. అప్పుడు ఆయన ఎవరు? మేమెవరము?"

ఈ విధంగా సిద్ధార్థుడనగా మయాసురుడిట్లన్నాడు:

"ఈయన యోగప్రభావంతో ఆ శరీరంలో ప్రవేశిస్తాడు. నీవే స్వయంగావచ్చి అక్కడ చూడవచ్చును. ఆయన మిమ్మల్ని మరచిపోడు. దానికి కారణం చెప్తాను వినండి —

—అస్వతంత్రుడై మృతి చెంది ఇంకొక గర్భంలోపడి మరల జన్మించినవాడు మరణాదులైన క్లేశాల మూలంగా పూర్వజన్మ స్మృతిని గోల్పోతాడు. తాను కోరి యోగప్రభావంతో పరకాయ

ప్రవేశం చేసినవాడు అవిప్లుత మనోవిధి అయి అదే అంతః-కరణముతో, అవే ఇంద్రియాలతో ఒక గృహంనుండి మరొక గృహమునకు వెళ్ళినట్టుగా జ్ఞానిఅయి. యోగీశ్వరుడై సర్వాన్నీ జ్ఞాపకం పెట్టుకొంటాడు.

— కాబట్టి మీరేమీ వికల్పం చెందనక్కరలేదు. పైగా ఈ మహారాజు దివ్యమూ. జరారోగ వివర్జితమూ అయిన శరీరాన్ని పొందుతాడు. దానవులైన మీరందరూ రసాతలంలో ప్రవేశించి సుధాపానంతో రోగరహిత దివ్యదేహాలను పొందగలరు."

ఈ మయాసుర వచనాన్ని విని వారందరూ సరేనని ఆయన మీది నమ్మకంతో శంకారహితులైనారు. ఆయన వాక్యంతో మరు నాడు ఆ రాజులందరూ సమావేశం కాగా వారితోపాటు చంద్ర ప్రభుడు చంద్రభాగా (చేనాబ్) ఇరావతి (రావి) నదుల సంగమ స్థలానికి వెళ్ళినాడు.

అక్కడ రాజుల నందరినీ బయట ఉంచి. సూర్యప్రభుడు తన అవరోధ జనంతో పాటూ సమీపించి, మయుడు చూపించిన వివరం లోనికి ప్రవేశించినాడు. చంద్రప్రభుడు దేవితోపాటు సిద్ధార్థాదులైన మంత్రులతో పాటూ అందులో ప్రవేశించి, సుదీర్ఘ మైన మార్గాన్ని గడచి అక్కడ దివ్యమైన దేవకులంలో వారంద రితో పాటూ ప్రవేశించినాడు.

అప్పుడు ఆ వివరానికి బయటనున్న రాజులందరినీ. విద్యాధరులు తమ సేనలతో పాటు పై నుంచి దిగి ముట్టడించినారు. తమ మాయలతో వారిని స్తంభింపజేసి. సూర్యప్రభుని భార్యలను అపహరించినారు. ఆ సమయంలో ఆకాశవాణి ఇలా వినబడినది.

"ఓరీ శ్రుతశర్మా! పాపిష్ఠివాడా! చక్రవర్తి భార్యలను నీవు స్పృశించినట్టయితే మీ సైన్యంతో పాటూ మృత్యువు పాలవుతావు. కాబట్టి వారిని నీ తల్లులలాగా చూసుకొనవలసింది. గౌరవంతో వారిని రక్షించవలసింది. ఇప్పుడే మిమ్మల్ని చంపి వారిని విడిపించక పోవడానికి ఒక కారణమున్నది. అందువల్ల ఇప్పటికి వారు నీతోనే ఉండనీ."

ఈ విధంగా ఆ దివ్యవాణి వినరాగా విద్యాధరులు తిరోహితులైనారు. వీరభటాదిరాజులు ఆ రాణులను కొనిపోవడం చూస్తూ అన్యోన్య యుద్ధంలో దేహత్యాగం చేయడానికి సిద్ధపడినారు. ఆ సమయంలో అశరీరవాణి ఇలా వినిపించినది: మీరీ సాహసాన్ని చేయవద్దు. మీకు శుభం కలుగుతుంది."

ఇందుతో వారు తమ ఉద్యమాన్ని మానుకున్నారు. ఆ తర్వాత అక్కడే ఉండి ఆ రాజులందరూ నిరీక్షిస్తున్నారు.

ఈలోగా పాతాళంలో దేవకులంలో సర్వ మంత్రులతో సంయుతుడై ఉన్న చంద్రప్రభునితో మయుడిట్లన్నాడు: "ఓ రాజా! ఏకాగ్రచిత్తంతో దీనిని వినవలసింది. పరకాయ ప్రవేశం చేయు విద్యను ఉపదేశిస్తాను."

అని చెప్పి లేచి రహస్యమైన సాంఖ్యాన్ని, యోగాన్ని, ఆ ప్రయోగాన్ని, మరొక శరీరంలో ప్రయోగించే యుక్తినీ అతను ఉపదేశించినాడు. ఆ యోగీంద్రుడు, ఈ సిద్ధి నీకు కలగగలదని, జ్ఞానవంతుడవు కాగలవని, స్వాతంత్ర్యము, ఐశ్వర్యము, అణిమాది సిద్ధులు నీకు లభింపగలవని అన్నాడు. ఈ ఐశ్వర్యము ఉండగా నరేశ్వరులు మోక్షాన్ని వాంఛింపరు. ఇందుకోసమై కొందరు జప

తపక్లేశాదులను సహిస్తారు. స్వర్గభోగాలు లభించినా మహనీయులు దానిని అభిలషించరు. ఈ విషయంలో మీకు ఒక కథచెప్తాను వినవలసింది:

## కాలుడనే బ్రాహ్మణుని కథ

పూర్వకల్పంలో కాలుడను పేరుగల ఒక మహాబ్రాహ్మణుడున్నాడు. అతను పుష్కరతీర్థానికివెళ్ళి అహర్నిశలూ జపం చేసినాడు. ఆ జపంతో అతనికి రెండువందల దివ్యవత్సరాలు గడచినవి. అప్పుడు అతని శిరస్సు నుంచి ఒక జ్వాల గొప్పగా బయటకి వెడలినది. అది వేయిసూర్యులు వెలుగుతున్నట్టుగా ఆకసమంతా ఆక్రమించి. సిద్ధాదులను నిరోధించి జగత్త్రయాన్నే జ్వలింప జేసినది.

బ్రహ్మేంద్రాదులు అప్పుడు అతని వద్దకు వచ్చి: "ఓ బ్రాహ్మడా! నీకు ఇష్టమైన వరంకోరుకో. ఈ జ్వాలతో ముల్లోకాలూ మండిపోతున్నవి" అన్నారు. "ఆ జపాన్నిమాని నేను మరొక దాని నపేక్షింపను. మరొక వరాన్ని కోరుకొనను" అని అతను వారికి జవాబిచ్చినాడు. వారు మరీ బలవంత పెట్టగా అక్కడినుంచి దూరంగావెళ్ళి ఉత్తరదిశలోని హిమవత్పర్వత పార్శ్వంలో తిరిగి జపం చేసుకుంటూ కూర్చున్నాడు.

అక్కడకూడ సహింపరాని అతని తేజస్సు క్రమంగా వ్యాపించసాగినది. దానిని విఘ్నం చేయుటకై ఇంద్రుడు సురస్త్రీలను పంపించినాడు.

ఆ ధీరుడు వారెంత ప్రలోభపెట్టినా, గడ్డిపోచతో సమానంగా కూడా చూడలేదు. అతనివద్దకు దేవతలప్పుడు మృత్యువును దూతగా పంపించినారు.

ఆ మృత్యువు అతని వద్దకు వచ్చి: "మానవులు ఇంతకాలం జీవించరు. కాబట్టి నీవు ఆత్మత్యాగం చేయవలసిందే. దైవ మర్యాదను ఉల్లఘించవద్దు." ఆ మాటవిని ఆ బ్రాహ్మడు ఇట్లా అన్నాడు: "నా ఆయుస్సు పరిపూర్తి అయ్యేఉంటే మరి నీవు నిరీక్షించడ మెందుకు? నన్ను కొనిపోవచ్చుగదా! నా అంతట నేను ప్రాణ త్యాగం చెయ్యను. ఓ పాశహస్తుడా! అలా అయితే ఆత్మఘాతి నవుతాను. శరీరాన్ని నా అంతట నేను వదలివేసినట్టు అవుతుంది."

ఈ విధంగా మాట్లాడుతున్న అతనిని కొనిపోవడానికి తన ప్రభావం అశక్తం కాగా మృత్యువు పరాఙ్ముఖుడై వచ్చిన దారిని బట్టి వెళ్ళిపోయినాడు. ఆ తర్వాత కాలాన్ని జయించిన ఆ విప్రుని ఇంద్రుడు బలాత్కారంగా చేతులలో ఎత్తుకొని స్వర్గానికి తీసుకొని పోయినాడు.

అక్కడ కూడా ఆ భోగాలపై ఆసక్తి లేక ఆ బ్రాహ్మడు జపాన్నుంచి విరమించలేదు. దేవతలు అవతరింపజేయగా తిరిగీ అతను హిమాలయానికే వెళ్ళినాడు.

అక్కడ కూడా ఇంద్రాదులు తిరిగీ వరం కోరుకొమ్మని బోధింపసాగినారు. ఆ సమయంలో ఆ మార్గాన ఇక్ష్వాకు మహారాజు వెళుతూ ఉండినాడు. అతనీ సంగతి యావత్తూ తెలుసుకొని జపం చేస్తున్న అతనితో ఇట్లన్నాడు:

"నీకు దేవతల నుంచి వరం పొందడం ఇష్టం లేకపోతే నేనిస్తాను తీసుకో." అ మాట విని నవ్వుతూ ఆ జాపకుడు (జపం చేసేవాడు) ఆ రాజుతో ఇట్లన్నాడు: "దేవతల నుంచి కూడా పర దానం కోరని నాకు వరమివ్వడానికి నీవు శక్తుడవా?"

ఆ మాట విని ఇక్ష్వాకు మహారాజు తిరిగి ఇట్లా అన్నాడు: "పోనీ నీకు వరమిచ్చే శక్తి నాకు లేకపోతే సరే. నీకే ఆ శక్తి ఉంటే నాకొక వరమివ్వవలసింది."

అప్పుడు ఆ జపం చేస్తున్నతను "నీకేం కావలెనో కోరుకో. నీ కా వరమిస్తాను" అన్నాడు.

ఆ మాటవిని రాజు లోలోన విమర్శించుకొన్నాడు: "ఇతను విప్రుడు. నేనిస్తే తీసుకోవడం ధర్మం. అత నిచ్చిన దానిని నేను తీసుకోవడం విపరీతం" అని ఈ విధంగా ఆ రాజు విచికిత్స చేసుకొంటూ ఆలస్యం చేయగా అక్కడికి పరస్పరం వివాదపడుతున్న ఇద్దరు విప్రులు వచ్చినారు.

వారు రాజును చూచి న్యాయార్థం ఇట్లన్నారు. అందులో ఒకతనన్నాడు కదా: "ఇతడు దక్షిణతో సహా నాకొక గోవును దానం చేసినాడు. దానినే నేను తిరిగి ప్రతిదానం చేస్తుండగా ఇతనెందుకు తీసుకోడు?"

ఇంకొకతను కూడా "నేనింతకు పూర్వమెప్పుడూ ఒకరితో ఏదీ పరిగ్రహించలేదు. నేనేమీ అడగనప్పుడు ఇతను బలాత్కారంగా ఆ గోవును తిరిగి ఎలా దానం చేయగలడు?" అని చెప్తుండగా రాజువద్దకు ఇంద్రుడువచ్చి మాటకడ్డుపడి ఇట్లన్నాడు: "ఓ రాజా! న్యాయం అనేది నీకు తెలిసేఉంటే, ఈ జపం చేస్తున్న బ్రాహ్మణుని నుంచి ఒక వరాన్నడిగి ఇప్పుడు నీ వెందుకు పరిగ్రహించడం లేదు?"

అప్పుడు నిరుత్తరుడైన రాజు ఆ జపపరతంత్రుడైన బ్రాహ్మణునితో ఇట్లన్నాడు: "భగవాన్! మీరు చేసిన జపంవల్ల వచ్చేఫలంలో సగపాలు నాకు వరంగా ఇవ్వవలసింది" అనగా

"అలాగే నాజపఫలంలో సగపాలు నీ పరమగుగాక" అని ఆ రాజు నకు ఆ తపస్వివరమిచ్చినాడు. అందుమూలంగా ఆ రాజు సర్వ లోక గతిని సంపాదించుకున్నాడు. ఆ జాపకుడు కూడా శివాఖ్యా నంగల దేవలోకానికి వెళ్ళినాడు. అక్కడ అనేక కల్పాలు నివసించి తిరిగీ భూతలానికి వచ్చి స్వాతంత్ర్యాన్ని పొంది యోగం మూలంగా శాశ్వతసిద్ధిని లభింపజేసుకున్నాడు.

ఈ విధంగా స్వర్గాదులపై విముఖులైన సిద్ధులు కోరునట్టి స్వతంత్రమైన నీ దేహంలో నీవు ప్రవేశించు.''

ఈ విధంగా యోగపూర్వకంగా మయుడు చేసి అత్యంత సంతోషాన్ని పొందినాడు. భార్యలతోను, తనయుడితోను. అమా త్యులతోనూ, చంద్రప్రభరాజు అక్కడనుంచి ద్వితీయమైన పాతాళానికి మయుడు కొనిపోగా. ఒక దివ్యభవనం లోనికి తన వారందరితో ప్రవేశించినాడు.

అక్కడ వారందరికీ ఒక పురుషుడు కనిపించినాడు. ఒక ఉత్తమ శయనంపై పడుకొని నిద్రపోతున్నట్టుగా ఆ మహాపురుషు డున్నాడు. మహౌషధులతోనూ, ఘృతంతోనూ పరిలిప్తుడై వికృతా కృతి భీషణుడుగా ఉన్న అతని చుట్టూ దైత్యరాజు సతులు విషణ్ణ వదనలై ఉన్నారు.

అప్పుడు మయాసురుడు చంద్రప్రభుని చూచి: "ఇదే నీ నిజదేహం. పూర్వభార్యాపరివృతమై ఉన్నది. దీనిలో నీ విప్పుడు ప్రవేశించ వలసింది" అని అన్నాడు.

ఆ తర్వాత అతనే ఉపదేశించిన ఆ యోగాన్ని అవలంబించి ఆ భూపతి ఆ పురుష దేహంలోనికి తన ఇప్పటి దేహం వదలిపెట్టి

ప్రవేశించినాడు. అప్పుడు ఆవులించి మెల్లగా కన్నులు తెరచి నిద్రనుండి లేచినట్టుగా ఆ శయనం మీది పురుషుడు లేచి కూర్చున్నాడు. దైవవశాత్తూ మనరాజు సునీథుడు తిరిగి బ్రతికినాడని అక్కడి దానవవధువులు అందరూ గట్టిగా తమ సంతోషాన్ని ప్రకటించినారు.

మరి సూర్యప్రభాదులేమో చంద్రప్రభుని దేహం విగత జీవితమై క్రిందపడిపోవడం చూచి హఠాత్తుగా విషణ్ణులైనారు. చంద్రప్రభ సునీథుడు సుఖనిద్రనుంచి లేచినట్టుగా లేచి, మయుని చూచి ఆ తండ్రికి పాదాభివందనం చేసినాడు. ఆ తండ్రికూడా అతని నాలింగనం చేసుకొని సర్వుల సన్నిధిలో: "కుమారా; నీ కేమైనా జ్ఞాపక మున్నదా? నీ విప్పుడు రెండు జన్మలలో నున్నావు?" అని ప్రశ్నించినాడు.

అతను కూడా జ్ఞాపకమున్నదని చెప్పి తన చంద్రప్రభ జన్మలోని సంగతిని సునీథ జన్మలోని సంగతిని కూడా తెలియ జెప్పినాడు.

పేరుపేరునా తన దేవేరులను పిలుస్తూ సూర్యప్రభాదులను ఒక్కొక్కరినే ఓదార్చినాడు. అలాగే తన పూర్వభార్యలైన దానవ స్త్రీలను కూడా ఆశ్వాసింప జేసినాడు.

చంద్రప్రభ జన్మలోని దేహం రెండు రాజ్యాలకు సంబంధించినది కనుక ఎప్పటికైనా పనికిరావచ్చునని సురక్షితంగా ఉంచినాడు.

ఆ తర్వాత అభినందిస్తూ, ప్రణమిల్లుతూ నమ్మకం కల్గినందువల్ల నిర్వృతులై చంద్రప్రభసునీథుని సూర్యప్రభాదులు హర్షించినారు.

అంతట మయాసురుడు అలా సంతుష్టులైన వారందరినీ తీసుకొని మరొక హేమరత్నఖచితమైన పట్టణంలో ప్రవేశింప జేసినాడు. అక్కడ వైడూర్యతటాకాన్ని చూచి దాని నిండా సుధా రసం నిండిఉండుటను గమనించినారు. దాని ఒడ్డున వారందరూ ఉపవిష్టులైనారు. అమృతాధికమైన ఆ సుధారసాన్ని సునీథ భార్యలకిచ్చి విచిత్రమణిచషకాలలో నింపి అంతాత్రాగినారు. ఆ పానంతో వారందరూ మత్తులై నిదురించి లేచినట్టుగా దివ్య దేహాలతో మహాబల పరాక్రమ సంపన్నులైనారు.

అప్పుడు మయాసురుడు చంద్రప్రభ-సునీథునితో ఇట్లన్నాడు: "కుమారా! నాతో రా చిరకాలానికి నీతల్లిని చూతువుగాని." అందుకు సరేనని మయుడు దారి తీస్తుండగా ఆయన వెంట సునీథుడు సూర్యప్రభాదులతో కలిసి నాల్గవ పాతాళలోకానికి వెళ్ళినాడు. అక్కడ నా నా ధాతుమయాలైన చిత్రాలను చూస్తూ. అనేక పట్టణాలను చూస్తూ. సర్వహిరణ్మయమైన ఒక పట్టణాన్ని చేరు కొన్నారు.

అక్కడ రత్నమయస్తంభాలతో సర్వ సంప న్నికేతనంగా ఉన్న భవనంలో సునీథునితల్లి మయునిభార్య అయిన లీలావతిని చూచినారు. రూపంతో ఆమె దేవతాస్త్రీల నందరినీ అధఃకరిస్తున్నది. సర్వాభరణ భూషిత అయి ఉన్న ఆమె చుట్టూరా అసురకన్యలు పరివేష్టించి ఉన్నారు. ఆమె సునీథుని చూడగానే తత్తరపాటున లేచినది. సునీథుడు కూడా నమస్కరిస్తూనే ఆమె పాదాలపై పడినాడు.

ఆ తర్వాత ఒడలంతా తడివిచూచి, ఆలింగనం చేసుకొని, కన్నీరువిడుస్తూ, తనకుమారుడు తిరిగి లభించినందుకు తన భర్త

మయుని ప్రశంసించినది. అప్పుడు మయుడు: "ఓ దేవీ! నీ ఇంకొక కుమారుడు సుముండీకుడు నీ కొడుకునకు కొడుకుగా పుట్టినాడు.అతనే ఈ సూర్యప్రభుడు. ఇతను విద్యాధరేంద్రులకు చక్రవర్తిగా ఈ శరీరంతోనే అభిషిక్తుడు కాగలుగునట్లు మహేశ్వరుడు ఈయనను నిర్దేశించినాడు."

ఇది విని కుతూహలంతో అతని వేపు చూడగా, తన మంత్రులతో పాటూ సూర్యప్రభుడు ఆమెకు పాదాభివందనం చేసినాడు. "సుముండీకుని దేహంతో పని ఏమిటి? కుమారా! నీ వీ శరీరంతోనే శోభిల్లుతున్నావు" అని లీలావతి వానిని ఆశీర్వదించి పలుకరించినది.

ఆ తర్వాత పుత్రాభ్యుదయంతో కుమారి మండోదరిని, విభీషణుని మయుడు స్మరింపగా వారు స్మరణమాత్రంతో అక్కడికి విచ్చేసినారు. ఉత్సవ సత్కారాదుల నందుకొని విభీషణుడిట్లా అన్నాడు: "నా మాట వినేటట్లుంటే ఓ దానవేంద్రా! చెప్తాను. దానవులలోకెల్లా నీ వొక్కడివే సుకృతివి. శుభజీవివి. అనవసరంగా దేవతలతో నీవు విరోధం పెట్టుకోనక్కరలేదు. ఆ విరోధం వల్ల అపాయం తప్పితే రాగల లాభమేమీలేదు. సురలెందరో అసురులను నిహతులను చేసినారు. అసురులుమాత్రం సురలను చంపలేక పోయినారు."

ఆ మాటవిని మయుడుకూడా ఇట్లన్నాడు: "మే మేమీ బల ప్రయోగాన్ని తలపెట్టము. కానీ హఠాత్తుగా ఇంద్రుడేదైనా చేస్తే ఎలా సహించగలము? ఆ దేవతలచేత హతులైన మన అసురులందరూ పొరబడినారు, అప్రమత్తులుగా ఉన్న బలి ప్రహ్లాదప్రభృతులు మాత్రం హతులు కాలేదు కదా!"

ఈ విధంగా మయుడు చెప్పగా మండోదరితో కలిసి రాక్ష సేంద్రుడైన విభీషణుడు అతనిని వీడ్కొని తన నివాసానికి వెళ్ళి పోయినాడు. సూర్యప్రభాదులతో కలిసి సునీథుడు మయునితో పాటు బలిచక్రవర్తిని చూడడం కోసం మూడవపాతాళ లోకానికి వెళ్ళినాడు. స్వర్గానికంటే ఉత్తమమైన ఆ లోకంలో బలిచక్రవర్తిని చూచినారు. ముత్యాలహారాలతో, కిరీటంతో ప్రకాశిస్తూ దితిజదానవులతో పరివృతుడై ఉన్నాడాయన. సునీథాదులు వరుసగా సాష్టాంగపడినారు. ఆయనకూడా యథోచితంగా వారిని సత్కరించి సమ్మానించినాడు.

మయుడు నివేదించిన వృత్తాంతాన్ని విని సంతోషించిన బలి వెంటనే ప్రహ్లాదుని, ఇతర దానవులను పిలిపించినాడు. సునీథాదులందరూ వారికి కూడా సాష్టాంగ నమస్కారం చేసినారు. వినమ్రులైన వారిని పట్టలేని ఆనందంతో వారు అభినందించినారు.

అప్పుడు బలి ఇట్లా అన్నాడు: "ఇతను చంద్రప్రభుడుగా భూలోకంలో ఉన్నప్పటికి ఇప్పుడు సునీథుడు తన స్వదేహ ప్రాప్తితో ప్రత్యుజ్జీవితుడైనాడు. సుముండీకుని అవతారమైన సూర్యప్రభుడితడు. మహేశ్వరుడు భావివిద్యాధర చక్రవర్తిగా ఇతనిని నియమించినాడు. ఈయన చేసిన యజ్ఞప్రభావం వల్ల నా బంధనాలు విడిపోయినవి. వీరు మనకు లభించడంవల్ల అభ్యుదయం కాగలదు."

ఈ బలి మాటలనువిని వారి గురువైన శుక్రుడు ఇట్లన్నాడు: 'ధర్మంతో చరిస్తే, సత్యాన్ని ఆచరిస్తే అభ్యుదయం కలుగకుండా పోదు. అందువల్ల ధర్మంగా ప్రవర్తించండి. నా మాట ననుసరించి ప్రవర్తించండి."

ఆ మాట విని దానవులందరూ అలాగేనని శపథం చేసినారు. సప్త పాతాళాధీశ్వరులూ అక్కడ సమ్మిళితులైనారు. సునీథ ప్రాప్తివల్ల సంతోషంతో బలిచక్రవర్తి ఉత్సవం ప్రకటించినాడు.

ఈలోగా అక్కడికి తిరిగి నారదమహాముని వచ్చినాడు. అర్ఘ్యపాద్యాదులతో సత్కృతుడై ఆయన అక్కడున్న వారితో ఇట్లన్నాడు: "నన్ను దేవేంద్రుడు పంపించినాడు. ఆయన మీతో ఇట్లా చెప్తున్నాడు-సునీథుడు జీవించడంవల్ల నాకు పరమసంతోష మైనది. కానీ ఇప్పుడు తిరిగి మాతో మీరు అకారణవైరం కల్పించు కొనరాదు. మా వైపున్న శ్రుతశర్మతో కూడా విరోధించరాదు."

ఆ ముని చెప్పిన మాటకు ప్రహ్లాదు డిట్లా అన్నాడు:

"సునీథ జీవితం ఇంద్రునకు ఆనంద కారణమైనదంటే ఇంక కావలసిన దేమున్నది? అకారణ విరోధానికి మేమెప్పుడూ పాల్ప డము. ఇప్పుడే మేమందరమూ కలిసి ఆ మా గురువుముందు ఆ విధంగా నియమం చేసుకొన్నాము. శ్రుతశర్మ మీ పక్షం వహించి బలగర్వంతో మాకేదైనా చెరుపు చేస్తే ఇకమేము చెప్పవలసిన దేమున్నది? పూర్వమే తన్నారాధింపగా దేవదేవుడైన మహేశ్వ రుడు సూర్యప్రభుని పక్షాన్ని వహించి ముందే ఆదేశించి ఉన్నాడు. ఈశ్వరాదిష్టమైన ఈ కార్యాన్ని ఇంద్రుడు నిష్కారణమని, అసమంజసమనీ భావిస్తే మేము చేయగల దేమున్నది."

ఈ విధంగా ప్రహ్లాదుడు నారదునితో అనగా వాసవుని నిందిస్తూ ముని అంతర్ధానమైనాడు. ఆయన వెళ్ళిన తర్వాత ఆ దానవేంద్రులందరితో శుక్రాచార్యు డిట్లా అన్నాడు: "ఈ ఇంద్రుని ప్రయత్నం చూస్తే ఏదో వైరానుబంధంగానే కనబడు తుంది. కానీ మనయెడ అనుగ్రహైక పరాయణుడైన మహేశ్వరు

డుండగా ఇంద్రునిశక్తి ఏమిటి? అతను చేయగల దేమిటి? అతనికి వైష్ణవాస్త్ర ఉంటే ఉండుగాక.'' ఈశుక్రుని మాటలను విని దానవులందరూ ఆమోదించినారు. ప్రహ్లాదునితో పాటూ బలిని వీడ్కొని వారంతా వారి వారి నివాసాలకు వెళ్ళిపోయినారు.

ఆ తర్వాత ప్రహ్లాదుడు తన నివాసమైన చతుర్ధపాతాళానికి వెళ్ళిన తర్వాత బలిచక్రవర్తి కొలువు చాలించి అంతఃపురంలోనికి వెళ్ళిపోయినాడు. మయుడు, సునీథుడు, ఇతర సూర్యప్రభాదు లందరూ అతనికి ప్రణమిల్లి వెళ్ళిపోయినారు.

అక్కడ ఉచితాహార అన్నపానాదులను సేవించి ఉండగా తమ తల్లి లీలావతి వచ్చి సునీథునితో "కుమారా! నీకు మహనీయుల పుత్రికలు భార్యలు కలరు. తేజస్విని ధనేశుని కూతురు. మంగళావతి తుంబురుని కూతురు. చంద్రప్రభ శరీరంతో నీ వెవరినైతే పెళ్ళాడితివో ఆమె ప్రభాసుడనే వసుని కూతురు కీర్తిమతి. ఈ ముగ్గురినీ సమదృష్టితో చూచుకొనవలసింది" అని ఆ ముగ్గురు ముఖ్యభార్యలను అతనికి సమర్పించినది.

తర్వాత ఆ పగలూ రాత్రీ, సునీథుడు పెద్దభార్య తేజస్వితో కలిసి శయ్యాగారంలోనికి ప్రవేశించినాడు. చిరకాలంగా ఉత్సుకురాలై ఉన్న ఆమెను ఉపభోగించినాడు. పూర్వానుభూతమైనప్పటికీ ఆ రతిక్రీడా సుఖం నూతనంగా కానవచ్చినది.

సూర్యప్రభుడు మంత్రులతో పాటూ మరొక నివాస గృహంలో ఆరాత్రి భార్యారహితుడై శయనించినాడు. తనభార్యలను బయటవదలివేసిన స్నేహహీనుడు ఇతనితో నేమన్నట్టు, నిద్ర కూడా స్త్రీయే కనుక ఏకాకి అయిన అతని దగ్గరకు రాలేదు.

కార్యచింతైక బుద్ధి అయిన ప్రహస్తునకు కూడా ఈర్ష్యలో వలె నిద్ర దరి చేరలేదు. మిగత సూర్యప్రభుని పరివారంలోని వారందరూ హాయిగా నిద్రపోయినారు.

## కళావతి కథ

అంతలో చెలికత్తెతోపాటు ఒక అద్భుతసుందరి అయిన కన్య వస్తుండడం సూర్యప్రభుడు, ప్రహస్తుడు చూచినారు. సురాంగనలందరూ ఈమె ముందు వెలవెల పోకూడదని ఆమెను సృష్టించిన బ్రహ్మ, పాతాళంలో ఇలా ఉంచినాడా అన్పిస్తున్నది. సూర్యప్రభుడు ఎవరీమె అని ఆలోచిస్తుండగా ఆమె లోనికివచ్చి నిద్రిస్తున్నవారిని ఒక్కొక్కరినే చూచినది.

చక్రవర్తి చిహ్నాలులేని వారందరినీ వదలివేసి ఆ లక్షణాలు కల్గిన సూర్యప్రభుని చూచి వారి మధ్యలో పడుకొన్న అతని వద్దకు వచ్చినది: "ఓ సఖీ! ఆయనే ఈయన. పాదాలు స్పృశించు. నీటివలె చల్లగానున్న చేతులతో మేల్కొల్పు" అని చెలికత్తె అన్నది.

ఆ మాటవిని ఆమెసఖి ఆ విధంగానే చేయగా సూర్యప్రభుడు. నిద్రిస్తున్నట్టున్నవాడు కనులుతెరచి అన్నాడు: "ఓ కన్యలారా! మీరెవరు మీ రిక్కడకు ఎందుకు వచ్చినారు?" ఆ మాట విని ఆమెసఖి అతనితో ఇట్లన్నది: "ఓ దేవా! ద్వితీయ పాతాళంలో అధిపతిగా అమీలుడనే రాజున్నాడు. ఆ దైత్యేంద్రుడు హిరణ్యాక్షుని కుమారుడు. బలశాలి. కళావతి అనే ఈమె అతనికి ప్రాణాధికురాలైన కుమార్తె. ఈమె తండ్రి బలిచక్రవర్తి వద్దనుంచి వచ్చి ఈమెతో అన్నాడు—దైవ వశాత్తూ సునీథుడు తిరిగిబ్రతికి కళ్ళబడినాడు. అలాగే సుముండికావతారుడైన యువకుడు సూర్యప్రభుడు కూడా కనబడినాడు. ఆయనను భావి విద్యాధర చక్రవర్తిగా శంకరుడు నిర్దేశించి ఉన్నాడు.

— ఆ సునీథునకు ఆనంద సమ్మానం చేయదలచు కున్నాను. సూర్యప్రభునకు నా పుత్రిక కళావతిని ఇవ్వదలచు కున్నాను. సునీథుడు ఏకగోత్రుడు గనుక అతనికి ఈమె నివ్వడం కుదరదు. సూర్యప్రభుడు ఇతనికి రాజజన్మలో కుమారుడే కానీ అసురజన్మలోకాదు. ఆయన కుమారునికి సన్మానం చేయడం ఆయనకు చేయడమే అవుతుంది.

ఈ విధంగా తండ్రి చెప్పిన మాటలను విని మీ గుణాలతో ఆకృష్టురాలై మా చెలి మీ దర్శనకుతూహలంతో ఇక్కడికి వచ్చినది'' అని ఆ చెలికత్తె అన్నది.

ఈ విధంగా ఆమె చెప్పగా అతను నిద్రిస్తున్నట్టే నటించినాడు. ఆమె అభిప్రాయాన్ని తెలుసుకోవడం కోసం సూర్యప్రభుడలా ఉన్నాడు. ఆ కన్య మేలుకొని ఉన్న ప్రహస్తుని వద్దకు మెల్లగావెళ్ళి సఖీముఖంగా సర్వము వినిపించి బయటికి వెళ్ళిపోయినది. అప్పుడు ప్రహస్తుడు దగ్గరకు వచ్చి "దేవా! మేల్కొన్నారా? లేదా?" అని సూర్యప్రభునితో పలికినాడు.

అప్పుడతను కనులు తెరచినాడు. "మిత్రమా! నాకు ఏకాకిగా ఉన్నవానికి నిద్ర ఎలా వస్తుంది? మేలుకొనే ఉన్నాను. అయితే ఒక విశేషమున్నది. అది రహస్యమైనది. చెప్తాను విను. ఇంతకు ముందే సఖీయుతురాలై లోనికి వచ్చిన కన్యకను చూచినాను. ఆమెతో సమాన రూపవతి ముల్లోకాలలోనూ లేదు. ఆమె ఒక క్షణంలో నా మనసును అపహరించుకొని ఎక్కడికో వెళ్ళిపోయినది. ఆమె ఇక్కడే ఎక్కడో ఉంటుంది. వెదికి చూడు. అని సూర్యప్రభుడు చెప్పగా ప్రహస్తుడు బయటికివెళ్ళి తన సఖితో పాటూ అక్కడ నిలుచున్న ఆ కన్యతో ఇట్లన్నాడు:

"మీ కోసమని మా ప్రభువును నేను మేల్కొలిపినాను. ఇప్పుడు నా కోసమని వచ్చి మా ప్రభువులకు కన్పించండి. మీరొక మారు ఆయనను చూచి మీ కన్నులను సార్థకం చేసుకోండి. దృష్టిమాత్ర వశీకృతుడైన ఆయన కూడా మిమ్మల్ని చూడనీ!

ఆయనను నిద్రలేపి మీ కథనంతా తెల్పినాను. మిమ్ములను తెచ్చి చూపించమని, లేకుంటే బ్రతకలేనని ఆయన అన్నాడు. అందువల్ల మీ కోసమని నేను వచ్చినాను. లోనికి వచ్చి మీరే చూడండి" అని ప్రహస్తుడు చెప్పగా ఆమె కన్యాసులభమైన సిగ్గుతో తిరిగీ లోనికి వెళ్ళడానికి తటపటాయిస్తుండగా చేతితో పట్టుకొని ఆమెను సూర్యప్రభుని సమీపించినాడు.

సూర్యప్రభుడు కూడా తన దగ్గరకు వచ్చిన కళావతిని చూచి ఇలా అన్నాడు: "ఓ చండీ! ఇది నీకు తగునా! నేను నిద్రిస్తుండగా వచ్చి నా మనసును దొంగిలించుకొని పోవచ్చునా? నిన్ను పట్టుకొనకుండా వదలిపెట్టను."

ఈ మాట విని విదగ్ధురాలైన ఆమె చెలికత్తె ఇట్లన్నది: "పూర్వమే ఈమె తండ్రి ఈ దొంగను శిక్షించుటకై నీకు అప్పగించ దలచుకున్నాడు. ఇక నిషేధ మేమున్నది? ఈమె చేసిన నేరానికి తగిన శిక్ష విధించవచ్చును."

ఆ మాటవిని సూర్యప్రభుడు ఆమెను కౌగిలించదలచగా సిగ్గుతో కళావతి ఇట్లన్నది: "ఆర్యపుత్రా! ఇది తగదు. నేను కన్యను."

అప్పుడు ప్రహస్తుడు ఇట్లా అన్నాడు: "నీ కన్యాత్వానికేమీ భంగం రాదు. వివాహాలలో అన్నిటికంటే ఉత్తమమైనది గాంధర్వ వివాహం కదా!" అని చెప్పి మిగతవారితో పాటూ అతను బయటికి వెళ్ళిపోయినాడు.

అప్పుడు సూర్యప్రభుడు ఆ కళావతిని భార్యగా చేసుకొన్నాడు. ఆ పాతాళకన్యతో మానవ దుర్లభమైన సురత సంభోగాన్ని, అచింత్య నవసంగమాన్ని అనుభవించినాడు. రాత్రి ముగిసి, కళావతి తన నివాసానికి వెళ్ళిపోగా, సూర్యప్రభుడు సునీథ మయాదుల వద్దకు వెళ్ళినాడు.

అక్కడ వారందరూ కలిసి ప్రహ్లాదుని సన్నిధికి చేరుకొన్నారు. ఆయన వారిని యథారీతిగా సమ్మానించి శుభస్థితుడై మయునితో ఇట్లన్నాడు: "సునీథునకు ఉత్సవం చేయడం మా కర్తవ్యం. కాబట్టి మనందరమూ ఒకచోట కలిసి భుజింతాము." అలాగే చేతామని అందులో తప్పేమిటని మయుడనగా దూతను పంపి ప్రహ్లాదుడు అసురాధిపు లందరినీ పిలిపించినాడు. పాతాళలోక మంతటినుంచి క్రమంగా వారు రాసాగినారు. పూర్వ భాగం నుంచి బలి అసంఖ్యాకులై అసురులతో వచ్చినాడు.

ఆ తర్వాత దురారోహుడు, వీర్యవంతుడు అయిన అమీలుడువచ్చినాడు. సుమాయుడు తంతుకచ్ఛుడు, వికటాక్షుడు, ప్రకంపనుడు, ధూమకేతువు, మహామాయుడు మొదలైన అనేక అసురేశ్వరులు వచ్చినారు. అందులో ఒక్కొకరు వేయిమంది సామంతులతో పరివృతులై ఉన్నారు. ఆ సభ అంతా వారితో నిండిపోయినది. ఒకరి నొకరు పలుకరించు కున్నారు. వారంతా క్రమంగా ఉపవిష్టులైన తర్వాత ప్రహ్లాదుడు వారిని సమ్మానించినాడు.

భోజనానికి వేళకాగా వారందరూ మయాదులతోపాటు గంగకువెళ్ళి స్నానంచేసి భోజనార్థం మహాసభకు విచ్చేసినారు. శతయోజనవిస్తీర్ణం, సువర్ణమణికుట్టిమం, రత్నస్తంభ ఖచితం

అయిన ఆ భోజనశాలలో విచిత్ర మణిపాత్రలను ఉంచి ఉన్నారు. ప్రహ్లాదసహితుడై సునీథమయాదులు, సూర్యప్రభునితో పాటు అతని మంత్రులు సర్వులూ నానావిధాలైన భక్ష్య, భోజ్య, లేహ్యాది షడ్రస సహిత దివ్యాన్నాన్ని భుజించినారు. ఉత్తమమైన ఆసవాన్ని పానం చేసినారు. అన్న పానాదులు ముగించుకొని అందరూ మరొక రత్నమయ సదస్సునకు వెళ్ళి అనుపమానమైన దైత్యదానవకన్యల నృత్తాన్ని తిలకించినారు.

## మహల్లిక ప్రేమ

నృత్యప్రసంగంలో ప్రహ్లాదుని కూతురు మహల్లిక పిత్రాజ్ఞతో నృత్తం చేస్తున్నది. ఆమె తన చూపుతో దిక్కులను వెలిగింపజేస్తున్నది. నేత్రాలనుంచి అమృతాన్ని వర్షిస్తున్నట్టున్నది. కుతూహలంకొద్దీ చంద్రమూర్తి పాతాళానికి వచ్చెనా అన్నట్టున్నది. లలాటంపై తిలకంతో, పాదాలకు మనోహర నూపురాలు ధరించి, చిరునవ్వు చిందించే చూపులతో నృత్యమయిగానే ఆమెను బ్రహ్మ సృష్టించెనా అన్నట్టున్నది.

అరాళకుంతల అయి చక్కని పలువరుసతో ఉరోమండలంతో ఒకానొక క్రొత్త నృత్యాన్ని ప్రవర్తింప జేస్తున్నట్టున్నది. ఆమెను చూచి సూర్యప్రభుని హృదయం అన్యస్వీకృతమైనప్పటికీ ఆమెపై పోయినది. ఆమె కూడా ఆ అసురేంద్రుల మధ్యలో అతనిని చూచినది. హరుడు ధ్వంసంచేయగా బ్రహ్మ మరొక మన్మథుని సృష్టించెనా అన్నట్టున్నాడతడు. చూడగానే అతనిపై మనసిడి విచలితురాలైనది. అందులో ఆమె ఆంగికాభినయం అవినయాన్ని చూచిన కోపంతోవలె విచలితమైనది. సభాస్తారులు కూడా వారిద్దరి మనసునెరిగి రాజసుత అలసిపోయినదని ఆ దృశ్యాన్ని ఆపివేయించినారు.

తర్వాత సూర్యప్రభుని వెనుదిరిగి చూస్తూ మహల్లిక తంత్రిని వీడ్కొని, దానవేంద్రులకు నమస్కరించి లోన భవనానికి వెళ్ళిపోయినది. దానవేంద్రులందరూ ఎవరిభవనాలకు వారు వెళ్ళిపోయినారు. సూర్యప్రభుడు కూడా సాయంత్రానికి తన భవనం చేరుకున్నాడు. సాయంకాలం తర్వాత తిరిగీ కళావతిరాగా అభ్యంతరంలో గుప్తంగా ఆమెతో శయనించినాడు. ఇతర అనుచరులందరూ బయటే పడుకొని నిద్రపోయినారు.

ఆ సమయంలో మహల్లిక కూడా అతనిని చూడవలెనన్న కుతూహలంతో ఇద్దరు నర్మవయస్యలతో కలిసి అక్కడికి వచ్చినది. ఆమె లోనికి ప్రవేశిస్తుండగా ప్రజ్ఞాఢ్యుడనే సూర్యప్రభుని మంత్రి అప్పుడే మేల్కొంచి ఆమెను కనుగొన్నాడు. ఓ "దేవీ! కాసేపు నిలవండి. నేనింతలో అభ్యంతరానికి వెళ్ళి వస్తాను. అని ఆమెకు చెప్పి బయలుదేరినాడు. "నన్ను బయటనే ఎందుకాపినారు?" అని అనుమానిస్తూ అడుగగా తిరిగీ ఆ ప్రజ్ఞాఢ్యు డిట్లా అన్నాడు. "స్వేచ్ఛగా లోన పడుకొనిఉన్న మా ప్రభువు దగ్గరకు హఠాత్తుగా వెళ్ళడమెందుకు? ఏకాకిగా ఒక వ్రతం వల్ల మా ప్రభువు పడుకొని ఉన్నాడు."

ఆ తర్వాత ఆమె ఆ మాట నమ్మి సరేననగా ప్రజ్ఞాఢ్యుడు లోనికి ప్రవేశించినాడు. కళావతి నిద్రిస్తుండగా చూచి సూర్యప్రభుని మేల్కొల్పి మహల్లిక వచ్చిన సంగతిని తెలియజేసినాడు. సూర్యప్రభుడు కూడా ఆ సంగతి నెరిగి మెల్లగా లేచి బయటికి వచ్చినాడు. మహల్లిక మరొక ఇద్దరు చెలిమికత్తెలతో ఉన్నప్పటికి మాట్లాడినాడు. "తమ ఆగమనంవల్ల మేము కృతార్థులమైతిమి. మీరిక ఆసనాన్ని అలంకరించండి."

ఆ మాటవిని మిగత వారితోపాటు మహల్లిక కూర్చున్నది. సూర్యప్రభుడు కూడా ప్రజ్ఞాఢ్యునితో పాటు కూర్చున్నాడు. కూర్చొని ఇట్లా అన్నాడు: "ఓ సుందరీ! సదస్సు ముగియు నుండగా సాదరంతో సమ్మానంతో చూచినప్పటికీ నన్ను నీవు అవమానించినావు. అయినప్పటికీ లోలాక్షీ! నీ సౌందర్యం నృత్యం చూడడంతోనే నా కలలు సఫలీకృతాలై నవి."

ఈ విధంగా సూర్యప్రభుడు చెప్పగా ఆ ప్రహ్లాదుని కుమార్తె ఇట్లన్నది.

"ఆర్యపుత్రా! ఇందులో నా అపరాధం ఏమీలేదు. కానీ సభలో నా అభినయాన్ని వికృతం చేసి నన్ను కించపరచిన వారిదే దోషం."

ఈ మాట విని "జితోస్మి" అని నవ్వుతూ సూర్యప్రభుడన్నాడు. తన చేతితో ఆమె చేతిని పట్టుకున్నాడు. బలాత్కారంగా పాణిగ్రహణం చేసినట్టుగా ఆ చేయి భీతితో వలె స్వేదానులిప్తమై వణికి పోతున్నది.

"ఆర్యపుత్రా! చేయి విడవండి. నేను కన్యను. పితృవశంలో ఉన్నదానను" అని ఆమె అంటుండగా సురేంద్రపుత్రికతో ప్రజ్ఞాఢ్యుడిట్లా అన్నాడు: "ఓ దేవీ! కన్యలకు గాంధర్వ వివాహ మన్న దొకటున్నది కదా! మీ తండ్రి ఏదో ఒక ఆశయం వల్ల మరొకరి కివ్వడు. కానీ ఇక్కడ ఇప్పుడీయనకు నిశ్చయంగా సమ్మానం చేస్తాడు. కాబట్టి తత్తరపాటు చెందనక్కరలేదు. ఈ సమాగమం వృథా కాకుండుగాక!" అని అతను మహల్లికతో చెప్తుండగా ఇంతలో అభ్యంతరంలో నున్న కళావతి మెల్కొన్నది. తన పడకపై సూర్యప్రభుడు లేకపోవడం చూచి ఉద్విగ్నురాలై, శంకితురాలై బయటకు వచ్చినది.

అక్కడ తన వల్లభుడు మహల్లికతో ఉండడం చూచి కోపంతో, సిగ్గుతో, భయంతో తొట్రుపడినది. మహల్లిక కూడా ఆమెను చూచి భీతురాలు, లజ్జితురాలు అయినది. సూర్యప్రభుడు [illegible] చిత్రించిన బొమ్మవలె నిశ్చేష్టుడైనాడు. "కంటబడిన [illegible] పారిపోవడం ఎలాగు? సిగ్గుపడుట వల్లగానీ, ఈర్ష్య వల్లగానీ లాభమేమున్నది?" అనుకొని కళావతి కూడా అతని దగ్గరకే వెళ్ళినది. "సఖీ! కుశలమా? ఇంత రాత్రిపూట ఇక్కడికి వచ్చినావేమిటి!" అని మహల్లికను అసూయతో కళావతి ప్రశ్నించి నది.

అప్పుడు మహల్లిక ఇట్లన్నది: "ఇది మా ఇల్లే. నీవు అన్య ప్రాకారవాసం నుంచి వచ్చినావు. అందువల్ల నాకు అతిథివి." ఆ మాట విని నవ్వి కళావతి ఇట్లన్నది: "అది నిజంగానే కనబడు తున్నది. నీవు ఇక్కడే వచ్చిన వారందరకూ ఆతిథ్యమిస్తున్నావు."

కళావతి ఇలా అనగా మహల్లిక ఇట్లన్నది: "నేనేదో ప్రీతితో పలుకరింపగా నీవేదో ద్వేష నిష్ఠురంగా మాట్లాడుతున్నావేమిటి? పరిహాసంగా మాట్లాడుతున్నావేమిటి? నీకు నాకు సామ్యమేమిటి? నేను నా బంధువుల అనుమతి లేకనే ఎక్కడో దూరంలో నున్న పట్టణం నుంచి వచ్చి మరొకని పడకపై రహస్యంగా రాత్రిలో ఒంటరిగా పడుకొన్నానా? నేను మా ఇంటిలో మా తండ్రి అతిథిని చూడడానికి వచ్చినాను. పైగా ఇప్పుడే వస్తున్న నాతో పాటూ [illegible] సఖులు కూడా ఉన్నారు. మమ్ములను మొదటే ఈ మంత్రి చూచి లోనికి ప్రవేశ పెట్టినాడు. అంతవరకే నాకు తెలుసును. నిన్ను నీవే బయట పెట్టుకున్నావు." ఈ విధంగా మహల్లిక అనగా ఆ కళావతి కోప కషాయిత నేత్రాలతో ప్రియుని వెనుదిరిగి చూస్తూ వెళ్ళిపోయినది.

అంతట మహల్లిక కూడా "ఓ బహువల్లభా! వెళ్ళి వస్తాను'' అని కోపంతో సూర్యప్రభునికి చెప్పి వెళ్ళిపోయినది. సూర్య ప్రభుడు కూడా అప్పుడు విచలిత మనస్కుడైనా డంటే ఆశ్చర్యం లేదు. ఆ కాంత లిరువురి పైనా అతని మనసు సమానంగా ఆసక్తమై ఉన్నది.

పిమ్మట కళావతి కలహాంతర చేష్టితాన్ని తెలుసుకొనుటకై వెంటనే నిద్రలేపి తనమంత్రి ప్రభాసుని పంపించినాడు. మహల్లిక సంగతిని అలాగే తెలుసుకొనుటకై ప్రహస్తుని పంపినాడు. తాను వారికై ఎదురుచూస్తూ ప్రజ్ఞాఢ్యునితో అక్కడే గడపినాడు.

ఆ తర్వాత కళావతి చేష్టితాన్ని అన్వేషించి తిరిగి వచ్చి నాడు. రాజు ప్రశ్నింపగా ఇట్లన్నాడు: "నే నిక్కడ నుంచి రెండవ పాతాళవర్తి అయిన కళావతి నివాస గృహానికి విద్యా గుప్త రూపుడనై వెళ్ళినాను. బయట ఇద్దరు చెలికత్తెలు మాట్లాడు కొంటుండగా విన్నాను.

అందులో ఒకతె "ఎందుకు కళావతి దిగులుగా ఉన్నది?" అని అడిగినది. రెండవ చేటి "సఖీ! దీనికి కారణం చెప్తాను విను. సుముండకావతారుడు నాల్గవ రసాతలంలో ఉన్నాడు. ఆయన పేరు సూర్యప్రభుడు. రూపంలో మన్మథుని జయించినవాడు. అతని వద్దకువెళ్ళి స్వయంగా, గుప్తంగా ఈమె తన్ను అర్పించు కొన్నది. ఈ రాత్రి ఈమె అక్కడికి వెళ్ళగా ప్రహ్లాదునికుమార్తె మహల్లికకూడా అక్కడికి స్వయంగా వచ్చినది. అక్కడ ఈర్ష్యతో కలహించివచ్చి ఆత్మఘాతానికి ఉద్యమించగా ఈమె చెల్లెలు సుఖావతి చూచి రక్షించినది.

ఆ తర్వాత లోన ప్రవేశించి శయనీయంపై పడి తన్ను వివరం చెప్పమని అడుగుతున్న చెల్లెలితో కలసి ఉన్నది."

— ఈ విధంగా ఆ చేటికల మాటలువిని నేను లోన ప్రవేశించి తుల్యాకృతులైన కళావతి, సుఖావతులను చూచినాను."

ఇలా ప్రభాసుడు సూర్యప్రభునకు రహస్యంగా చెప్తుండగా ఇంతలో ప్రహస్తుడు కూడా అక్కడికి వచ్చి సూర్యప్రభుడడుగగా ఇట్లా చెప్పినాడు:

" ఇక్కడినుంచి నేను మహల్లికా వాసగృహానికి వెళ్ళినాను. ఆమె సఖులతోపాటు వికల మనస్క అయి వెళ్ళినది. విద్యా ప్రభావంవల్ల అదృశ్యుడనై నేను లోనికి వెళ్ళినాను. అక్కడ ఆమెతో సమానలైన సఖులు పన్నెండుగురున్నారు. సద్రత్న పర్యంకనిషణ్ణఅయిన మహల్లికను చుట్టుకొని వారు ప్రశ్నించినారు. వారిలో ఒకతె ఇట్లన్నది: "సఖీ! ఎందుకు హఠాత్తుగా ఉద్విగ్నురాలవుగా కనబడుతున్నావు? వివాహం నిశ్చితం కాగా నీవు విచారం చెందవలసిన పని ఏమి?"

ఆ మాటవిని విమర్శపూర్వకంగా ప్రహ్లాదపుత్రిక ఇట్లన్నది: " నాకు వివాహమేమిటి? నన్నెవరికిస్తున్నారు? ఈ మాట నీ కెవరు చెప్పినారు?" ఆ మాట వారందరూ విని ఇట్లా అన్నారు — "రేపు ఉదయమే నిన్ను సూర్యప్రభునికిచ్చి వివాహం చేయనున్నారు. నీవు లేనప్పుడు మీ తల్లి ఈ విషయం చెప్పినది. కావలసిన పనుల నిమిత్తమై మమ్ములను నియోగిస్తూ అన్నది: నీవు ధన్యురాలవు. సూర్యప్రభుడు నీకు పతి కా నున్నాడు. ఇక్కడ నున్న అంగనా జనం అంతా అతని రూపలోభంతో నిద్రకు దూరమై ఉన్నారు. మాకు వచ్చిన దుఃఖమేమిటంటే నీ వెక్కడ? మే మెక్కడ? ఆయన నీకు భర్త కాగానే నీవు మమ్ములను మరచిపోగలవు''.

ఈ మాటలు వారి ముఖతః విని మహల్లిక ఇట్లన్నది. "మీరు అతనిని చూచినారా. మీ మనసు అతనిపై పడినదా?" ఈ మాటకు వారన్నారుగదా "మేము హర్మ్యంపైనుండి ఆతని చూచినాము. ఆయనను చూచి ఏ స్త్రీఈర్ష్యపడదు?"

"అయితే ఆ సంగతి మా తండ్రితోచెప్తాను. మిమ్ములనందరినీ ఆయనకిమ్మని అర్థిస్తాను. ఈ విధంగా అయితే మనలో పరస్పర విరహం ఉండదు. మన మొకచోట కలిసి ఉండవచ్చును" అని ఆమె అనగా ఆ కన్యలు సంభ్రాంతలై ఇట్లా అన్నారు: "ఓ సఖీ! నీ వలా చేయవద్దు. ఇది యుక్తంకాదు. మాకు సిగ్గు చేటుకదా!"

ఆ చెలులతో అంతట ఆమె ఇట్లన్నది: "ఇందులో అయుక్త మేమున్నది? నన్నొకర్తెనే ఆయన కివ్వడం లేదు. దైత్య దానవులందరూ తమ పుత్రికలను ఆయన కివ్వనున్నారు. మిగత ఎందరో రాజకుమార్తెలు అతనిని పెళ్ళాడి భూలోకంలో ఉన్నారు. అనేక విద్యాధర కన్యకలను కూడా ఆయన పరిణయ మాడ నున్నాడు.

— వారందరిలో మీరు కూడా వివాహితులైతే నాకు వచ్చే నష్టమేమున్నది? మనమందరం సఖులంగా ఒకచోట నివసింప వచ్చును. నాకు విరుద్ధంగాఉన్న ఆ ఇతరుల ప్రస్తావన నా కెందుకు? మీరు కూడా సిగ్గుపడవలసిన అవసరం లేదు. ఇదంతా నేనే ఏర్పాటు చేస్తాను."

— ఈ విధంగా నీ విషయమై వారు తమలో తాము మాటాడు కొంటుండగా విని అక్కడినుంచి బయలుదేరి స్వేచ్ఛగా

నీ దగ్గరకు వచ్చినాను" ఈ విధంగా ప్రహస్తుడు చెప్పగా విని సూర్యప్రభుడు నిద్రింపకనే శయనంపై పడుకొని సంతోషంతో ఆ రాత్రంతా గడపినాడు.

ప్రొద్దున సునీథుడు, మయుడు, మిగత మంత్రులు తోడు రాగా అసురాధిపతి అయిన ప్రహ్లాదుని చూచుటకై ఆయన సభకు వెళ్ళినారు. అక్కడ ప్రహ్లాదుడు ఆదర పూర్వకంగా సునీథునితో ఇట్లన్నాడు: "మా కుమార్తె మహల్లికను సూర్యప్రభునకు ఇవ్వ దలచు కొన్నాను. ఈ అతిథి సత్కారం తప్పక చేయవలసినది. ఇది నీకు కూడా ప్రియమైనది." ఈ ప్రహ్లాదుని మాట విని సునీథుడు అభినందించినాడు.

ఆ తర్వాత ఒక వేదిక నేర్పరచి దాని నడుమ అగ్నిని జ్వలింపజేసి ఆ ప్రభలతో ఉదగ్ర రత్న స్తంభాదులు మరింతకాంతి విభ్రాజితాలు కాగా ప్రహ్లాదుడు అసుర సామ్రాజ్యానికి అనురూప మైన విభూతులతో తన కుమార్తె మహల్లికను అతనికి కన్యాదానం చేసినాడు. అనేక రత్నరాసులను కూతునకు వరు నకూ ఇచ్చినాడు. దేవతలను జయించి తెచ్చిన సుమేరు శిఖరోప మానములైన వవి. "నాన్నా! నా ప్రియసఖులు పన్నెండుగురిని ఈయనకే ఇవ్వవలసింది—" అని మహల్లిక అప్పుడు ప్రహ్లాదుని కోరినది.

"అమ్మాయీ! వారు మా అన్న అధీనంలో ఉన్నారు. ఆయన వారిని జయించి బందీ చేసికొని తెచ్చినవాడు. వారిని నే నివ్వడం కుదరదు" అని ప్రహ్లాదు డన్నాడు.

ఈ విధంగా వివాహ మహోత్సవంలో ఆ దినం గడవగా సూర్యప్రభుడు ఆ రాత్రి మహల్లికతో పాటూ అభ్యంతర గృహం

లోనికి ప్రవేశించినాడు. సర్వకామోపచారాఢ్యమూ, సమనః ప్రీతి సౌఖ్యమూ అయిన సురతోత్సవాన్ని ఆయన ఆమెతో అనుభవించి నాడు.

ఉదయం ప్రహ్లాదుడు సహానుచరుడై సభకువెళ్ళగా అమీరు డనే దానవాధీశుడు ప్రహ్లాదాదులతో ఇలా అన్నాడు: "ఇప్పుడు మీరందరూ నాతో మా ఇంటికి రావలసినది. అక్కడ సూర్యప్రభు నకు నేను ఆతిథ్య మివ్వవలసి ఉన్నది. నా కుమార్తె కళావతిని మీరు సరే నంటే ఆయన కిస్తాను." ఈ మాట విని వారందరూ అనుమతించినారు.

ఆ వెంటనే వారందరూ ద్వితీయ పాతాళానికి వెళ్ళినారు. సూర్యప్రభునితో పాటు ఇతరులు కూడా వెళ్ళినారు. అక్కడ అమీరుడు అతనికి తన కూతురు కళావతిని ఇంతకు ముందే తన నర్పించు కొన్నదైనప్పటికీ విధివిధానంగా వివాహం చేసినాడు. వివాహానంతరం ప్రహ్లాద గృహంలో అసురాన్వితుడై భోజనంచేసి సూర్యప్రభుడు ఆ రోజెల్లా భోగోపచారాలతో గడపినాడు.

రెండవరోజు అలాగే దురారోహుడనే అసురేశ్వరుడు వారి నందరినీ పిలుచుకొని ఐదవదైన రసాతలానికి వెళ్ళినాడు. అక్కడ సూర్యప్రభునకు తన కుమార్తె కుముదావతిని ఇచ్చి మిగతా వారి వలెనే అతిథి సత్కారాన్ని యధావిధిగా నిర్వర్తించినాడు.

ఆ తర్వాత వారందరితో కూడి ఆ రోజు ఆనందంతో గడపి ఆ రాత్రి సూర్యప్రభుడు కుముదావతి నివాసానికి వెళ్ళినాడు. అక్కడ త్రిలోకసుందరి, నవసంగమోత్సుకా, స్నిగ్ధా ముగ్ధా అయిన ఆమెతో ఆ రాత్రి గడపినాడు.

ఉదయం ప్రహ్లాద ప్రముఖు లందరితో పాటూ తంతుకచ్ఛుడనే దానవాధిపతి సప్తమ పాతాళంలోని స్వభవనానికి తీసుకొని వెళ్ళినాడు.

అక్కడ ఆ దానవరాజు ఇతనికి మనోవతి అనే అతని కుమార్తెను, రత్నాభరణభూషితురాలిని, తప్త కాంచనకాంతి గల దానిని కన్యాదానం చేసినాడు. అక్కడ సూర్యప్రభుడు ఆ పగలు ఎంతో సుఖంగా గడపి ఆ రాత్రి ఆ మానవతి నవపరీరంభ సుఖంతో తేలిపోయినాడు.

మరునాడు అందరినీ తోడ్కొని ఆరవపాతాళానికి సుమాయువనే అసురాధిపుడు కొనిపోయినాడు. అక్కడ అతను కూడా దూర్వాలతాశ్యామలాంగి, మూర్తిగొన్న కామస్వరూపిణి అయిన సుభద్ర అనే కన్యకను అతనికిచ్చి వివాహం చేసినాడు. సురత సంభోగయోగ్యఅయిన ఆమెతో సూర్యప్రభుడు ఆ రోజు గడపినాడు.

మరునాడు అలాగే బలిరాజు వీరందరినీ సూర్యప్రభునితో పాటు మూడవదైన తన పాతాళానికి కొనిపోయినాడు.

బాల ప్రవాళచ్ఛాయ అయిన మాధవీ మంజరివంటి దయిన సుందరి అను పేరుగల తన తనయను అర్పించినాడు. అక్కడ ఆ స్త్రీ రత్నంతో సూర్యప్రభుడు అనురాగ రంజితుడై దివ్యభోగ విభూషిత మైన ఆ రోజును గడపినాడు.

మరునాడు మయుడు కూడా రాజపుత్రుని చతుర్థపాతాళగతుడైన వానిని తిరిగీ తన మందిరానికి కొనిపోయినాడు. విచిత్ర రత్న ప్రాసాదాలతో కూడినది, నిజ మాయా వినిర్మితమైనది, నవ నవ

ప్రభాభాసమానమైనది. లక్ష్మీసంయుతమైనది అయిన ఆ మందిరంలో తన కూతురు సుమాయ అను కన్యను. జగదాశ్చర్య రూపను. మూర్తిమంతమైన తన శక్తి వంటిదానిని అతనికిచ్చి వివాహం చేసినాడు. ఇతను మనుష్యుడు గనుక ఆమెను ఇవ్వకూడదని అనుకోలేదు. కృతార్థుడైన సూర్యప్రభుడు కూడా ఆమెతో సుఖ మనుభవించినాడు.

ఆ నృపాత్మజుడు తన విద్యాప్రభావం వల్ల విభక్తదేహుడై ఆ అసుర కన్యలందరితోనూ ఏకకాలంలో రమించినాడు. తాత్త్వికమైనదేహంతో అతను మరింతగా, ప్రియతమ అయిన, ప్రహ్లాదుని పుత్రిక అయిన మహల్లికను అనుభవించినాడు.

ఒక సారి రాత్రి స్వేచ్ఛగా నుండగా, మహల్లికను ఆ సూర్యప్రభుడు ప్రస్తావవశంగా ఇలా ప్రశ్నించినాడు: 'ప్రియా! ఆ రాత్రి నీతోపాటూ ఇద్దరు కన్యలు వచ్చిరే వారెక్కడ? కనిపించడం లేదే! ఎక్కడికి వెళ్ళినారు?"

అప్పుడు మహల్లిక ఇలా అన్నది: "మీరు బాగానే జ్ఞాపకం చేసినారు. వారు ఇద్దరుకాదు. నా స్నేహితురాండ్రు పన్నెండుగురు ఉన్నారు. వారిని మా పినతండ్రి స్వర్గంనుంచి అపహరించుకొని తెచ్చినాడు. అందులో ఒకామె పేరు అమృతప్రభ. రెండవ ఆమె పేరు కేశిని. వీరిద్దరూ పర్వతముని కుమార్తెలు. శుభలక్షణ సంయుతలు. మూడవ అమ్మాయి కాళింది. నాల్గవది భద్రిక. చారులోచన అయిన అయిదవ అమ్మాయి పేరు దర్పకమల. ఈ ముగ్వురూ మహాదేవలునికి కుమార్తెలు.

ఆరవ అమ్మాయి సౌదామని. ఏడవ అమ్మాయి ఉజ్జ్వల. వీరిరువురు హా హా అనే గంధర్వుని కన్యలు.

ఎనిమిదవ అమ్మాయి హూ హూ గంధర్వుని కూతురు, పీవర అను పేరుగలది.

తొమ్మిదవ అమ్మాయి అంజనిక. కాలుని కన్య. పింగళు డనే ప్రమథుని కూతురు. పదవది కేసరావళి.

పదకొండవది మాలిని. పన్నెండవకన్య మందారమాల. వీరందరూ వసుకన్యకలు. వీరంతా అప్సరసలకు పుట్టిన దివ్య యువతులు,

ప్రథమః పాతాళంనుండి నన్నుకొని వచ్చినపుడు వీరంతా నా వివాహానికి వచ్చినారు, వారిని న్యాయంగా నీకు, నాకూ అప్ప గించవలసి ఉండెను. నేను వారితో ఎల్లప్పుడూ కలిసి ఉండ వలసింది. నేనా విధంగా మాటకూడా ఇచ్చిఉన్నాను. వారిపై నాకు, నామీద వారికి ఉన్న స్నేహం అలాంటిది. నే నీ సంగతి మా తండ్రికి చెప్పిఉన్నాను. ఆయన అన్నమీది గౌరవం వల్ల తాను వారిని అప్పించలేదు".

ఈ మాటవిని సిగ్గుపడుతూ ఆమెతో సూర్యప్రభుడు ఇట్లన్నాడు: " ప్రియా! నీవు మహానుభావురాలవు. కనుక ఇలా అంటున్నావు. నేనేంచేయగలను?" ఈ విధంగా సూర్యప్రభు డనగా కోపంతో మహల్లిక ఇట్లన్నది: " నా ఎదుటనే నీ వింత మందితో ఉన్నావు. నా వయస్యలను మాత్రం నీ వపేక్షించడం లేదు, వారిని వదలి నేను ఆనందింపలేను. ఒక్కక్షణంకూడా ఆనందంగా ఉండలేను."

ఆ మాటకు సూర్యప్రభుడు సంతోషించి అందుకు ఆమో దించినాడు. ఆ తర్వాత అదే పాతాళానికి కొనిపోయి ప్రహ్లాద సుత

వారిని ప్రదానం చేసినది. ఆ తర్వాత అమృత ప్రభాదులను సూర్యప్రభుడు క్రమంగా పరిణయం చేసుకొని ఆ దివ్యాంగనలను ఆ రాత్రి అనుభవించినాడు.

ఉదయం వారు ప్రభాసునితో రసాతలానికి కొనిపోబడినారు. ఆ నాల్గవరసాతలానికి వెళ్ళి అక్కడ కనబడకుండా వారిని ఉంచి నాడు. మహల్లిక నడిగి తాను అదృశ్యుడై ఆమెతోపాటు అక్కడికి ఆయన వెళ్ళినాడు. పూర్వంవలెనే ప్రహ్లాదునిసభకు వెళ్ళి అక్కడ ఆ దానవేంద్రుని. సునీథుని. మయుని చూచి ఇట్లన్నాడు:

" మీ రందరూ ఇద్దరు దేవేరులనూ, దితిదనులను చూచు టకై వెళ్ళవలసిందని వారు చెప్పినారు. " అందుకంగీకరించి రసాతలం నుంచి వారందరూ బయటకువెళ్ళి తమ ఇష్టానుసారం అసురులతో పాటూ మయసునీథ సూర్యప్రభులు విమానాన్ని తలంచుకొని, రాగానే ఆ భూతాసనాన్ని అధిరోహించి సుమేరుగిరి సానువులందున్న కాశ్యపుని ఆశ్రమానికి వెళ్ళినారు.

అక్కడ సాదరంగా నివేదింపగా ఆ దితిదనువులను సమీ పించి క్రమంగా తలవంచి వారి పాదాలకు నమస్కారం చేసినారు. ఆ అసుర మాతలిద్దరూ అనుచర సహితులైన వారిని చూచి ఆదరంతో కనులనీరు నిండుతుండగా తలలను మూర్కొని సమ్మోదంతో ఆశీర్వదించి మయునితో ఇట్లన్నారు:

"నీ కొడుకు సునీథుడు పునరుజ్జీవితుడై రావడం చూచి మాకు కనుల పండువైనది. ఇది నీ పుణ్యమని కూడా అను కుంటున్నాము. అలాగే సుముండీకుడు సూర్యప్రభుడుగా దివ్యా కృతి ధరించి అసాధారణగుణుడై పునర్జన్మనెత్తడం వల్లనూ, భావి శ్రేయస్సు ప్రథమ లక్షణాల ద్వారా తెలియడంవల్లనూ. ఇతనిని

చూచి మా మనసులలో సంతోషం ఉబికి వస్తున్నది. కాబట్టి త్వరగా బయలుదేరి ఆర్యపుత్రుడైన ప్రజాపతిని మీరు దర్శించు కోండి. ఆయన దర్శనం వల్ల మీకు కార్యసిద్ధి కలుగుతుంది. ఆయన మాట మీకు శుభకారణమౌతుంది" అని వారు ఆదేశింపగా అలాగే ఆ మయాదులందరూ వెళ్ళి దివ్యాశ్రమంలో కశ్యప మునిని కనుగొన్నారు.

కరిగి శుద్ధిచేసిన బంగారం వలె తేజోమయుడై, జ్వాలా కపిల జటాధరుడై, అగ్ని సమానుడైన, దురాధర్షుడైన కశ్యప మునిని దేవాశ్రమంలో వారు సమీపించి, ఆయన పాదాలకు నమస్కరించినారు. అనుచరు లందరూ కూడా క్రమంగా నమస్క రించినారు. ఆయన కూడా పదే పదే ఆశీర్వదిస్తూ సంతోషంతో లేచి కూర్చొని ఇట్లా అన్నాడు: " ఈ విధంగా నా పుత్రులందరూ కనిపించడం వల్ల నాకు పరమానందం కలిగింది. ఓ మయుడా! సర్వవిద్యాప్రదుడవై సత్పథాన్నుంచి చలించని నీవు శ్లాఘ్యుడవు. ఓ సునీథా! ఆప్తమైన పునర్జీవితాన్ని పొందిన నీవు ధన్యుడవు. ఓ సూర్యప్రభా! ఖేచరులకు చక్రవర్తివి కానున్న నీవు పుణ్యాత్ముడవు. మీరంతా ధర్మ మార్గంలో ప్రవర్తించ వలసింది. నా మాటలను అర్థంచేసుకో వలసింది. అప్పుడు మీరు సతతమూ పరమసుఖాలను, సంపదలను పొందగలరు. పూర్వం విరోధుల మూలంగా కలిగిన పరాభవం వంటిది తిరిగి కలగరాదు.

ధర్మాతిక్రమణం చేసి దేవతలు విష్ణుచక్రానికి వశులైనారు. దేవహతులైనటువంటి అసురులు ఓ సునీథా! మానవవీర రూపంలో అవతరించినారు. నీ తమ్ముడైన సుముండీకుడు ఇప్పుడు సూర్యప్రభుడుగా జన్మించినాడు. మీ ఇతర స్నేహితు లైన అసురులందరూ అతనికి బాంధవులుగా పుట్టినారు.

పూర్వం శంబరుడుగా విఖ్యాతుడైన మహాసురుడు ప్రహస్తుడు మంత్రి అయినాడు త్రిశిరుడనే అసురుడు సిద్ధార్థుడనే పేరుగల మంత్రి అయినాడు. వాతాపి అనే దానవుడు ప్రజ్ఞాఢ్యుడనే మంత్రి అయినాడు. ఉలూకుడనే దనుజుడు శుభంకరుడనే వయస్యుడైనాడు. వీతభీతి అనే ఇతని చెలికాడు కాలనాముడనే అసురుడు. ఇతని సచివుడైన భాసుడు వృషపర్వుడనే దైత్యుడు. ఇక ప్రభాసుడు ప్రబలుడనే పేరుగలవాడైనాడు. మహాత్ముడు రత్నమయుడై శత్రువులైనప్పటికీ. దేవతలు యాచింపగా తన శరీరాన్ని ముక్కలుగా చేయగా అఖిలరత్నాదులు ఎవరిని నుంచి పుట్టెనో. అతడు చండికాదేవి సంతోషించి వరమివ్వగా ప్రభాసుడుగా మహాబలుడై శత్రు దుస్సహుడై జన్మించినాడు.

పూర్వం సుందోపసుందులనే పేరుగల దానవు లెవరైతే ఉండిరో వారే ఈ మంత్రులు. సర్వదమన భయంకరులుగా జన్మించినారు. పూర్వం హయగ్రీవుడు వికటాక్షుడు అనే పేరుగల అసురులు ఇప్పుడు ఇతనికి మంత్రులుగా స్థిరబుద్ధి. మహాబుద్ధులుగా ఉత్పన్నులైనారు. ఇంకా ఇతని మామలు. మంత్రులు. బంధువులు ఎందరో ఉన్నారే వారంతా అసురులే. వారు పూర్వం ఇంద్రాదులను పలుమార్లు జయించినారు. కాబట్టి ఇప్పుడు మీ పక్షం తిరిగి క్రమంగా వృద్ధి పొందినది. ధీరులుకండి. సమృద్ధిని పొందండి. పరమ ధర్మంనుంచి చ్యుతులు కాకండి ”

అని ఈ విధంగా కశ్యప మహర్షి చెప్తుండగా ఆయన భార్యలైన దాక్షాయణులు అదితి ప్రముఖులందరూ మధ్యాహ్న సవన సమయానికి వచ్చినారు. మయాదులు నమస్కరింపగా ఆశీర్వదించి భర్తతో ఆజ్ఞప్తలై ఆహ్నికాదులను నిర్వర్తించినారు.

ఆ సమయంలో లోకపాలురతో కలసి ఇంద్రుడు కూడా అక్కడికి ఆ ముని దర్శనార్థమై వచ్చినాడు. ఆయన భార్యా సహితుడై కశ్యప మునికి నమస్కరించినాడు. అలాగే ఆయనకు మయాదులు నమస్కరించినారు.

అప్పుడు సూర్యప్రభుని కోపంగా చూస్తూ మయునితో ఇంద్రుడిట్లన్నాడు: "ఈ అర్భకుడు విద్యాధర చక్రవర్తిత్వాన్ని అభిలషిస్తున్నాడని నాకు తెలుసును. అంత అల్ప సంతోషి కావడ మెందుకు? ఇంద్రత్వాన్ని ఎందుకు కోరడంలేదు!"

ఆ మాట విని మయుడిట్లా అన్నాడు: "దేవేశ్వరా! పర మేశ్వరుడు తమకు ఇంద్రత్వాన్ని ఇతనికి ఖేచరత్వాన్ని నిర్దేశించినాడు."

ఈ మయుని మాటవిని పకపక నవ్వుతూ కోపంతో: "ఇంత సులక్షణాకృతి అయిన వానికి అది అత్యల్పమైనది కదా!" అన్నాడు.

అప్పుడు మయుడన్నాడు కదా: "శ్రుతశర్మ ఖేచరేంద్ర త్వానికి యోగ్యుడైతే ఈయన ఆకృతి నిస్సంశయంగా ఇంద్ర త్వానికి అర్హమైనదే."

ఇలా మయుడంటుండగా ఆగ్రహోదగ్రుడై వజ్రాన్నెత్తి ఇంద్రుడులేచి నిలబడగా కశ్యపముని కోపంతో హుంకరించినాడు. దిత్యాదులైన ఆయన భార్యలు కూడా ఛీఛీ అని ఎర్రవడిన ముఖా లతో కుపితలైనారు.

అప్పుడు ఇంద్రుడు శాపభయంవల్ల ఆయుధాన్ని నేలకు విడిచి తలవంచుకొని కూర్చున్నాడు. భార్యాయుతుడైన సురా

సుర జనకుడైన కశ్యపముని పాదాలకెరగి ఆయనను ప్రసన్నుని చేసుకొని అంజలి పట్టి ఇంద్రుడు ఇట్లా విన్నవించుకున్నాడు: "భగవాన్! శ్రుతశర్మకై నేను విద్యాధర రాజత్వాన్ని దత్తం చేయగా, దానిని అపహరించాలని సూర్యప్రభు డిప్పుడు ప్రయత్నిస్తున్నాడు. తత్సాధనలో అందుకు కావలసినవాటిని మయుడు సమకూరుస్తున్నాడు."

ఆ మాటవిని దిత్యను సహితుడైన ప్రజాపతి ఇట్లన్నాడు: "ఇంద్రా! శ్రుతశర్మ నీకు ఇష్టుడు. మరి ఈశ్వరునికేమో సూర్యప్రభుడిష్టుడు. పూర్వం మయుని ఈ విధంగా శర్వుడు ఆజ్ఞాపించి ఉన్నాడు. మరి నీవు అనవసరంగా మాట తూలడమెందుకు? ఇందులో అతని అపరాధ మేమున్నది? ఇతను ధర్మమార్గచరుడు. జ్ఞానసంపన్నుడు. విజ్ఞానవంతుడు. గురుభక్తి కలవాడు. నీవు పాపాన్ని తలపెట్టినట్టయితే మా క్రోధాగ్ని నిన్ను భస్మీపటలం చేయగలదు. నీ వితని నేమీ చేయలేవు. ఇతని ప్రభావం నీకు తెలియదా?" అని ఆ ముని భార్యాసహితుడై మందలింపగా ఇంద్రుడు లజ్జాభయానతుడు కాగా అదితి: "ఆ శ్రుతశర్మ ఎలా ఉంటాడో ఇక్కడికి తెచ్చి చూపించు" అన్నది.

ఆ మాట విని ఇంద్రుడు మాతలిని తత్క్షణమే పంపించి ఖేచరాధీశుడైన శ్రుతశర్మను అక్కడికి పిలిపించినాడు. కృతవినతుడైన అతనిని చూచి, సూర్యప్రభుని చూచి కశ్యపముని భార్యలు వీరిరువురిలో రూపలక్షణాఢ్యు డెవరని తమ భర్తను ప్రశ్నించినారు. అప్పుడు మునీంద్రుడు: "శ్రుతశర్మ అతని మంత్రి ప్రభాసునితోనైనా సమానుడు కాడే ఇక నిరుపమానుడైన సూర్యప్రభునికి ఎలా సమానుడు కాగలడు? ఈ సూర్యప్రభుడు

దివ్యరూపలక్షణయుతుడు. ఈతడు ప్రయత్నిస్తే ఇంద్రత్వం కూడా అతనికి కష్టం కాదు.''

ఈ కశ్యపర్షి వచనాన్ని విని అందరూ తలలూచినారు. అప్పుడు మహేంద్రుడు వింటుండగా ముని మయునకు వరమిచ్చినాడు. "ఓ కుమారా! ఇంద్రుడు నీపై ఆయుధ మెత్తినా నీవు నిర్వికారంగా ఉండవలసింది. వజ్రమయమైన అవయవాలతో నీవు సర్వదా అజరామరుడవై రక్షితుడవౌతావు. నీలాగే సునీథ సూర్యప్రభులు కూడా మహాసత్త్వులు. సర్వవైరి వర్గమూ వారిని ఎప్పటికీ పరాభవించలేదు. ఈ నా సువాసకుమారుడు శరదిందు కాంతి సంపన్నుడు. తలచినంతనే వచ్చి సహాయం చేస్తాడు" అని ఆ మునిచెప్పగా ఆయన భార్యలు, ఋషులు, లోకపాలురూ ఆ సదస్సులోని మయప్రభృతులకు అందరూ వరాలిచ్చినారు.

అప్పుడు అదితి ఇంద్రునితో అన్నది: "అవినయాన్నుండి విరమించుకో. మయుని ప్రసన్నుని చేసుకో. ఆ వినయఫలంగానే సద్వరాల నెన్నింటినో అతను పొందినాడు". ఆ మాట విని ఇంద్రుడు మయుని చేతులను పట్టుకొని సంతోషపెట్టినాడు. సూర్యప్రభునిచేత అభిభూతుడైన శ్రుతశర్మ పగటిచంద్రునివలె కానవచ్చినాడు.

ఆ వెంటనే సురపతి కశ్యపునికి నమస్కరించి, వచ్చినవాడు వచ్చినట్టుగా అఖిలలోకపాల సమన్వితుడై వెళ్ళిపోయినాడు. ఆ తర్వాత మయ ప్రభృతులు మునివరుని ఆజ్ఞపై ఆ ఆశ్రమం నుంచి ప్రకృత కార్యసిద్ధి కోసమై వెళ్ళి పోయినారు.

ఇది మహాకవి శ్రీ సోమదేవభట్ట విరచితమైన
కథాసరిత్సాగరంలో సూర్యప్రభా లంబకంలో
ద్వితీయ తరంగం.

# తృతీయ తరంగం

## సూర్యప్రభుని ప్రయత్నం

ఆ తర్వాత మయుడు సునీథుడు, సూర్యప్రభుడు కశ్యపాశ్రమం నుంచి బయలుదేరి చంద్రభాగ, ఐరావతి నదులు కలిసే చోటికి వెళ్ళినారు. అక్కడ సూర్యప్రభుని కోసమై మిత్రబాంధవులైన రాజులు నిరీక్షిస్తున్నారు. సూర్యప్రభుడు రాగా చూచి అక్కడనున్న భూపాలురు ఏడుస్తూ విషణ్ణులయి, మరణోన్ముఖులై నిలచినారు. చంద్రప్రభ దర్శన జాతమయినదిగా వారి దుఃఖాన్ని ఆశంకించి సూర్యప్రభుడు జరిగిన వృత్తాంతాన్నంతటినీ తెలియజేసినాడు.

అయినప్పటికీ ఉద్విగ్నులైన వారిని ప్రశ్నింపగా ఎంతో కష్టం మీద శ్రుతశర్మ అతని భార్యలను అపహరించిన సంగతిని తెలియజెప్పినాడు. ఆ పరాభవ దుఃఖంతో తాము దేహత్యాగానికి సిద్ధంకాగా దివ్యవాణి తమ్ము నివారించెనని కూడా నివేదించినారు.

అప్పుడు సూర్యప్రభుడు కోపంతో శపథం చేసినాడు. బ్రహ్మాదులైన సర్వదేవతలూ రక్షిస్తున్నప్పటికీ శ్రుతశర్మను తాను నిశ్చయంగా ఉన్మూలింపగలనని, పరదారాపహరణం చేసి ఆ శఠుడు మృషాప్రాగల్భ్యాన్ని వెలార్చెనని అన్నాడు.

ఈ విధంగా ప్రతిజ్ఞచేసి వానిని జయించుటకై దాడి వెడల దలచినాడు. అందుకు ఏడవరోజున గణకులు లగ్నం పెట్టినారు. ఆ తర్వాత విజయోద్యమాన్ని ఆయన చేపట్టెనని తెలుసుకొని దానిని మరింత బలపరుపదలచి మయుడు సూర్యప్రభునితో ఇట్లన్నాడు.

"నీవు సిద్ధపడినది నిజమైతే నేనొకటి చెప్తాను వినండి. నేనప్పుడు మాయను ప్రదర్శించి ఆ యువతులను పాతాళం లోనికి కొనిపోయి ఉంచినాను. నీవిలా తొందరపడి దండయాత్ర చేయగలవని నేను చెప్పలేదు. అగ్ని గాలి వీచకున్నా జ్వలిస్తుంది. కాబట్టి మీరు పాతాళానికి బయలుదేరితే అక్కడ మీకు మీ ప్రియు రాండ్రను చూపిస్తాను."

ఈ మయుని మాటను విని వారందరూ సంతోషించినారు. ఆయన చూపిన మొదటిబిలంలోనుంచే వారందరూ మయాసురుని ముందుంచుకొని చతుర్థపాతాళానికి వెళ్ళినారు. అక్కడ ఒక భవనం నుంచి మయుడు సూర్యప్రభునికి మదన సేనాదులైన భార్యలను తెచ్చి సమర్పించినాడు. వారిని తీసుకొని అలాగే ఇతర అసు రాత్మజలైన పత్నులనుగూడా పరిగ్రహించి మయుని మాటపై సూర్యప్రభుడు ప్రహ్లాదుని దర్శనార్థం వెళ్ళినాడు.

మయుడు చెప్పగా విని తనకు నమస్కరించిన వానిపై అంతర్యమెరుగుట కొరకై ఆయన ఆయుధమెత్తి మాయ కోపాన్ని నటించినాడు: "ఓ దురాచారుడా! మా అన్న గెలుచు కొని వచ్చిన పన్నెండుగురు కన్నెలను నీవు అపహరించినావు. అందువల్ల నిన్ను సంహరిస్తాను చూడు—" అన్నాడు. ఆ మాట విని నిర్వికారుడై చూస్తూ సూర్యప్రభు డిట్లా అన్నాడు: "నా శరీరం నీ అధీనమైనది. అవినీతిని శిక్షింపవలసింది." ఈ మాటను విని ప్రహ్లాదుడు నవ్వి ఇట్లా అన్నాడు: "నిన్ను పరీక్షించాను. గర్వం లేశం కూడా నీలో లేదు. సరే నీవే వారిని పరిగ్రహించు. నేను సంతుష్టుడనైనాను."

అప్పుడు సూర్యప్రభుడు అలాగేనని శంకరునిపై, సద్గురు వులపై భక్తి కలుగునట్టుగా వరమివ్వ వలెనని కోరినాడు. ఆ

ఆమాట విని అక్కడున్న వారందరూ సంతోషింపగా ఆ సూర్య ప్రభునకు ప్రహ్లాదుడు యామిని అనే తన రెండవ కుమార్తె నిచ్చి వివాహం చేసినాడు. వారికి సహాయంగా తన పుత్రులనిద్దరినీ ఆ అసురేశ్వరుడు ఇచ్చినాడు.

ఆ తర్వాత అందరితో పాటూ సూర్యప్రభుడు అమీరుని దగ్గరకు వెళ్ళినాడు. అక్కడ ఆయన వరప్రాప్తి విని సంతుష్టుడై ఆయనకు సుఖావతి అనే తన రెండవ కుమార్తెను కూడా ఇచ్చి వారికి సహాయంగా తన ఇద్దరు కొడుకులను కూడా ఇచ్చినాడు.

ఆ తర్వాత ఇతరులైన అసురాధిపులతో కూడా సహాయం పొంది సూర్యప్రభు డక్కడ ప్రియానఖుడై సుఖమున్నాడు. ముగ్గురు సునీథుని భార్యలు. రాజకుమార్తెలైన తన భార్యలు అందరూ గర్భవతులైనారని మయాది సహితుడై విన్నాడు. వారి దోహదక్రియ లేమిటని ప్రశ్నింపగా మహాసంగ్రామ దిదృక్షేనని చెప్పినారు. ఆ మాట విని మయాసురుడు సంతోషించినాడు.

"దైవవశాత్తూ పూర్వం నిహతులైన అసురులే వీరికి సంభవింపనున్నారు. అందువల్లనే ఇలాంటి అభిలాషవారికి కలిగినది" అని అన్నాడు. ఈ విధంగా ఆరురోజులు గడవగా ఏడవ రోజున రసాతలం నుంచి భార్యాదియుక్తులై సూర్యప్రభాదులందరూ బయటికి వెడలినారు.

వీరికి విఘ్నం కల్పించుటకై శత్రువులు ఉత్పాతమాయను కల్పింపగా స్మరణమాత్రాగతుడైన సువాసకుమారుడు దానిని నాశం చేసినాడు. ఆ తర్వాత పృథ్వీరాజ్యానికి చంద్రప్రభుని రెండవకుమారుడైన బాలుని, రత్నప్రభుని అభిషేకం చేసినారు.

ఆ తర్వాత భూతాసన విమానాన్ని వారందరూ అధిరోహించి విద్యాధర నికేతనమైన సుమేరువునకు వెళ్ళినారు. మయుడు చెప్పినట్టు పూర్వగంగాతీర తపోవనాన్ని చేరినారు. అక్కడ స్నేహం వల్ల వచ్చిన వారినందరినీ సుమేరుడు పూజించినాడు. మయుడు సర్వమూ చెప్పగా శంభుని పూర్వాదేశాన్ని స్మరించి, ఆ దేశంలోని వారందరూ సూర్యప్రభాధిపులు, తమతమ బంధువులు తమ తమ సైన్యాలను రప్పించుకున్నారు.

మొదట సూర్యప్రభుని మామగారి కొడుకులు వచ్చినారు. ఆ రాజపుత్రులు మయాదిష్టులై విద్యలను సాధించి పూనికతో వచ్చినారు. హరిభటాదులు పదునారుగురు ఇరవై వేలరథాలతో, తలాపదివేల పదాతులు వెంటరాగా వచ్చినారు.

ఆ తర్వాత దైత్యదానవుల సంకేతం కాగానే వీరి వెనుక వారి బంధువు లందరూ వచ్చినారు.

పృష్ఠరోముడు, మహామాయుడు, సింహదంష్ట్రుడు, ప్రకంపనుడు, తంతుకచ్ఛుడు, దురారోహుడు, సుమాయువు, వజ్రపంజరుడు, ధూమకేతువు, ప్రమథనుడు, వికటాక్షుడు మొదలైన ఏడవ రసాతలం దాకా ఉన్నవా రందరూ అక్కడికి వచ్చినారు.

కొందరు డెబ్బైవేల రథాలతోనూ, మరికొందరు ఎనభై వేల రథాలతోనూ, కొందరు కేవలం పదివేల రథాలతోనూ వచ్చినారు.

అలాగే మూడులక్షల కాల్బలంతోను, కొందరు రెండు లక్షల కాల్బలంతోనూ, కొందరు లక్ష కాల్బలంతోనూ, మరీ తక్కువగా ఉన్నవారు ఏభై వేల కాల్బలంతోనూ వచ్చినారు.

ఒక్కొక్కరి వెంట తదనుగుణంగా హస్త్యశ్వాలు కూడా వచ్చినవి. ఇక మయసునీథుల అసంఖ్యాక సైన్యం అరుదెంచినది. సూర్యప్రభుని సేనావారం అమేయంగా ఉన్నది. వసుదత్తాది భూపతుల బలము, సుమేరుబలాలు చెప్పశక్యం కాకున్నవి.

మయుడు స్మరింపగానే వచ్చిన సువాసకుమారుడనే మునిని ఇట్లా ప్రశ్నించినాడు. "ఇప్పుడు వచ్చిన మహాసైన్యం ఎక్కడబడితే అక్కడ ఉన్నది. ఇది ఎంత ఉన్నదో తెలియదు. దీనినంతటినీ ఒకేసారి చూడడానికి వీలైన తావును సూచించండి" అనగా అత నిట్లా చెప్పినాడు. "ఇక్కడికి యోజన మాత్రంలో కలాపం అనే గ్రామం ఒకటున్నది. అక్కడికి వెళ్ళి ఆ విశాల భూమిలో దీని విస్తారం చూసుకొనవచ్చును."

ఈ విధంగా ఆ మునిచెప్పిన మాట ప్రకారం సుమేరుకునితో పాటు వారంతా కలిసి తమ సైన్యాలనన్నిటినీ తీసుకొని కలాప గ్రామానికి వెళ్ళినారు. అక్కడ ఉన్న ఒక ఉన్నతస్థలంపై నిలుచుండి వేరువేరుగా ఆ అసురుల బలాలను. రాజుల బలాలను పరికించినారు.

అప్పుడు సుమేరువు అన్నాడు కదా: "శ్రుతశర్మ బలాధికుడు. అతని అధీనంలో నూటఒక్క విద్యాధరాధీశ్వరులున్నారు. వారిలో ఒక్కొక్కడు ముప్పై ఇద్దరు రాజులకు అధీశ్వరుడు. అదలా ఉండనీ, వారిని విభజించి కొందరిని నీతోకలిపి ఏదో చేస్తాను. ఉదయమే మనం బయలుదేరుదాము. వల్మీకమనే చోటికి చేరుదాము. రేపు ఫాల్గుణమాస కృష్ణాష్టమి. అది గొప్పతిథి. ఆ రోజే విద్యాధర చక్రవర్తి లక్షణాలు బయటపడతాయి. అందువల్ల వారందరూ ఆ తిథినాడు అక్కడికి వెడతారు." అని సుమేరుడు

చెప్పగా ఆ సైన్యాన్ని సంవిధానం చేసుకుంటూ ఆ రోజు గడపి ఉదయమే అక్కడినుంచి బయలుదేరి రథాదులతో పాటూ సైన్య మంతా నడవగా వల్మీకానికి వెళ్ళినారు.

అక్కడ హిమాద్రి దక్షిణ సానువుపై బలాలు కోలాహలం చేసినవి. అక్కడికి అనేక విద్యాధరాధిపులు రావడం చూచినారు. ఆ విద్యాధరులు కూడా అగ్నికుండాలు జ్వలింపజేసి హోమాలు చేస్తున్నారు. కొందరు జపాలు చేస్తున్నారు.

అక్కడ సూర్యప్రభుడు కూడా గొప్ప అగ్నికుండాన్ని తయారు చేయించినాడు. తన విద్యా ప్రభావం వల్ల అందులో నుంచి అగ్నిని స్వయంగా జ్వలింప జేసినాడు. అది చూచి సుమే రువునకు సంతోషం కలిగినది. అట్లే విద్యాధరులకు మత్సరం కలిగినది. విద్యాధరుల్లో ఒకతను ఇట్లా అన్నాడు: " ఛీ....ఛీ.... నీ వేమిటి విద్యాధరాధిపత్యాన్ని వదలి ఈ సూర్యప్రభుడనే పేరుగల భూచారిని అనువర్తిస్తున్నా వేమిటి ? " అది విని ఆ సుమేరువు వానిని కోపంతో దూషించినాడు.

సూర్యప్రభుడు అతని పేరడుగగా సుమేరువు ఇట్లా అన్నాడు: " భీమనాముడైన విద్యాధరుడొకడు కలడు. అతని భార్యను బ్రహ్మ కామింపగా వీడు కలిగినాడు. గుప్తంగా బ్రహ్మకు కలిగినాడు గనుక వీనికి బ్రహ్మగుప్తుడను పేరు గలిగినది. అందు వల్లనే తన పుట్టుకకు తగినట్టే మాట్లాడు తున్నాడు" అని సుమే రువు కూడా వహ్నికుండాన్ని తయారుచేయగా అందులో కూడా సూర్యప్రభుడు వహ్నిని జ్వలింప జేసినాడు.

ఒక క్షణంలో భూవివరం నుంచి అతిభీషణ మైన ఒక మహా అజగరం బయటికి వచ్చినది. ఆ విద్యాధరాధిపుడు.

బ్రహ్మగుప్తనాముడు, సుమేరుని దూషణలకు పాత్రమైనవాడు, పొగరు కొద్దీ దానిని పట్టుకొనుటకై పరుగెత్తినాడు. ఆ అజగరం బుసకొట్టగా ఆ గాలికి వాడు పండుటాకువలె హస్తశతదూరంలో పడిపోయినాడు.

అప్పుడు తేజఃప్రభుడను విద్యాధరరాజు దానిని పట్టుకొనుటకై లేవగా అతనిని కూడా అది ఫూత్కరించి దూరంగా త్రోసివేసినది. అంతట దుష్టదమనుడనే విద్యాధరేశ్వరుడు దానిపైకి వెళ్ళగా అతనిని కూడా అది మిగతా వారిని వలెనే నిశ్వాస వాయువుతోనే త్రోసివేసినది.

ఆ తర్వాత విలూపశక్తి అను ఖేచరేంద్రుడు దానిపైకి వెళ్ళగా గడ్డిపోచవలె అది నిశ్వాస మాత్రంతోనే దూరంగా ఎగురగొట్టినది. ఆ తర్వాత అలాగే అంగారక, విజృంభకులను రాజులు ఒకేమారు దానిపై పడపోగా అది ఫూత్కారంతో దూరంగా ఎగురగొట్టినది.

ఈ విధంగా విద్యాధరీశులు సర్వులూ క్రమంగా దానితో దూరంగా త్రోసివేయబడి అతికష్టం మీద రాళ్ళుతగిలి చూర్ణితాలైన అంగాలతో పైకి లేచి కూర్చున్నారు.

అప్పుడు దర్పంతో ఆ సర్పం మీదికి శ్రుతశర్మ కూడా చంపవలెనని వెళ్ళినాడు. కానీ అది యథాప్రకారమే నిశ్వాస వాయువుతో దూరంగా ఎత్తిపారవేసినది. కొంత దూరంలోనే పడిన అతను తిరిగి లేచి పరువెత్తగా అప్పుడది అతిదూరంగా శ్వాసవాయువుతోనే కొనిపోయి వానిని నేలపై పడవేసినది.

ఈ విధంగా వికృతుడై ఒడలంతా సడలిపోగా శ్రుతశర్మ మెల్లగా లేచినాడు. అప్పుడు సుమేరువు సూర్యప్రభుని ఆ సర్ప

గ్రహణం కోసం పంపగా — " ఈ అజగరాన్ని పట్టుకొనుటకు కూడా అతను లేచాడు చూచారా? ఈ మానవులకు మర్కటాలకు వలెనే విచక్షణాజ్ఞానం లేదు. ఇతరులేం చేస్తే దానిని చూచి అలాగే అనుకరిస్తారు " అని విద్యాధరులు సూర్యప్రభుని చూచి అపహసించినారు.

వారలా నవ్వుతుండగానే సూర్యప్రభుడు దానిని సమీపించి పడగను పట్టుకొని బిలంలో నుంచి బయటకు లాగినాడు. తక్షణమే ఆ భుజంగం చక్కని అమ్ముల పొదిగా మారినది. ఆ సమయంలో ఆకసం నుంచి అతనిపై పుష్పవర్షం కురిసినది.

" ఓ సూర్యప్రభా! ఇదే నీకు అక్షయ తూణీరం లభించినది. దీనిని తీసుకొమ్ము " అన్న దివ్యవాణి గట్టిగా వినిపించినది. అప్పుడు విద్యాధరులు గ్లాని పొందినారు. సూర్యప్రభుడు ఆ తూణీరాన్ని తీసుకున్నాడు. మయుడు. సునీథుడు. సుమేరువు అందరూ ఆనందించినారు.

విద్యాధర బలంతో పాటూ శ్రుతశర్మ వెళ్ళిపోగా సూర్యప్రభుని వద్దకు అతని దూత వచ్చి ఇట్లన్నాడు: " మా ప్రభువు శ్రుతశర్మ నిన్నిట్లా ఆదేశిస్తున్నాడు - నీకు బ్రతకాలని ఉంటే ఆ తూణీరాన్ని నాకు ఇచ్చివేయవలసింది. "

అందుకు సూర్యప్రభుడు ఇలా జవాబిచ్చినాడు: "ఓ దూతా, నీ వతని వద్దకు వెళ్ళి ఇట్లా చెప్పు — నా శరావృతమై నీ శరీరమే నా అమ్ములపొది కాగలదు. " ఈ జవాబును విని ఆ దూత పరాఙ్ముఖుడై వెళ్ళగా ఆ శ్రుతశర్మ మాటవిని వారందరు నవ్వినారు.

ఆ తర్వాత సూర్యప్రభుని సుమేరువు ఆలింగనం చేసుకొని ఆనందంతో ఇట్లా అన్నాడు: "విధివశాత్తూ శంకరుని వాక్యం ఫలించినది. అందులో సందేహం లేదు. ఈ తూణరత్నం సిద్ధించింది గనుక చక్రవర్తిత్వం నీకు సిద్ధించినట్టే అయినది. ఇప్పుడు వెళ్ళి నిరాకులుడవై ధనూరత్నాన్ని కూడా సంపాదించు.

ఈ సుమేరుని మాటవిని, అతనే దారి తీయగా సూర్యప్రభా దులు హేమకూటాచలానికి వెళ్ళినారు. దాని ఉత్తర పార్శ్వంలో మానససరోవరం ఉన్నది. దానిని వారు సమీపించినారు. సముద్ర నిర్మాణానికిముందు బ్రహ్మకది అభ్యాసరూపంగా పనికి వచ్చినట్టున్నది. దానిలో క్రీడిస్తున్న దివ్యనారీముఖాలు గాలికి కదలుతున్న వికసిత కనకాంబుజాలతో ఆచ్ఛాదితాలౌతున్నవి. ఆ మానస సరస్సౌభాగ్యాన్ని వీరంతా చూస్తుండగా అంతలోనే అక్కడికి శ్రుతశర్మాదులు కూడా వచ్చినారు.

అంతట సూర్యప్రభుడు, ఇతరులు అందలి కమలాలను పట్టుకొని హోమం చేసినారు. ఒక్క క్షణంలో అందులోనుండి ఘోరమైన మేఘమొకటి బయటికివచ్చినది. అది గగనాన్నంతా వ్యాపించి మహావర్షాన్ని కురిసినది. ఆ కాలాంబుద మధ్యం నుండి ఒక నాగం క్రిందపడినది. సుమేరు వాక్యం వల్ల పైకిలేచి సూర్య ప్రభుడు గాఢంగా దాన్ని పట్టుకొన్నాడు. అది గొప్ప ధనుస్సుగా మారినది. ఆ తర్వాత మరొక నాగం ఆకసం నుంచి క్రిందపడినది. అది విషాగ్నులను ఉమియుస్తూ భయభ్రాంతులై ఖేచరులందరూ నశించునట్లు చేసినది. ఆ సూర్యప్రభుడు దానిని కూడా పట్టు కొనగా అది ధనుర్గుణ (నారి) రూపాన్ని పొందినది. త్వరలోనే ఆ మేఘం నశించి పోయినది.

ఆ సమయంలో ఆకసంనుంచి పుష్పవృష్టి కురిసినది. దివ్య వాణి ఇలా వినిపించినది "ఓ సూర్యప్రభా! బలిష్ఠమైన ఈ ధనుస్సు నీకు సిద్ధించినది. దాని అల్లెత్రాడు కూడా అభేద్యమైనది. ఇవి రెండూ రెండు రత్నాలు. వానిని తీసుకొమ్ము."

ఆ మాట విని సూర్యప్రభుడు వానిని పరిగ్రహించినాడు. శ్రుతశర్మ ఇది చూచి ఉద్విగ్నుడై అనుచరులతో పాటు తపో వనానికి వెళ్ళిపోయినాడు. సూర్యప్రభాదులు, మయాదులు సంతోషించినారు.

ఈ ధనురుత్పత్తిని గురించి వారందరూ ప్రశ్నింపగా సుమే రువు ఇట్లా అన్నాడు:

" ఇక్కడ దివ్యమైన వెదుళ్ళవన మొకటున్నది. అందులో నుండి ఆ వెదుళ్ళను లాగి ఈ సరోవరంలో పడవేస్తుంటారు. ఇలాంటి మహాధనుస్సులు అందులో నుండి దొరుకు తుంటాయి. పూర్వం దేవతలు వానితోనే తమకు తమకు కావలసిన వానిని సాధించుకుంటూ వస్తున్నారు. అసురులు, గంధర్వులు, విద్యా ధరోత్తములు వానిని తీసుకుంటూ ఉంటారు. అయితే వాటి పేర్లు వేరు. చక్రవర్తికి పనికి వచ్చే అమృత బల నామం కల ధనుస్సు లను పూర్వం దేవతలిందులో వేసి ఉన్నారు. అవి కష్టం మీద శుభకర్ములకు లభిస్తూ ఉంటాయి. ఈశ్వరేచ్ఛతో కొందరు భవి ష్యద్ చక్రవర్తులకు అవి దొరుకు తుంటాయి. ఇప్పుడు సూర్య ప్రభునకు ఈ మహాకార్ముకం సిద్ధించినది. తమకు తమకు అనుగుణ మైన వానిని ఈయన వయస్యులు సాధించుకొన వచ్చును. ఈ విద్యాసిద్ధులైన వీరులకు అందుకు తగిన యోగ్యత కలదు. ఎవరికి తగినట్టుగా వారికి భావిసిద్ధుల ననుసరించి అవి దొరుకుతూ ఉంటాయి."

ఈ సుమేరువు వచనాన్ని విని ప్రభాసాదులైన సూర్య ప్రభుని సచివులు ఆ వేణు వనంలోనికి వెళ్ళినారు. దానిని రక్షిస్తూ ఉండే చండదండుడనే రాజును జయించి, ఆ వెదుళ్ళను తెచ్చి ఆ సరస్తీరంలో ఉంచినారు. ఆ తీరంలో ఉపవసిస్తూ, జపంచేస్తూ, హోమంచేస్తూ ఉన్న ఆ సత్త్వశాలులకు ఏడు రోజులలో ధనుస్సులు సిద్ధించినవి.

అవి అలా దొరికిన తర్వాత మయాదులతో పాటు ఆ సూర్యప్రభుడు సుమేరుని తపోవనానికి వచ్చినాడు. అక్కడ వేణువనేశ్వరుడైన చండదండుడు పరాజితుడు కావడం అద్భుతం అని సుమేరువన్నాడు. " అతని వద్ద మోహినీవిద్య ఉన్నది. అందు వల్ల అతడు దుర్జయుడు. దానిని ప్రధాన శత్రువుల కోసమై అతను దాచి ఉంటాడు. అందు వల్ల నీ వయస్యులపై తానావిద్యను ప్రయోగించ లేదు. అది ఏదో ఒకసారి మాత్రమే ఫలిస్తుంది. పదే పదే ఫలించదు. గురువు మీదనే దాని ప్రభావాన్ని పరీక్షింపదలచి అతను ప్రయోగించినాడు, అందువల్ల ఇలాంటిశాపం అతనికి వచ్చినది. కాబట్టి ఈ విద్యలప్రభావం దురాశ్రయమైనది.దీనికి కారణమేమిటో మీరు మయుని ప్రశ్నింపవచ్చును. ఆయన ముందు నేనేం చెప్పగలను? సూర్యునిముందు దీపం వంటి వాడను " అని ఈ విధంగా సుమేరువు సూర్యప్రభునితో చెప్పగా మయుడిట్లా అన్నాడు:

"ఆ సుమేరువన్న మాట నిజమే. దీని వివరం సంక్షిప్తంగా చెప్తాను వినండి. అవ్యక్తం నుంచి ఆయా శక్తి అనుశక్తులు ప్రభవిస్తూ ఉంటాయి. అందులో నుంచే ప్రాణశక్తి ఉద్భవిస్తుంది. అది నాదరూపమై బిందు పథాన్ని ఆశ్రయిస్తుంది. అది పరతత్త్వ

కళాన్వితమై విద్యాది మంత్ర రూపాన్ని ధరిస్తుంది. ఆ మంత్ర విద్యలు జ్ఞానంతోగానీ, తపస్సుతోకానీ, సిద్ధాజ్ఞతోగానీ సిద్ధిస్తాయి. వాటి ప్రభావం అతిక్రమింపరానిది. కాబట్టి ఓ నాయనా! సర్వ విద్యలూ నీకు లభించినట్టే. ఇక రెండు విద్యలు మాత్రమే నీ కింకా సిద్ధించలేదు: అవి మోహిని, పరివర్తినీ అనే విద్యలు. వాటిని సాధించడానికి యాజ్ఞవల్క్యుని వద్దకు వెళ్ళి ప్రార్థించవలసింది. ఆయన కవి తెలుసును" అని ఋషియుడు చెప్పగా సూర్యప్రభుడు ఆ మునివద్దకు వెళ్ళినాడు.

ఆయన ఇతనిని ఏడురోజులు భుజగహ్రదంలో నివసింప జేసినాడు. అగ్నిమధ్యంలో మూడురోజు లుంచినాడు. ఆ విధంగా ఉండి తపస్సు చేసేట్టు చేసినాడు. ఏడురోజులకు ఆ మోహినీ విద్య, నాగులను చూచి సహింపగలది సూర్యప్రభునకు స్వాధీనమైనది. మూడురోజులలో అగ్నితాపాన్ని సహింపజేసే పరివర్తినీ విద్య లభించినది. ఈ విద్యలను సాధించుకొని తిరిగి వహ్నికుండ ప్రవేశం చేయవలసినదని ముని ఆజ్ఞాపింపగా అతడట్లే చేసినాడు.

తత్క్షణమే కామగమనం కల మహాపద్మ విమానం అతనివద్దకు వచ్చినది. అది గగనసంచారి. అష్టోత్తర పత్రములు కలిగి, ఒక్కొక్క పత్రమునందు నూరు వట్టణాలు కలిగి, మహారత్నాలతో నానారూపాలైన అలంకారాలతో వినిర్మితమైనది.

"చక్రవర్తి విమానం నీ కోసం సిద్ధమైనది. ఈ పురాలలో అంతఃపురాలు కూడా కలవు. వీటన్నిటా మీ వారిని ఉంచవచ్చును. వారు అందువల్ల నీ శత్రువులకు పట్టుబడకుండా ఉంటారు'' అని ఆ అంతరిక్షం నుంచి సరస్వతీవాక్యం వినిపించినది.

అప్పుడతను తన గురువైన యాజ్ఞవల్క్యునికి వినమ్రుడై ఇలా విన్నవించుకున్నాడు: "ఎలాంటి గురుదక్షిణ మీ కివ్వవలెనో ఆదేశించండి. మీకు సమర్పించు కుంటాను.'' అప్పుడా ముని ఆ మాటకు "నీ అభిషేక కాలంలో నన్ను స్మరింపవలసింది. అదే నాకు దక్షిణ. నీ వింక వెళ్ళిపోవచ్చును. నీ సైన్యాన్ని చేరుకో వచ్చును'' అని అన్నాడు. పిదప ఆ మునికి నమస్కరించి విమానాన్ని అధిరోహించి సుమేరు సాను నివాసస్థమైన తన సైన్యాన్ని సూర్యప్రభుడు చేరుకున్నాడు.

అక్కడ తన వృత్తాంతాన్నంతటినీ చెప్పగా సునీథుడు. సుమేరుడు, మయాదులు ఆ సిద్ధవిద్యా విమానాన్ని చూచి అభినందించినారు. అంతట సునీథుడు సువాసకుమారకుని స్మరించుకొన్నాడు. అతను వచ్చి రాజులతో పాటు ఉన్న మయాదులతో ఇట్లన్నాడు: "విమానం సిద్ధమైనది. సూర్యప్రభునకు సకల విద్యలూ సంప్రాప్తములైనవి. మనమింకా శత్రుజయం కోసం వెళ్ళకుండా ఉదాసీనత వహించడం దేనికి?''

ఆ మాట విని మయు డిట్లా అన్నాడు: "ఆయన అన్న మాట నిజమే. అయితే మొదట మనం దూతలను పంపించాలి. రాజనీతిని ప్రయోగించాలి" అని మయుడనగా ఆ ముని పుత్రకు డిట్లన్నాడు: "అలాగే కానీ అందువల్ల కలిగే చ్యుతి ఏమున్నది? ప్రహస్తుని పంపవచ్చును. అతను ప్రతిభ కలవాడు. మాటకారి. కార్యకాలగతిజ్ఞుడు. కఠినుడు. సహిష్ణువు. కనుక దూతల కుండవలసిన అన్ని గుణాలూ అతనికి కలవు." ఈ మాటలపై వారు శ్రద్ధ వహించినారు.

ఆ తర్వాత సందేశమిచ్చి శ్రుతశర్మతో దౌత్యం నెరపుటకై ప్రహస్తుని పంపించినారు. అతనలావెళ్ళగా సూర్యప్రభుడు తన

వారందరితోనూ ఇట్లన్నాడు : "వినండి చెప్తాను. నేనొక అపూర్వ స్వప్నాన్ని కన్నాను — తెలతెలవారు తుండగా మహాజల ప్రవాహంలో మన మందరమూ చిక్కుకున్నాము. అందులోనే నృత్యం చేస్తున్నాము కానీ మునిగిపోలేదు. ఆ తర్వాత ఆ ప్రవాహం ఎదురుగాలితో వెనుదిరిగినది. ఆ తర్వాత తేజఃపుంజంలా జ్వలిస్తున్న ఒకానొక పురుషుడు మనలనందరనూ ఎత్తి అగ్నిలో పడవేసినాడు. అయినా మనం దగ్ధం కాలేదు. ఒకానొక మేఘం రక్తపుంజంవలె వచ్చి రక్త వర్షం కురిపించినది. అది దిక్కులన్నీ వ్యాపించినది. అంతలో రాత్రితో పాటూ నా కల ముగిసినది."

ఈ మాట విని ఆయనతో సువాసకుమారకు డిట్లన్నాడు: "అభ్యుదయమన్నది కష్టపడి సంపాదించు కొనవలసినదని ఈ స్వప్నం సూచిస్తున్నది. ఆ జలప్రవాహమే మహాసంగ్రామం. అందులో మునిగిపోక పోవడం ధైర్యాన్ని సూచిస్తుంది. అందులో నృత్యం చేస్తూ వెళ్ళినామంటే, ఆ జలప్రవాహం వెను దిరిగిన దంటే, ఒకానొక మరుద్రక్షణకూడా కలదు.

అందులోనుంచి తేజఃపుంజం లాంటి పురుషుడు కనిపించినాడు అన్నావు. ఆయనే సాక్షాత్తూ శంకరుడు. ఆయన. అగ్నిలో పడవేయగా కాలిపోలేదంటే, మహాసంగ్రామంలో దూకినా నిలిచినా మన్నమాట. అప్పుడు మేఘం గగనవ్యాప్తమైనదంటే, తిరిగీ ఏదో భయం కలదని సూచిస్తున్నది. రక్తవర్షం ఆ భయవినాశనానికి సూచనం దిక్కులన్నీ రక్తపూర్ణాలయినవంటే, మీకు కలుగ నున్న మహాసమృద్ధికి సూచన. ఈ స్వప్నం అనేక విధాలా అన్యార్థంగానూ, యథార్థంగానూ, అపార్థంగానూ కూడా కనబడు తున్నది. అది ఇప్పుడు ఒకఅర్థాన్ని సూచిస్తున్నది. అది మరొక అర్థానికి రూపంగా ఉన్నది.

ప్రసన్న దేవతాదేశ రూపమైన ఈ స్వప్నం యథార్థమైనది. గాఢానుభవ చింతాదులతో ఏర్పడునది. దానినే అపార్థమంటారు. రజోమూఢమైన, బాహ్యార్థ విముఖమైన మనస్సులో, మనుష్యులు నిద్రావశులై ఆ యా కారణాలవల్ల కొన్ని కలలను కంటారు. ఆ కల విశేషాన్ని బట్టి ఆ ఫలం ఆలస్యంగానో, త్వరగానో సంభవిస్తుంటుంది. రాత్ర్యంతంలో కనబడిన కల శీఘ్రంగా ఫలిస్తుందని అంటారు.''

ఈ మునికుమారుని ద్వారా అదంతా విని దిగులువదలిపోగా లేచి, దినకర్తవ్యాన్ని సూర్యప్రభాదులు నిర్వర్తించుకున్నారు.

ఇంతలో ప్రహస్తుడు శ్రుతశర్మ దగ్గరనుంచి తిరిగి వచ్చినాడు. మయాదులందరూ అతనిని ప్రశ్నింపగా జరిగిన వృత్తాంతాన్నంతటినీ అతనిట్లా చెప్పినాడు:

"అతిత్వరగా త్రికూటాచలం మీద నున్న హేమనిర్మితమైన త్రికూటపతాకమనే నగరానికి వెళ్ళినాను. అందులో ప్రవేశించి ప్రతీహారి నివేదింపగా లోనికి వెళ్ళి ఆయా విద్యాధరాధిపులతో పరివృతుడై ఉన్న శ్రుతశర్మను చూచినాను. తండ్రి త్రికూటసేనుడు–అలాగే విక్రమసేనుడు, ధురంధరుడు మొదలైన శూరులతోనూ, ఇతర దామోదరాది వీరులతోనూ ఆయన సభ తీరి ఉన్నాడు. అక్కడ నేనుకూర్చొని శ్రుతశర్మ నుద్దేశించి ఇట్లన్నాను:

"శ్రీమాన్ సూర్యప్రభ భూపతి పంపగా నేను మీ దగ్గరకు వచ్చినాను. ఆయన ఇలా సందేశం పంపించినాడు – 'ధూర్జటి అనుగ్రహంతో విద్యలను, రత్నాలను, భార్యలను, సహాయకులను సాధించుకున్నాను. నీవు వచ్చిన సైన్యంతో పాటూ నా సైన్యాన్ని

ఎదుర్కో. నేను విరోధులకు నిహంతను. ఆశ్రితులకు రక్షకుడను. నీవు సునీథుని కుమార్తెను అజ్ఞాతంగా అపహరించుకొని వెళ్ళినావు. ఆ కామచూడామణి అనే కన్యను వదలిపెట్ట వలసింది. అది తప్పు కదా."

ఈ విధంగా నేను చెప్పగా వారందరూ క్రుద్ధులైనారు. "వీడెవడు? గర్వంతో మనకు ఇలాంటి సందేశం పంపుతున్నా డేమిటి? తన సాటి మానవులకు సందేశమిచ్చు కోవచ్చును. కానీ విద్యాధరుల ఎదుట వీడెవడు? ఒకానొక మానవమాత్రుడు అయి ఉండి గర్వపడితే వినాశమౌతాడు" అన్నారు.

ఆ మాటవిని నేనన్నాను — "నేను చెప్పిన సందేశం ఎవరిదో చెప్తాను వినండి. ఆయన ఈశ్వరునిచే మీ విద్యాధరు లందరకూ చక్రవర్తిగా నిర్దిష్టుడై ఉన్నాడు. మర్త్యులే అయినా ఆ మర్త్యులే దేవత్వాన్ని సాధించడం మీరెరుగుదురు. విద్యాధరులు మర్త్య మాత్రులుకూడా ఆయన పరాక్రమాన్ని రుచి చూచినారు. ఆయన ఇక్కడికే వస్తే బహుశా మీరూ నాశమొందగలరు. అది కూడా మీరు చూడవచ్చును."

ఈ మాట నేననగానే ఆ సభంతా క్రుద్ధమై సంక్షోభం చెందినది. నన్ను చంపుటకై శ్రుతశర్మ ధురంధరులు పరువెత్తి రాగా 'మీ శౌర్యాన్నికూడా చూస్తాను రండి' అని నేనన్నాను. అలా వస్తున్న వారిని దామోదరుడు లేచి వారించినాడు. "శాంతపడండి. అతను దూత. విప్రుడు. కాబట్టి అవధ్యుడు" అని అన్నాడు.

అప్పుడు విక్రమశక్తి నాతో ఇట్లన్నాడు: "ఓ దూతా! నీవు వెళ్ళిపో. మీ స్వామి వలెనే మేమందరమూ ఈశ్వర నిర్మితులమే.

కాబట్టి అతనే రానీ చూతాము. అతని కాతిథ్య మివ్వగలశక్తి మాకున్నది" అని గర్వంతో అతననగా నేను నవ్వి ఇట్లన్నాను.

"హంసలు పద్మవనంలో చేరి హాయిగా కూర్చొని కలకూజితం చేస్తాయి. అదంతా మేఘం కమ్ముకొని రానంతవరకే'' అని చెప్పి అక్కడినుంచి లేచి వారి నవమానిస్తున్నట్టుగా బయటికి వచ్చి ఇక్కడికి చేరుకున్నాను''

అని ప్రహస్తుడు చెప్పగా మయాదులందరూ సంతుష్టి చెందినారు. వారు యుద్ధానికి వెళ్ళవలెనని నిశ్చయించుకొని సేనాపతిని నియమించినారు. రణదుర్మదుడైన ప్రభాసుని సూర్యప్రభాదులు సేనాపతిగా నియమించినారు. అందరూ రణదీక్షితులై సువాసకుమారుని నుంచి నిర్దేశాన్ని పొంది ఆ పగలంతా నియతవ్రతులైనారు.

ఆ రాత్రి సూర్యప్రభుడు వ్రత శయ్యాగృహాంతరుడై ఉండగా లోనికి ప్రవేశిస్తున్న ఒక వరకన్యను. అద్భుతమైన దానిని. మేల్కొనే ఉన్నాడు గనుక చూచినాడు. ఆమె దొంగ నిద్రపోతున్న ప్రసుప్త సచివుని వద్దకువచ్చి తనతో నున్న సఖితో ఇట్లన్నది: "ఈయన నిద్రపోతుండగానే ఈ విశ్రాంత విలాసం ఇలాంటిదైతే. ఇక మేల్కొని ఉన్నప్పుడు ఈయన రూపశోభ ఎంత అద్భుతంగా ఉంటుందో! అదలా ఉండనీ: ఈయనను లేపవద్దు. మన కుతూహలం తీరినది. ఈయనను చూచి పరవశమైన నా హృదయాన్ని ఇంకా బాధపెట్టు కొనడమెందుకు? త్వరలోనే శ్రుతశర్మతో యుద్ధం రానున్నది గదా. అందులో ఎవరికి ఏమి కానున్నదో మనకేం తెలుసు? రణోత్సవ మన్నదే శూరుల

ప్రాణాలు తీయడానికే ప్రవర్తిల్లుతుంది. ఇతనికి శుభమగుగాక! ఆ తర్వాత ఏం జరుగుతుందో మనం తెలుసుకుందాం. వ్యోమ విహారి అయిన కామ చూడామణిని దర్శించిన ఇతని హృదయాన్ని నేనేమి రంజింపజేయగలను? ''

ఆ మాటకు ఆమె చెలికత్తె ఇట్లన్నది: "అలా అంటా వేమిటి? నీ మనసు ఆయనపై లగ్నం కాలేదా? కామచూడామణీ హృదయాన్ని ఆహరించినవాడు మరొకరి హృదయాన్ని ఆహ రించడా? ఆమె సాక్షాత్తూ అరుంధతి అయితే మాత్రమేమిటి? విద్యావశంవల్ల ఈయనకు యుద్ధంలో కల్యాణప్రాప్తి కాగలదని సిద్ధులు వీరి భార్యలకు ముందే చెప్పియున్నారు.

— కామచూడామణీ. నీవు, సుప్రభ కూడా ఏక గోత్రజులు. వీరిలో ఇప్పుడు సుప్రభ మాత్రమే పరిణీతురాలైనది. మరి యుద్ధంలో అశుభమెట్లా జరుగుతుంది. సిద్ధవాక్కులు అసత్యం కావు కదా! సుప్రభ చిత్తాన్ని ఆహరించినవాడు నీ హృదయాన్ని హరింపడా! నీ రూపం మరింత అద్భుతమైనది కదా? బాంధవా పేక్షతో నీకేదో వికల్పం కలుగుతుందనుకోలేదు. భర్త కంటే ఇతరులెవరూ సతులకు బాంధవులు కారుకదా."

ఈ చెలికత్తె మాట విని ఆ వరకన్యక ఇట్లన్నది: "నీవు చెప్పినది నిజమే నాకు అన్య బంధువులతో నిమిత్తంలేదు. యుద్ధంలో కూడా ఆర్యపుత్రునకు జయం కలుగ గలదని విద్యా ప్రభావంవల్ల నాకు తెలుసును. ఈయనకు రత్నాలు. విద్యాలు లభించినవి. అయితే ఓషధులు ఇంకా లభింపలేదు. అందువల్ల నా మనసు కొంత వ్యాకులపడు చున్నది. చంద్రపాదగిరిలో ఒక గుహ లోపల ఆ ఓషధులన్నీ ఉన్నవి. పుణ్యభాజనులైన చక్రవర్తు

అక్కడ ఆ గృహద్వారాన్ని వీరు సమీపింపగా విచిత్ర వికృత ముఖాలతో ప్రమథగణాలు వచ్చి దారిని అడ్డగించినవి. అప్పుడు "వీరితో యుద్ధం చేయరాదు. చేస్తే పరమేశ్వరునికి కోపం రావచ్చును. కాబట్టి ఆ వరదునే అష్టసహస్ర నామాలతో స్తుతింతాము. అలాగే వీరు ప్రసన్నులు కాగలరు" అని సువాస కుమారుడు సూర్యప్రభాధిపులకు చెప్పినాడు. అందుకు సరేనని వారు ఈశ్వరుని స్తుతించినారు.

స్వామిస్తుతికి ప్రసన్నులైన ప్రమథులు ఇట్లన్నారు: "మేమీ గుహను వదలిపెడుతున్నాం. ఇందలి మహౌషధులను కొనిపొండు. కానీ సూర్యప్రభుడు ఇందులోనికి స్వయంగా ప్రవేశింపరాదు. ప్రభాసుడు ప్రవేశింపవచ్చును. అతనికిది సుగమము." ఈ గణవచనాన్ని విని వారందరూ అందుకు అనుమతించినారు.

అదే ప్రకారమే అందులో ప్రభాసుడు ప్రవేశింపగా అంధకారబంధురమైన ఆ గుహ సుప్రకాశమైనది. అందులోని రాక్షసులు మహాఘోరరూపులు నల్గురు కింకరులు నిల్చొండి లోనికి రావలసిందిగా ఆహ్వానించినారు. అంతటలోన ప్రవేశించిన ప్రభాసుడు దివ్యాలైన సప్తౌషధులను సంగ్రహించి బయటికి వచ్చి సూర్యప్రభునకు వాటినన్నిటినీ సమర్పించినాడు.

అప్పుడు ఆకాశవాణి ఇలా వినిపించినది: "ఓ సూర్యప్రభా! మహాప్రభావ సంపన్నాలైన ఈ ఏడు ఓషధులూ నీకు సిద్ధించినవి." ఆ ఆకాశవాణిని విని సూర్యప్రభాదులు అందరూ సంతుష్టులై అతి త్వరగా సుమేరువు వద్దనున్న తమ సేనలను సమీపించినారు.

అక్కడ సునీథుడు సువాసకుమారుని ఇట్లా ప్రశ్నించినాడు: "మునీశ్వరా! సూర్యప్రభుని వదలి ఆ ప్రభాసుని గుహలో ప్రవేశింపజేయడ మెందుకు? గణములతో ఆ గుహలోనున్న కింకరులు అతని నెందుకు సత్కరించినారు?"

ఆ మాట విని అక్కడున్న వారందరూ వింటుండగా ముని ఇట్లా అన్నాడు: "ఈ వివరం చెప్తాను వినండి. ప్రభాసుడు ఎంతో హితకారి. సూర్యప్రభునకు ఆత్మభూతుడు. వారిరువురికీ భేదంలేదు. అంతేకాక ప్రభాసునితో సమానుడైన మరొక శౌర్య ప్రభావ సంపన్నుడు లేడు. ప్రాగ్జన్మసుకృతం వల్ల ఆ గుహ ఇతనిది. ఈయన పూర్వమెలా ఉండెనో దానిని గూడా చెప్తాను.

పూర్వజన్మలో ఇతను నముచి అనే దానవసత్తముడుగా ఉండెను. దానప్రసక్తిలో ఆ మహావీరుడు అప్రతిమానుడు. ఆయన పేరు సార్థకం. అహితునకైనా అడిగితే ఇవ్వగూడనిదేది ఆయన దృష్టిలోలేదు. ఆయన పదివేల ఏళ్ళు ధూమ పాయి అయి తపస్సు చేసి బ్రహ్మనుంచి వరం పొందినాడు. అదేమనగా లోహంతోగానీ, రాళ్ళతోగానీ, కట్టెలతోగానీ తాను అవధ్యుడు. ఆ తర్వాత అనేక మార్లు ఇంద్రుని జయించి, అతనిని దేశాలు పట్టించినాడు. అప్పుడు అతను ప్రార్థింపగా కశ్యపమహర్షి దేవతలతో సంధి చేయించినాడు.

ఆ తర్వాత విశ్రాంత వైరులై సురాసురులు మందర పర్వతంతో క్షీరసాగరాన్ని మథించినారు. అందులో పుట్టిన కమలా ప్రభృతులను అచ్యుతాదులెలా విభజించు కొన్నారో అలాగే నముచికి అందులో పుట్టిన ఉచ్చైశ్రవమనే తురంగం దక్కినది. ఆ చిలుకుతున్న సముద్రంలో నుంచి పుట్టిన ఆయా వస్తువులను బ్రహ్మ వివిధ దేవాసురులకు అందించినాడు.

సముద్రమథనంతో అంతలో అమృతం లభింపగా దానిని దేవతలు అపహరించినారు. అప్పుడు తిరిగి వారికి, అసురులకూ వైరం జనించినది. ఆ తర్వాత దేవాసుర రణం జరుగగా సురలు ఏ అసురులనైతే చంపినారో వారి వారి నందరినీ మూర్కొని ఉచ్చైశ్రవం తక్షణమే బ్రదికింప జొచ్చినది. ఆ విధంగా దైత్య దానవులు అజేయులని దేవతలు గ్రహించినారు.

అప్పుడు విషణ్ణుడై ఉన్న ఇంద్రునితో బృహస్పతి ఇట్లా చెప్పినాడు: "ఇప్పుడు దీని కొకే ఉపాయమున్నది. వెంటనే నీవా పనిచేయాలి. స్వయంగా నీవువెళ్ళి ఆ హయోత్తమాన్ని ఇవ్వవల సిందిగా నముచిని యాచింప వలసింది. విపక్షానికి చెందినవాడ యినా నీకాయన ఆ గుఱ్ఱాన్ని ఇవ్వకుండా ఉండడు: అజన్మ సంచితమైన దాతృత్వ కీర్తిని అలా పాడు చేసుకోడు.''

ఇలా దేవగురువు చెప్పగా విని మహేంద్రుడు దేవతలతో పాటూ నముచివద్దకు వెళ్ళి ఆ ఉచ్చైశ్రవాన్ని యాచించినాడు. "నన్ను యాచించుటకై వచ్చిన వాడెవడూ పరాఙ్ముఖుడు కారాదు. అందులో వాసవుడెట్లా తిరిగిపోతాడు? మరి అతనికి నేను నముచినై ఉండి ఆ గుఱ్ఱాన్నెలా ఇవ్వడానికి నిరాకరిస్తాను? జగత్తంతా నా దాతృతాకీర్తి చిరకాలార్జితమై వ్యాపించి ఉన్నది. అది మలిన మైతే నాకీ సంపద ఎందుకు? ఈ జీవితమెందుకు? అని ఆలో చించి మహాయశుడైన నముచి శుక్రుడెంతగా వద్దంటున్నా వినక ఆ హయాన్ని ఇంద్రునకు ధారాదత్తం చేసినాడు.

ఆ విధంగా గుఱ్ఱాన్ని ఇచ్చివేయగా ఇంద్రుడు వజ్రంపై గంగానదిపైని నురుగుపూసి దానితో ఉచ్చైశ్రవాన్ని చంపివేసి నాడు. శస్త్రాదులతో అది అవధ్యం గనుక అలా చేసినాడు.

ప్రపంచంలో భోగతృష్ణ దురంతమైనది కదా! దానితో ఎందరో మరణించినారు. దానికి వశీభూతులై అనౌచిత్యమైనప్పటికీ, అపకీర్తిని తెచ్చునదైనప్పటికీ దేవతలు కూడా జంకకుండా అలాంటి పనులు చేస్తారు.

ఇది తెలిసి ఆ నముచి తల్లి, తపోబలంవల్ల దుఃఖసంతప్తురాలైన తన శోకశాంతికై ఇలా సంకల్పం చేసినది: 'ఇందువల్లనే తిరిగి అదే నముచి నా గర్భంలో జన్మించి బలిష్ఠుడై తిరిగి సర్వదేవతలకూ యుద్ధాలలో అజేయుడగుగాక!''

తర్వాత అతను ఆమె గర్భంలో జన్మించినాడు. సర్వరత్నమయుడైన అతను బలిష్ఠుడు గనుక ప్రబలుడనే నామంతో ప్రఖ్యాతుడైనాడు. తిరిగి తపస్సుచేసి అర్థులను ప్రాణమిచ్చి అయినా సరే సంతోషపెడుతూ, ఆ ప్రబలుడనే దానవేశ్వరుడు నూరుమార్లు ఇంద్రుని జయించినాడు.

ఆ తర్వాత దేవతలందరూ సంప్రతించుకొని ఆయన నిట్లా యాచించినారు.

"మేము నరమేధం చేయవలసి ఉన్నది. దానికై మీ దేహాన్ని మాకు దానం చేయండి." ఆ మాట విని అతను శత్రువులైనా సరే తన దేహాన్ని దానం చేసినాడు. అర్థించిన వారికి ఉదారులు తమ ప్రాణాలనైనా ఇస్తారు కానీ వారిని వట్టి చేతులతో వెనుకకు పంపరు.

ఆ విధంగా దేవతలు ఆ ప్రబల దానవుని ఖండ ఖండములు చేసినారు. అతనే తిరిగి ఇప్పుడు మానుషరూపంలో ప్రభాసుడనే పేర జన్మించినాడు. మొదట నముచి, తర్వాత ప్రబలుడనే దానవుడైన అతనే ఇప్పుడు ప్రభాసుడైనాడు. ఆ పుణ్యప్రభావం వల్ల శత్రువులకు అజేయుడుగా ఉన్నాడు.

ప్రబలుడుగా ఉన్నప్పుడు అతనికి సంబంధించినదే ఈ ఓషధీగుహ. అందువల్ల ప్రభాసునకది ఆత్మీయమైనది. కింకరులతోపాటూ స్వాధీనమైనది. దాని క్రిందనే పాతాళంలో ఆ ప్రబలుని మందిరంలో అతని భార్యలు పంద్రెండుగురు సాలంకృతలై ఉన్నారు. వివిధరత్నా లందులో ఉన్నవి. అనేకాయుధాలు అందులో ఉన్నవి. చింతామణి కూడా అక్కడే ఉన్నది. లక్ష యోధుల తురంగా లందులో ఉన్నవి. ఆ ప్రభాసునికి సంబంధించి ఇదంతా పురార్జితమై ఉన్నది. ఇలాంటివాడు ప్రభాసుడు గనుక ఇలా జరగడంలో అద్భుత మేమీ లేదు."

ఈ విధంగా మునికుమారుడు చెప్పగా విని సూర్యప్రభాదులు ఆ రత్నాదులను సాధించుటకై ఆ పాతాళంలోని ప్రబల గృహానికి వెళ్ళడం కోసం బిల ప్రవేశం చేసినారు. ఆ గృహంలో ప్రవేశించి అపూర్వ రత్నాలను, చింతామణిని, తురగాలను, అసుర యోధులనూ బయటికి తెచ్చి ఆ సకల సంపదలకూ అధిపతి అయి సూర్యప్రభుని ఆ ప్రభాసుడు సంతోషపెట్టినాడు.

.తర్వాత సునీథుడు ప్రభాసునితో, సుమేర ప్రభృతులతో అనుగతుడై, రాజులు, మంత్రులూ కూడా వెంటరాగా, త్వరలో అభిమత సిద్ధిని పొంది, సూర్యప్రభుడు తిరిగి నిజసేనా సన్నివేశానికి చేరుకొన్నాడు.

అక్కడ అసురనరాధిపుడు తమ తమ వాసగృహాల లోనికి పోగా రణదీక్షితుడు గనుక నిగ్రహించుకొని కుశాస్తరణంపై పడుకొని ఆ రాత్రిశేషాన్ని గడపినాడు.

ఇది మహాకవి శ్రీ సోమదేవభట్ట విరచితమైన
కథాసరిత్సాగరంలో సూర్యప్రభలంబకంలో
తృతీయ తరంగం.

# చతుర్థ తరంగం

## సూర్యప్రభుని యుద్ధ సన్నాహం

ఉదయం సైన్యాలతోపాటూ ఆ సుమేరు తపోవనం నుంచి, శ్రుతశర్మను గెలవడానికై సూర్యప్రభుడు బయలుదేరినాడు. అతని నివాసం ప్రక్కన త్రికూటాద్రి వద్దనున్న శ్రుతశర్మ బలగాన్ని బలాత్కారంగా తొలగింపజేసి అక్కడ తన సేనా శిబిరం ఏర్పాటు చేసినాడు. ఆ విధంగా సుమేరు మయాదులతో ఆ ఆవాసంలో ఇతనుండగా త్రికూటరాజు శ్రుతశర్మకు సంబంధించిన దూత వచ్చినాడు. అతనువచ్చి ఖేచరేశ్వరుడైన సుమేరునితో ఇట్లన్నాడు:

"శ్రుతశర్మ తండ్రి అయిన రాజు నీకిలా సందేశం పంపినాడు. దూరంగా ఉన్న మేము మీకెప్పుడూ ఏమీ చేయలేదు ఇప్పుడు మా దేశానికి వచ్చినారు గనుక, అందులో ప్రాణాధికులతో పాటూ వచ్చినారుగనుక మీకు తగిన రీతిగా ఇప్పుడు ఆతిథ్యమివ్వ దలచుకున్నాము"

ఈ విధమైన శత్రు సందేశాన్ని విని సుమేరుడు దూతతో అన్నాడు. "చాంగుభళా! బాగాచెప్పావు. మా వంటి యోగ్యులైన అతిథులు ఇక మీకుదొరకరు, ఆతిథ్యం పరలోకంలో ఉండదు. ఈ లోకంలోనే అది ఫలాన్నిస్తుంది. అలాగే మాకు మీరు ఆతిథ్యమివ్వవచ్చును" అనగా అలాగే నని అతనువెళ్ళి తన ప్రభువునకు సుమేరు సందేశాన్ని తెలియ జేసినాడు.

ఆ తర్వాత ఉన్నత ప్రదేశస్థులై ఉన్న సూర్యప్రభాదులందరూ తమ తమ సైన్యాలు వేరు వేరుగా ఉండడం చూచి

నారు. అప్పుడు సునీథుడు తన తండ్రి మయాసురునితో మన సైన్యంలోని రథాది విభాగాలను అభివర్ణించవలసింది అన్నాడు. సరే అలాగేనని వేలెత్తి చూపుతూ సర్వజ్ఞుడైన ఆ దానవేంద్రుడు ఈ విధంగా చెప్పనారంభించినాడు.

"వీడు సుబాహువు, వీడు నిర్ఘాతుడు, ముష్టికుడు, గోహరుడు అలాగే ప్రలంబుడు, ప్రమాథుడు, కంకటుడు, పింగళుడు, వసుదత్తుడు వీరందరూ అర్ధరథులైన రాజులు.

అంకురి, సువిశాలుడు, దండి, భూషణుడు, సోమిలుడు, ఉన్మత్తకుడు దేవశర్మ, పితృశర్మ, కుమారకుడు, హరిదత్తు, వీరంతా పూర్ణరథులు.

ప్రకంపనుడు, దర్పితుడు, కుంభీరుడు, మాతృపాలితుడు, మహోభటుడు, ఉగ్రభటుడు, వీరస్వామి, సురాధరుడు, భండీరుడు, సింహదత్తుడు, గుణవర్మ, కీటకుడు, భీముడు, భయంకరుడు అనే వీరందరూ ద్విగుణరథులు.

విరోచనుడు, వీరసేనుడు, యజ్ఞసేనుడు, ఖుజ్జరుడు, ఇంద్రవర్మ, శబరకుడు, క్రూరకర్మ, నిరాసకుడు, వీరందరూ త్రిగుణ రథులైన రాజసుతులు.

సుశర్మబాహుశాలి, ప్రవీరవరుడు, సుప్రతిజ్ఞుడు, అమరారాముడు, చండదత్తుడు, జాలికుడు, మరిముగ్గురు వ్యాఘ్రభట, సింహభట, శత్రుభటులు, ఈ రాజులు, రాజపుత్రులు రథపంచ గుణులు.

ఉగ్రవర్మ అనే ఈ రాజపుత్రుడు షడ్గుణరథుడు. రాజపుత్రుడైన విశాఖుడు, సుతంతుడు, సుగముడు, నరేంద్రశర్మ వీరంతా సప్తగుణరథులు.

సహస్రాయువు పుత్రుడు మహారథి రాజకుమారుడు. ఇతను శతానీక మహారథుల దళానికి అధిపతి. సుభాస, హర్ష, విమల, మహావృద్ధి, అచల, ప్రియంకరు అనువారు సూర్యప్రభ వయస్యులు. మహాబుద్ధి, అచలుడు, ప్రియంకరుడు, శుభంకరుడు వీరంతా మహారథులు. యజ్ఞరుచి, ధర్మరుచి కూడా అంతే. విశ్వరుచి, భాసుడు, సిద్ధార్థుడు వీరు ముువ్వురు కూడా మహారథులే.

సూర్యప్రభుని సచివులు మహారథ యూథాధిపతులు—ప్రహస్తుడు, మహార్థుడు అతని అతిరథయూథపాలకులు. ప్రజ్ఞాఢ్యుడు, స్థిరబుద్ధి రథయూథాలకు అధిపతులు.

అలాగే దానవుడైన సర్వదమనుడు, ప్రమథనుడు, ధూమకేతువు, ప్రవహణుడు, వజ్రపంజరుడు, కాలచక్రుడు, మరుద్వేగుడు అతిరథాదిరథపాలకులు.

ప్రకంపనుడు సింహనాదుడు రథాధిరథయూథపులు.

మహామాయుడు, కాంబలికుడు, కాలకంపనకుడు, ప్రహృష్టరోముడు ఈ నలుగురు అసురాధిపులు. పుత్ర అతిరథయూథాధిపతులకు అధిపతులు.

సూర్యప్రభునితో సమానుడైన సైన్య నాయకుడు ప్రభాసుడు, సుమేరు తనయుడైనవాడు శ్రీ కుంజరకుమారకుడు. ఈ ఇద్దరూ మహారథయూథాధిపతులు. వీరంతా మనబలానికి చెందినవారు.

మిగత శూరు లెందరో తమ తమ బలాలతో ఉన్నారు. పరసైన్యం మనకంటే అధికంగా ఉన్నది. అయినప్పటికీ మన బలానికి వారు సరికారు. మహేశ్వరుని అనుగ్రహం మనపై ఉన్నది.''

— అని సునీథునకు మయాసురుడు చెప్తుండగా శ్రుతశర్మ తండ్రి వద్దనుంచి మరొకదూత వచ్చినాడు. అతనిట్లా అన్నాడు: "త్రికూటాధిపతి మీతో ఇట్లా చెప్పమన్నాడు. సంగ్రామ మన్నది శూరులకు మహోత్సవం వంటిది. ఇక్కడ భూమి ఇరుకుగా నున్నది. కాబట్టి మీరు ఇంకొంచె మిటురండు. అక్కడ కలాప గ్రామమున్నది. అక్కడ కావలసినంత విశాలమైన స్థలమున్నది."

ఆ మాటకు సరేనని సునీథాదులు తమ సైన్యాలతో పాటు సూర్యప్రభ సంయుతులై కలాప గ్రామానికి వెళ్ళినారు. శ్రుత శర్మాదులు అలాగే సమరోన్ముఖులై విద్యాధర బలాలతో పాటు అదే స్థలానికి వచ్చినారు. శ్రుతశర్మ బలాన్ని, వారి ఏనుగులను చూచి సూర్యప్రభాదులు తమ గజానీకాన్ని విమానాలపై ఎక్కించు కొని వచ్చినారు.

ఆ తర్వాత సేనాపతి శ్రుతశర్మ సేనలోని దామోదరుడు విద్యాధరోత్తముడు మహాసూచీ వ్యూహాన్ని పన్నినాడు. దాని పార్శ్వంలో శ్రుతశర్మ మంత్రులతో పాటూ స్వయంగా నిలిచి నాడు, అగ్రంలో దామోదరుడు, ఇతర మహారథులు ఉన్నారు. సూర్యప్రభుని సైన్యంలో కూడా ఆ సేనాపతి ప్రభాసుడు అర్థ చంద్ర వ్యూహం పన్నినాడు. దాని మధ్యలో స్వయంగా తానే ఉన్నాడు. దాని కోణాలలో కుంజర కుమారుడు, ప్రహస్తుడు ఉన్నారు.

సూర్యప్రభ సునీథాదులు సర్వులూ వెనుకభాగాన ఉన్నారు. సుమేరుడు, సువాసకుమారుడు ఆ వ్యూహానికి సమీపంలో ఉండగా ఉభయ సైన్యాలలోనూ రణదుందుభులు మ్రోగినవి. అంతలో ఈ మహాసంగ్రామాన్ని చూడడానికి వచ్చినదేవతలు, ఇంద్రాదులు,

లోకపాలురు, అప్సరసలు వీరందరితోను గగనం నిండిపోయినది. దేవతలతోను, గణములతోను, భూతములతోనూ, మాతృదేవతల తోనూ అనుగతుడై పార్వతీ సహితుడైన విశ్వేశ్వరుడు కూడా వచ్చినాడు.

సావిత్రి మొదలైన వారితో పాటూ భగవాన్ బ్రహ్మకూడా వచ్చినాడు. నిఖిల వేదశాస్త్ర మూర్తులైన మహర్షు లందరూ వచ్చినారు. లక్ష్మీ, కీర్తి, జయాదులైన దేవులతో ధృత చక్రా ధిపుడై పక్షిరాజ రథంపై హరికూడా వచ్చినాడు. భార్యలతోపాటూ కశ్యపుడు వచ్చినాడు. ఆదిత్యులు, వసువులూ వచ్చినారు. యక్ష, రాక్షస నాగేంద్రులు అట్లే ప్రహ్లాదాదులైన అసురులూ విచ్చేసినారు.

వారితో నభోభాగమంతా ఆక్రమితంకాగా శస్త్రసంపాతంతో భీషణమై మహానాద సంపూర్ణమై, ఉభయ సేనలమధ్య సంగ్రామం ప్రవర్తిల్లినది. బాణజాలమనే మబ్బులతో దిక్చక్రం కప్పువడగా అన్యోన్య శర సంఘర్షణతో కలిగిన అగ్ని తటిల్లతలు మెరసినవి. శస్త్రచ్యుతాలైన గజాశ్వ సమూహాల రక్తధారలు కురిసినవి.

వీరుల శరీరాలనుండి వెలువడిన శోణితనదులు పారు తుండగా అందులో నృత్యం చేస్తూ, ఈదుతూ, శబ్దం చేస్తూ, ఉత్సవం చేసుకొంటున్నట్లున్న, శూరులు, ఫేరులు, భూతాలమధ్య, యుద్ధం కొనసాగినది. తుముల సమరం శ్రాంతమైన తర్వాత, అసంఖ్యాక సైనికులు మరణించిన తర్వాత, స్వపర సైన్యాల మధ్య విభాగం మెల్లగా కనబడినది. ప్రతిపక్ష ప్రవీరులను సుమేరువు నుండి ఆయా నామాదులతో కీర్తింపగా క్రమంగా సూర్యప్రభాదులు విన్నారు.

పూర్వం అందరికంటే ముందు సుబాహుడనే రాజునకు, విద్యాధరరాజైన అట్టహాసునకు మధ్య పరస్పరం ద్వంద్వయుద్ధం ఆరంభమైనది. చిరకాలం యుద్ధంచేసి బాణాలతో విద్ధుడై అట్టహాసుడు అర్ధచంద్రంతో సుబాహుని తలను నరికివేసినాడు. ఆ విధంగా సుబాహుడు నిహతుడు కాగా క్రోధంతో ముష్టికుడు ముందుకు వచ్చినాడు. అతనిని కూడా గుండెకు గురిచూసి బాణం వేసి అట్టహాసుడు పడగొట్టినాడు. ముష్టికుడు నిహతుడు కాగా క్రుద్ధుడై ప్రలంబుడనే భూపతి ముందుకురికి అట్టహాసునిపై శర వర్షాన్ని కురిపించినాడు. అట్టహాసుడు కూడా ఆ సైన్యాన్ని మర్మ స్థానాలలో బాణాలువేసి చంపినాడు. ఆ వీరుడు ప్రలంబుని కూడా రథపృష్ఠంపై పడవేసినాడు.

ప్రలంబుడు నిహతుడు కావడంచూచి మోహనుడనే భూపతి ముందుకురికి అట్టహాసునిపై బాణాలను కురిపించినాడు. ఆ తర్వాత అట్టహాసుడు మోహనుని కార్ముకాన్ని తెగగొట్టి, అతని సారథిని చంపివేసి కడకు మోహనునే దృఢప్రహారాలతో పడవేసినాడు.

ఈ విధంగా చతురుడైన అట్టహాసుడు ఆ నలుపురను ఆ విధంగా నిర్మూలింపగా జయోన్ముఖమైన శ్రుతశర్మ సైన్యం హర్షంతో పొలికేకలు పెట్టినది.

అది చూచి కుపితుడైన హర్షుడు సూర్యప్రభుని మంత్రి, తన సైన్యంతోపాటూ అట్టహాసునిపై పడినాడు. అతని శరసంత తిని తనబాణాలతో ఆపివేస్తూ, అతని సైన్యాన్ని నిహతం చేస్తూ, సారథిని రెండు బాణాలతోనూ, మూడు బాణాలతో ధనుస్సును, ధ్వజాన్ని విచ్ఛిన్నం చేసినాడు. అట్టహాసుని శిరస్సును కడకు తన శరాలతో ఛేదింపగా అది రథంమీద నుంచి రక్తం కార్చుతూ దొరలి క్రింద పడినది.

ఆ విధంగా అట్టహాసుడు హతుడు కాగా, యుద్ధంలో ఒక క్షణం సంక్షోభం చెలరేగినది. ఈ విధంగా అశ్వ, గజపతులు, నిహతులు కాగా రణమూర్ధంలో కేవల కబంధులు నిలిచినారు.

ఆ తర్వాత వికృతదంష్ట్రుడనే విద్యాధరేశ్వరుడు తమ అట్టహాసుని చంపెనన్న కోపంతో హర్షునిపై బాణవర్షం కురిపించినాడు. హర్షుడు కూడా వాటిని ఎగురగొట్టి, ధ్వజాన్ని సారథిని పడగొట్టి, రథాశ్వాలను చంపి, లలితకుండలమైన శిరస్సును ఛేదించినాడు. వికృతదంష్ట్రుడు ఆ విధంగా చావగా చక్రవాలుడనే విశ్రుతుడైన రాజు హర్షునిపై కోపంతో దాడిచేసినాడు.

అట్లా యుద్ధంచేస్తూ అతని ధనుస్సును తెగగొట్టి యుద్ధంలో శ్రాంతుడైన హర్షుని, ఇంకొక ఆయుధం లేనివానిని, చక్రవాలుడు వధించినాడు. ఆ క్రోధంతో ప్రమాథనృపతి యుద్ధానికి తలపడినాడు. అతను కూడా యుద్ధంలో చక్రవాలునితో నిహతుడైనాడు.

అదే విధంగా అతనిపైకి వచ్చిన నలువురు రాజముఖ్యులు చక్రవాలుని బాణాలతో నిపాతితులైనారు. వారు కంకటుడు, విశాలుడు, ప్రచండుడు, శాంకరి, అది చూచి ఆగ్రహోదగ్రుడై నిర్ఘాతుడనే రాజు అతనితో తలపడినాడు. చక్రవాల నిర్ఘాతులు చిరకాలం యుద్ధంచేసి క్రమంగా ఒకరి రథాన్ని మరొకరు చూర్ణం చేసుకొని పాదచారులైనారు. ఖడ్గ చక్రాలను ధరించి వారిరువురూ తలపడి ఖడ్గహతితో తలలు రెండుగా చీలగా భూమిపై పడిపోయినారు.

వారలా విపన్నులు కాగా, ఇరువాగులా సేనలు నిషణ్ణం కాగా రణార్థమై విద్యాధరుడు కాలకంపనుడు, ముందుకు వచ్చి

నాడు. అలాగే ప్రకంపనుడనే పేరుగల రాజపుత్రుడు ముందు కురకగా కాలకంపనుడు అతనిని ఒకక్షణంలో నేలపై కొరుగునట్టు చేసినాడు.

ఆ విధంగా అతను పోగా, అలాగే అతని ఇతర పంచ రథాలూ పడిపోయినవి. జాలీకుడు, చండదత్తుడు, గోపికుడు, సోమిలుడు, పృథుశర్మ అనే వారందరూ అతనిపై శరవర్షాన్ని కురిపించినారు. ఆ ఐదుగురనూ కాలకంపనుడు రథహీనులనుచేసి నారాచములతో హృదయంపై పదేపదే మోది పంచత్వం పొందించి నాడు.

ఖేచరులు సంతోషించినారు. మనుజాసురులు విషాదం చెందినారు. ఆ తర్వాత మరొక నలుగురు రధికులు సమంగా ఉన్మత్తకుడు, ప్రశస్తుడు, విలంబకుడు, ధురంధరుడు అనువారు పైకిరాగా కాలకంపనుడు అవలీలగా వారందరనూ మట్టుపెట్టినాడు.

అలాగే మరొక ఆరుగురు రధికులను కూడా చంపివేసినాడు. తేజకుడూ గేయికుడు, వేగిలుడు, శాఖిలుడు, భద్రంకరుడు, దండి అనే ఆ మహారథులు భూరిసైన్యాలతో కూడినవారు.

మరొక ఐదుగురు భీమ, భీషణ, కుంభీర, వికట, విలో చనులు అనే వారిని యుద్ధంలో అతను చంపివేసినాడు. ఆ కాల కంపనుడు చేస్తున్న వీరవిహారం చూసి సుగణుడనే పేరుగల రాజపుత్రుడు ఎదుర్కొన్నాడు.

ఆ తర్వాత వారిద్దరి మధ్యా చెలరేగిన యుద్ధం సరిసమా నంగా జరిగినది. అశ్వసారథులు చనిపోయినారు. త్వరలోనే వారిరువురూ విరథులైనారు. ఆ తర్వాత ఖడ్గ యుద్ధంలో పాద

చారి అయిన సుగణుని కాలకంపనుడు తాను పాదచారిగా ఉండే చంపివేసినాడు. ఆ విధంగా మనుష్యులకు విద్యాధరులకూ మధ్య సమంగా ఆహవం జరగడం చూచి ఆ అసంభావ్యాన్ని తలచి ఖిన్నుడై సూర్యుడు అస్తమించినాడు.

సమరాంగణ మొక్కటే రక్తాంబు భరితపూరం కాలేదు. సంధ్యాకృత పదం అయినందువల్ల గగనమంతా శోణితమైనది. కబంధములతో పాటూ భూతాలు సంధ్యానృత్యం చేయడం ఆరంభించగా యుద్ధాన్ని ఉపసంహరించి ఆ బలాలు తమ శిబిరాలకు వెళ్ళిపోయినవి.

శ్రుతశర్మబలంలో ఆ రోజు ముగ్గురు వీరులు మరణించినారు. సూర్యప్రభుని బలంలో ముప్పైముగ్గురు వీరులు హతులైనారు. ఆ విధంగా బాంధవ మిత్రాది నిధనం వల్ల కలతవడిన సూర్యప్రభుడు అంతఃపుర జనవిరహితుడై, ఆ రాత్రి గడపినాడు. నిద్రలేకనే మంత్రులతో పాటూ సంగ్రామకథలను చెప్పుకుంటూ తిరిగీ యుద్ధోన్ముఖుడౌతూ ఆ రాత్రిని గడిపివేసినాడు.

## స్త్రీలలో సూర్యప్రభ చర్చ

ఆ సూర్యప్రభుని భార్యలు బంధునష్టం వల్ల దుఃఖితలై ఆ రాత్రి ఒకరినొకరు ఓదార్చుకొనుటకై ఒకచోట చేరినారు. రోదనావసరంలో ఉన్నప్పటికీ అక్కడ నానావిధాలైన కథలు నడచినవి. తన్నుగూర్చో, ఇతరులను గూర్చో ఏదో ఒక కథ చెప్పుకొనకుండా ఆ స్త్రీలకు ఒకక్షణం గడవలేదు.

ఆ ప్రసంగవశంగా అందులో ఒక రాజపుత్రి ఇట్లా అన్నది: "ఆర్యపుత్రుడు అంగనారహితుడై ఇప్పుడు పడుకొన్నాడంటే ఆశ్చర్యం కదా!" ఆ మాట విని మరొకకాంత

ఇట్లన్నది: "సంగ్రామంలో స్వజనాన్ని పోగొట్టు కొన్నందువల్ల దుఃఖితుడైన ఆర్యపుత్రుడు స్త్రీలతో ఎలా ఆనందిస్తాడు?" అప్పుడు మరొకామె ఇట్లన్నది: "ఆయనకు మరొక నూతన వరకన్య దొరికితే ఇప్పుడే ఆ దుఃఖాన్ని మరచిపోతాడు." ఇంకొకామె ఇట్లన్నది: "ఆయన స్త్రీ లంపటుడైనప్పటికీ ఈ దుఃఖ సమయంలో అలా అవుతాడని నేను భావించను."

ఇలా వారు మాట్లాడు కొంటుండగా ఆశ్చర్యచకితురాలైన మరొకామె ఇట్లా అన్నది: "ఆర్యపుత్రుడు ఈవిధంగా స్త్రీలంపటు డెందుకైనాడు? ఆ సంగతి చెప్పండి. ఎందరో భార్యలున్నప్పటికీ, కొత్త కొత్త వారు వస్తున్నప్పటికీ ప్రతిదినమూ ఒకరాజ పుత్రిని పరిగ్రహించనిది ఈయన తృప్తిపడడుగదా!"

ఈ మాటవిని వారిలో విదగ్ధురాలైన మనోవతి అనే మానిని ఇట్లన్నది: "రాజులు బహుపత్నీకులు ఎందుకౌతారో చెప్తాను వినండి. దేశాన్నిబట్టి, రూపాన్నిబట్టి, వయసునుబట్టి, చేష్టలను బట్టి, విజ్ఞానాన్నిబట్టి ఒకొకస్త్రీ ఒకొక విధంగా ఉంటుంది. ఇలా భిన్న గుణాలుగల స్త్రీలలో ఏ ఒక్క స్త్రీ కూడా సర్వగుణాన్వితురాలుగా ఉండదు. కర్ణాట, లాట, సౌరాష్ట్ర, మధ్యదేశాలలోని మగువలు తమ తమ దేశాల సమాచారాలతో రంజింపగలరు. కొందరు స్త్రీలు శరదిందునిభ ముఖాలతో ఆకర్షిస్తారు. మరికొందరు కనక కుంభనిభములైన ఉన్నత స్తనాలతో ఆకర్షిస్తారు. స్మర సింహాసన ప్రాయమైన జఘనస్థలాలతో ఇతరులు ఆకర్షిస్తారు. ఈ విధంగా ఆయా అవయవ సౌష్ఠవాలతో తమ సౌందర్యాన్ని ఇనుమడింప జేసుకొని వారు పురుషులను ఆకర్షిస్తుంటారు.

ఒక రమణి కాంచన గౌరాంగిగా ఉంటుంది. ఇంకొకతె ప్రియంగుశ్యామలగా ఉంటుంది. మరొకతె రక్తావదాత వర్ణంతో ఉంటుంది. ఇలా వీరు చూడగానే చూపులను చూరగొంటారు.

ఒకామె ముద్దరాలై సుందరంగా ఉంటుంది. ఇంకొకతె సంపూర్ణయౌవనంతో మనసును లోగొంటుంది. ఒక కాంత ప్రౌఢిమతో సరసురాలై విలాసోజ్జ్వల అవుతుంది. ఒక యువతి నవ్వుతూ అందాలు చిందుతుంది. ఇంకొకతె కోపించినా అందంగా ఉంటుంది. ఒక ఇంతి గజగమనగా రూపవతి అయితే, హంసవలె ఇంకొకతె నడుస్తూ రాణిస్తుంది.

ఒకామె మాటలతో చెవులలో అమృతాన్ని నింపుతుంది. ఇంకొకామె కనుబొమలు విలాసంగా కదుపుతూ సహజసిద్ధంగానే భాసిస్తుంది.

ఒక లలన నృత్యంతో రుచిస్తుంది. ఇంకొకామె పాటతో శోభిల్లుతుంది. ఇకొంక కమలేక్షణ వీణాది వాదన జ్ఞానంతో లావణ్యం చిందుతుంది.

ఒకతె బాహ్యరతాభిజ్ఞురాలు. మరొకతె అభ్యంతరప్రియ. ఇంకొకతె అలంకరించు కొనుటలో ఘటికురాలు. ఇంకొక పడతి వైదగ్ధ్యంలో మిన్న. మరొక మానిని మగని మనసు నెరిగి సౌభాగ్యాన్ని పొందుతుంది.

ఇట్లా ఎన్నని చెప్పను! ఒకొకరికి ఒకగుణ ముంటుంది. ఆ యా భిన్న గుణాలతో వారు మగవారి మనసులను లాగివేస్తుంటారు. ఈ విధంగా ఒకొక్క విలాసిని గుణం ఒకటొకటిగా ఉంటుంది. అందరు స్త్రీలకూ అన్ని గుణాలూ ఉండడం ముల్లోకాలలో ఎక్కడా కన్పించదు.

ఇక ప్రభువులు నానారసాస్వాదరసజ్ఞులు. అందువల్లనే ఎందరిని పరిగ్రహించినా ఇంకా నవ నవ వధువులను వారు స్వీక

రిస్తుంటారు. ఉత్తములు పరభార్యల నెప్పుడూ ఆకాంక్షించరు. కాబట్టి ఆర్యపుత్రునకు ఇదొక దోషం కాదు. ఇందులో ఈసు చెందవలసిన పనిలేదు. మన మిందులో క్షమ చూపవలసినదే."

ఈ విధంగా మనోవతి సూర్యప్రభాంగనలకు తెలియ జెప్పగా, అలాగే ఇతర మదనసేనాద్యంగనలు అలాంటి కథలనే చెప్పుకొన్నారు. ఆ విధంగా రసపరవశలై ఏ నియమ నిబంధనలూ లేక స్వేచ్ఛగా ఆ స్త్రీలంతా పరస్పరం సురతకార్య తంత్రాలను కూడా ఒకరి కొకరు ఉపదేశించుకొన్నారు. ప్రసంగవశాత్తూ ఒక చోట చేరిన వారు కథారసాసక్త చిత్తలై పరస్పరం ఏవేవో మాట లాడు కొన్నారు, అలాంటి సమయంలో బయటికి చెప్పుకొన గూడని దంటూ వారి కేదీ వుండదు. ఆ విధంగా ఆ కథలతో, ఆ మాటలసందడిలో, ఆ దీర్ఘరాత్రి క్రమక్రమంగా గడచి పోయినది.

అలాగే ఎప్పుడు తెల్లవారుతుందా, ఎప్పుడెప్పుడు శత్రు బలంపై విరుచుకపడి జయింతామా అనే ఏకైక కాంక్షతో ఉన్న సూర్యప్రభునకు కూడా అలాగే ఆ రాత్రి తెల్లవారినది.

ఇది మహాకవి శ్రీ సోమదేవభట్ట విరచితమైన
కథాసరిత్సాగరంలో సూర్యప్రభలంబకంలో
చతుర్థ తరంగం.

# పంచమ తరంగం

## సూర్యప్రభ – విద్యాధరుల – యుద్ధం

సూర్యప్రభాదులు ఉదయమే యుద్ధ భూమిని చేరుకొన్నారు. శ్రుతశర్మాదులు కూడా తమ బలాలతో పాటు తిరిగీ సన్నద్ధులైనారు. తిరిగీ ఇంద్రాదులు బ్రహ్మ విష్ణు యుతులై. సురాసురులు. యక్ష భుజగ గంధర్వులు సంగ్రామాన్ని చూడడానికి వచ్చినారు.

దామోదరుడు శ్రుతశర్మ సేనావారాన్ని చక్రవ్యూహంగా నిర్మించినాడు. మరి సూర్యప్రభుని బలాన్ని ప్రభాసుడు వజ్ర వ్యూహంగా ఏర్పరచినాడు. ఆ వెంటనే ఆ రెండు సేనల మధ్య యుద్ధం ప్రారంభమైనది. తూర్యాలతోను. సుభటనాదాలతోనూ దిక్కులు పిక్కటిల్లినవి. త్వరలోనే శస్త్రహతులైన శూరులు తన మండలాన్ని భేదింపగలరన్న భయంతో సూర్యుడు శరజాలం లోపల దాగుకున్నట్టు కన్పించినాడు. దామోదర కృతమైన చక్ర వ్యూహం ఇతరులకు దుర్భేద్యమైనది. అయినప్పటికీ సూర్యప్రభుని ఆజ్ఞతో ప్రభాసుడు భేదించి లోన ప్రవేశించినాడు.

అదిచూచి దామోదరుడు ఆ వ్యూహం ఛిన్నమైన చోటికి స్వయంగా వచ్చి అడ్డునిలిచినాడు. ప్రభాసుడు ఏకరథుడయ్యే అతనితో యుద్ధంచేసినాడు. ఒంటరిగా లోన ప్రవేశించిన అతనిని చూచి సూర్యప్రభుడు అతని వెనుకనే యాభైమంది మహారథులను పంపినాడు.

ప్రకంపనుని, ధూమకేతుని, కాలకంపనుని, మహామాయుని మరుద్వేగుని, ప్రహస్తుని, వజ్రపంజరుని, కాలచక్రుని, ప్రమథ నుని, సింహనాదుని, కంబలుని, వికటాక్షుని, ప్రవహణుని, కుంజర కుమారకుని పంపించినాడు.

ప్రహృష్టరోమాంచితుడైన అసురాధిపతిని గాంచి వారందరూ ఎత్తి వెళ్ళినారు. వ్యూహద్వారం వద్దకు ఆ మహారథులందరూ చేరినారు. అక్కడ దామోదరుడు పూర్వమే తన పౌరుషాన్ని కనబరచినాడు. ఏకాకిగానే యాభై మందితో ఎదిరించి పోరాడి నాడు.

అది చూచి ప్రక్కనున్న నారదమునితో వాసవుడిట్లా అన్నాడు: "సూర్యప్రభాదులు అసురావతారులు. శ్రుతశర్మ నా అంశంలో పుట్టినవాడు. వీరందరూ విద్యాధరులు. దేవాంశ సంభూతులు. ఇది ఒక విధంగా దేవాసురయుద్ధంవంటిది. ఆ యుద్ధాలలో దేవతలకు సహాయంగా సర్వదా హరి నిలిచేవాడు. దామోదరుడు ఆయన అంశ సంభూతుడే. ఇక్కడ యుద్ధం చేస్తున్నాడు."

ఈ విధంగా ఇంద్రుడు చెప్తుండగానే దామోదర సేనాపతి సహాయార్థమై పదునలుగురు మహారథులు వచ్చినారు. బ్రహ్మ గుప్తుడు, వాయుబలుడు, యమదంష్ట్రుడు, సురోషణుడు, రోషావ రోహుడు, అతిబలుడు, తేజఃప్రభుడు, ధురంధరుడు, కుబేర దత్తుడు, వరుణశర్మ, కంబలికుడు, వీరుడు, దుష్టదమనుడు, దోహనుడు, ఆరోహణుడు, వీరందరూ దామోదరునితో కలిసి సూర్యప్రభునకు చెందిన వీరులను, వ్యూహాగ్రయోధులను అడ్డు కొన్నారు.

ఆ తర్వాత అక్కడ పరస్పరం వారి మధ్య ద్వంద్వ యుద్ధాలు కొనసాగినవి. దామోదరునితో సమ ఉజ్జీగా ప్రకంపనుడు అస్త్రయుద్ధం చేసినాడు. బ్రహ్మదత్తునితో ధూమకేతువు తలపడినాడు. మహామాయుడు అతిబలుని ఎదుర్కొన్నాడు. తేజఃప్రభునితో కాలకంపనుడు అనే దానవుడు పోరుసల్పినాడు. వాయుబలునితో మరుద్వేగమహాసురుడు మార్కొన్నాడు. యమదంష్ట్రునితో వజ్రపంజరుడు పోరాటంసల్పినాడు. సురోషణునితో కాలచక్రుడు కలబడ్డాడు. కుబేరదత్తుని ప్రమథనుడు ఎదుర్కొన్నాడు. సింహనాదుడనే దైత్యేంద్రుడు వరుణశర్మతో పోరినాడు. ప్రవహ్లాదుడు దుష్టదమనునితో సంగ్రామ పరుడైనాడు. ప్రహృష్టరోముడు రోషావరోహణునితో, ధురంధరునితో వికటాక్షుడు పోరాడినారు. కంబలునితో కంబలికుడు ఎదురొడ్డి నిలిచినాడు. ఆరోహణునితో కుంజరకుమారకుడు, మహోత్పాతుడనే మారుపేరు గల దోహనునితో ప్రహస్తుడు సమరంలో దూకినారు.

ఈ విధంగా ఈ మహారథయుగళం పరస్పరం వ్యూహాగ్రంలో యుద్ధం చేస్తుండగా సునీథుడు మయునితో ఇట్లన్నాడు: "మన రథికులు శూరులు, నానాయుద్ధనిధులైనప్పటికీ మనప్రతిరథులు వారిని వ్యూహప్రవేశం చేయకుండా అడ్డగిస్తున్నారు చూశారా? ప్రభాసుడొక్కడే మొదట లోనికి ప్రవేశించడం అవిచారిత మనుకుంటాను. ఇప్పుడిక్కడ ఎవరికి ఏం జరుగుతుందో తెలియడం లేదు."

ఈ మాటవిని సువాస కుమారకుడు ఇట్లా అన్నాడు: "ముల్లోకాలలో సురాసుర మానుషులెవ్వరూ ఏకాకి అయిన ప్రభాసునికి సమానులు కారు. ఇక ఈ విద్యాధరుల మాటేమిటి?

అస్థానంలో అనుమానమెందుకు? నీకు తెలుసుగదా!" అని ఆ ముని కుమారుడు అంటుండగా కాలకంపనుడనే విద్యాధరుడు యుద్ధంలో ప్రభాసుని సమ్ముఖానికి వచ్చినాడు.

అప్పుడు ప్రభాసుడిట్లన్నాడు: "ఓరీ! నీవు మాకు చాలా అపకారం చేసినావు. ఇప్పుడే నీ పౌరుషమేదో చూస్తాను—" అని చెప్పి ప్రభాసుడు విశిఖావళిని వానిపై కురిపించినాడు. అతను కూడా శతాధిక సాయకాలను గుప్పించినాడు. వా రా విధంగా అస్త్రప్రత్యస్త్రయుద్ధంలో మునిగి ఉండగా ఆ విద్యాధర మాను షులు జగత్తునకే ఆశ్చర్యాన్ని కల్పించినారు.

ఆ తర్వాత ప్రభాసుడు ఒక బాణంతో ధ్వజాన్ని పడగొట్టి నాడు. రెండవబాణంతో కాలకంపనుని సారథిని చంపివేసినాడు. మరొక నాలుగు బాణాలతో నాలుగు అశ్వాలను, ఒక బాణంతో ధనుస్సును ఛేదించినాడు. సాయకద్వయంతో హస్తాలను, భుజా లను, మరి రెండింటితో శ్రవణద్వయాన్ని, ఇంకొక నిశితశరంతో వాని శిరస్సును ఛేదించినాడు. ప్రభాసుడు ఈ విధంగా బాణా లతో శత్రువును మించి అద్భుతలాఘవం చూపించినాడు.

ఈ విధంగా తొలినుంచీ అనేక వీరులను చంపడం వల్ల కల్గిన కోపంతో కాలకంపనుని ఆట కట్టించినాడు. మనుజులు అసు రులు చేరి ఆ విద్యాధరేశ్వరుని చంపడం చూచి మనుజాసురులు మహానాదం చేసినారు. ఖేచరులు వెంటనే విషాదపూరితులైనారు.

ఆ తర్వాత విద్యుత్ప్రభుడనే కాలంజర గిరీశ్వరుడు ప్రభా సుని వేపు కోపంతో పరువెత్తి వెళ్ళినాడు. అతను కూడా యుద్ధం చేయగా ప్రభాసుడు మహాధ్వజాన్ని ఛేదించి వరుసగా కోదం డాలను చెక్కివేయసాగినాడు. అప్పుడు మాయతో గగనానికెగసి

విద్యుత్ప్రభుడు అదృశ్యుడై ప్రభాసునిపై ఖడ్గగదాదికాలను కురిపించ సాగినాడు. ప్రభాసుడు కూడా అస్త్రాలతో ఆ ఆయుధ పరంపరను అడ్డగించి ప్రకాశనాస్త్రం వేసి ఆ ఖేచరుని బయల్పరచి నాడు. ఆగ్నేయ మహాస్త్రాన్ని అనుసంధానం చేసి వదలి ఆకసం నుంచి అతనిని దాని తేజస్సుతో దగ్ధం చేసి విద్యుత్ప్రభుని గత జీవుడై భూతలంపై పడునట్టు చేసినాడు.

ఇదంతా చూచి శ్రుతశర్మ మహారథులతో ఇట్లన్నాడు: "చూచారా! వీడు మహారథ సేనానులిద్దరిని సంహరించినాడు. మీరింకా సహిస్తున్నారెందుకు? ఇతనిని చంపండి."

ఆ మాటవిని ఆ ఎనమండుగురు రథికులు క్రుద్ధులై ప్రభాసుని చుట్టుముట్టినారు. కంకటక గిరీంద్రనివాసి అయిన ఒక రథయూథనాథుడు ఊర్ధ్వరోముడను ప్రఖ్యాతి చెందిన విద్యాధర మహీపతి. ధరణీధర శైలాధిపతి అయిన విక్రోశనుడనే పేరుగల విద్యాధరాధిపతి రెండవ మహారథుడు. లీలా పర్వత కేతనుడైన ఇందుమాలి అనే మూడవవాడు. మలయాద్రి నివాసి కాకండకుడను వాడు. నాల్గవ విద్యాధర రథయూథపతి. అలాగే నికేతాధిపతి అను పేరుగల అయిదవ దర్పవాహుడు. అంజన గిరీశ్వరుడైన ధూర్తవహనుడు ఆరవ రథయూథాధిపతి. విద్యాధరులైన అతి రథయూథపతు లిద్దరు ఏడవ గర్దభరథుడు అనుపేరుగల కుముద పర్వతాధిపతి. వరాహస్వామి అనే పేరుగల మరొక మహా యూథాధిపతి. అలాగే మేఘావరుడనే దుందుభి పర్వతాధిపతి. ఈ ఎనమండుగురు వచ్చి బాణాలను అతనిపై వదలినారు.

ప్రభాసుడు ఏకకాలంలో వారందరినీ అమ్ములపాలు చేసి నాడు. కొందరి అశ్వాలను పడగొట్టినాడు. మరొకరి సారథిని చంపినాడు. మరొకని కేతనాన్ని ఉత్తరించివేసినాడు. ఇంకొకని ధనుస్సును విరిచివేసినాడు. మేఘావరుని నాల్గు బాణాలతో వక్షః స్థలంపై కొట్టి వెంటనే ప్రాణాలువదలి నేలపై దొరలునట్టు చేసినాడు.

ఆ తర్వాత ఇతరులతో యుద్ధం చేస్తూ సమీపం నుంచే ఆంజలిక బాణంతో ఊర్ధ్వరోముని శిరస్సును ఛేదించివేసినాడు. మిగిలిన ఆర్గురనూ ఒక్కొక్క భల్లంతో ఒకొక్కరి తలను వేరు చేసివేసినాడు. వారి అశ్వసారథులను చంపి వేసినాడు.

ఆకసం నుంచి అప్పుడతని తలపై పూలవాన కురిసినది. అసురరాజులందరూ ఉత్తేజితులైనారు. ఖేచరులు వెలవెల పోయి నారు.

ఆ తర్వాత శ్రుతవర్మ పంపిన నలుగురు మహారథులు ధనుర్ధరులై ప్రభాసుని అడ్డగించినారు. ఒకడు కాచరకుడు అనే పేరుగల కురండక గిరిపతి. రెండవవాడు డిండిమాలి అనే పంచ కాద్రిస్థితుడు. విభావసుడు మూడవవాడు. జయపురాచలానికి అధిపతి. ధవళుడనే నాల్గవవాడు భూమితుండక పాలకుడు. ఆ మహారథ యూథాధిపతులందరూ ఖేచరోత్తములు. వారందరూ చెరి అయిదు వందల బాణాలను ప్రభాసునిపై వదలినారు. ప్రభా సుడు కూడా క్రమంగా వారొక్కొక్కరిని అవలీలగా బాణాలను వదులుతూ ఒక దానితో ధ్వజాన్ని, ఒక దానితో ధనుస్సును, ఒక దానితో సారథిని పడగొట్టినాడు. అలాగే నాలుగు గుఱ్ఱాలను నాలుగు బాణాలతో ఛేదించివేసినాడు. ఒకొక్క బాణంతో ఒక్కొ క్కరి తలను ఎగురగొట్టినాడు. ఎనిమిదెనిమిది బాణాలతో ఒకొ క్కని ముగించి సింహనాదం చేసినాడు.

ఆ పిమ్మట శ్రుతశర్మాజ్ఞతో యుద్ధంలో విద్యాధరులు మరొక నలుగురు ప్రభాసుని మీదికి వచ్చినారు. అందులో ఒకడు కువలయశ్యాముడు. విశ్వావసునికి జన్మించినవాడు. అతని పేరు భద్రంకరుడు.

రెండవవాడు నియంత్రకుడు. వీడేమో జన్మక క్షేత్రంలో కుజునికి పుట్టినవాడు. అగ్నినిభ సంకాశుడు: మూడవవాడు కాలకోపాఖ్యుడు. దామోదర క్షేత్రంలో శనైశ్చరునితో కల్గినవాడు. నల్లనివాడు కపిలకేశుడు.

చంద్రక్షేత్రంలో బృహస్పతివల్ల కలిగినవాడు విక్రమశక్తి అను పేరు గలవాడు. ఇతడు బంగారువన్నె కలవాడు. వీరు అతిరథ యూథాధి పతులలో యూథపులు.

నాల్గవవాడు మహావీరుడు. అధిక విక్రమ సంపన్నుడు. వారందరూ దివ్యాస్త్రాలతో ఉద్ధతులై ప్రభాసునితో యుద్ధం చేసినారు. ప్రభాసుడు నారాయణాస్త్రంతో వారి బాణాల నన్నిటినీ అడ్డుకొన్నాడు. వారి ఒక్కొక్కరి ధనువును ఎనిమిది ముక్కలుగా అవలీలగా తుంచివేసినాడు.

ఆ తర్వాత వారు వేసిన ప్రాస, గదాదులను అడ్డుకొట్టి హతాశ్వసారథులనుగా చేసి వారందరినీ విరథులను చేసివేసినాడు. అది చూచి శ్రుతశర్మ మరొక పదిమంది రథయూథాధి పతులైన విద్యాధరాధిపతులను పంపించినాడు.

వారు దముడు, నియముడు, ఒకే రూపం కలవారు. వారు కేతమాలేశ్వర క్షేత్రంలో అశ్వినీ కుమారులవల్ల కలిగినవారు. విక్రముడు, సంక్రముడు, పరాక్రముడు, సమ్మర్దనుడు, మర్దనుడు

ప్రమర్దనుడు, విమర్దనుడు వీరంతా మకరందక్షేత్రంలో అష్ట వసువుల వల్ల కలిగినవారు. వీరంతావచ్చి వేరే రథాలనెక్కి యుద్ధానికి దిగగా ఆ పదునల్గురూ కలిసి బాణవర్షం కురిపింపగా నిష్కంపుడై ప్రభాసుడు ఏకైకంగానే యుద్ధం చేసినాడు.

ఆ తర్వాత సూర్యప్రభాదేశంవల్ల వ్యూహాగ్రం నుండి సంగరాన్ని వదిలివేసిన కుంజర కుమారుడు, ప్రహస్తుడు ఆయుధాలను ధరించి పైకెగిరి ఆకసం నుంచి ధవళశ్యామలాకృతులైన వారు అపరరామకృష్ణుల వలె అతని పార్శ్వాన్ని చేరుకొన్నారు. ఆ పదాతులు రథస్థులైన దమ, నియముల ధనుస్సులను విరుగగొట్టి సారథులను చంపివేసి వ్యాకుల పరచినారు. భయం వల్ల పైకెగసిన వారిని కుంజరకుమారుడు, ప్రహస్తుడు ధృతాయుధులై ఎదుర్కొన్నారు. అది చూచి అతిత్వరగా సూర్యప్రభుడు నిజ మంత్రులను మహాబుద్ధి, అచలబుద్ధి అనువారిని సారథులుగా పంపినాడు.

అంతట ప్రహస్తుడు మాయతో అదృశ్యులుగా ఉన్నవారిని చూచి సిద్ధాంజన ప్రయోగంతో, కుంజరకుమారకుడు బాణౌఘములతో కొట్టగా వారు పలాయనం చిత్తగించినారు.

ప్రభాసుడు మిగిలిన పన్నెండుగురతో యుద్ధంచేస్తూ వారి కోదండాలను ఖండించివేసినాడు. ప్రహస్తుడు వచ్చి వారందరి సారథులనూ సమంగా చంపివేసినాడు. ఆ తర్వాత రథహీనులై ఆ పన్నెండుగురు ఈ ముగ్గురు వీరులతో దెబ్బలు తింటూ సమరాంగణం నుంచి పారిపోయినారు.

ఆ తర్వాత దుఃఖక్రోధ లజ్జాకులుడై శ్రుతశర్మ మరొక ఇద్దరు అతిరథ రథయూథపులను పంపినాడు. వారిలో ఒకడు

చంద్రకులాద్రి ఇంద్రపతి క్షేత్రంలో నిశాకరునివల్ల జన్మించిన వాడు. వానిపేరు చంద్రగుప్తుడు. అపరచంద్రునివలె ప్రకాశించు వాడు. ధురంధరాచల ప్రభుక్షేత్రంలో పుట్టి మహాద్వితీయవంతు డైన ఇంకొక నిజమంత్రి నగరంగమనాముడు. వారిద్దరూ బాణా లను ఎంత వదులుతున్నా విరథీకృతులై ఆ ప్రభాసాదులైన ముష్వరితో యుద్ధంలో వినష్టులైనారు.

ఆ పిదప మనుజేశ్వరులు, అసురేశ్వరులూ నినాదాలు చేస్తుండగా నలుగురు మహారథులతో కలిసి శ్రుతశర్మ స్వయంగా యుద్ధానికి వచ్చినాడు. మహౌఘుడు, ఆరోహణుడు, ఉత్ప్రాతుడు వేత్రవంతుడు అను పేర్లుగలవారు నలువురూ త్వష్ట, భగ, అర్యమ, పూష అను వారల ఆత్మజులు. ఆ నలువురూ చిత్రపాదాది విద్యా ధర మహీభుజుల, మలయాద్ర్యధినాథుల క్షేత్రజులు. రాజ్యవిక్ర ములు.

వారు నలువురతో పాటూ తాను ఐదవవాడై అతి క్రోధాం ధుడై ప్రభాసాది వీరులు ముష్వరతో శ్రుతశర్మ కలియబడినాడు. అప్పుడు వారందరూ వదలిన బాణజాలంతో ఆకసం ఆచ్ఛాదితమై రణలక్ష్మికి ఎండ తగులకుండా చాందినీ కట్టినట్టు కన్పించినది. మిగతా విద్యాధరులు కూడా యుద్ధానికి వచ్చినప్పటికీ విరథీ భూతులై సమరంలో నష్టులైనారు.

ఆ తర్వాత శ్రుతశర్మాదు లందరూ కలిసి యుద్ధంలో అనేకులు రావడం చూచి సూర్యప్రభుడు ప్రభాసాదులకు బలంగా తన వారిని మరి కొందరిని పంపించినాడు. ప్రజ్ఞాఢ్యప్రభృతులైన స్నేహితులను, వీరసేన శతానీక ముఖ్యులను, రాజసుతులను

ఆయన పంపినాడు. వీరందరూ గగనంపై కెగురగా సూర్య ప్రభుడు వ్యోమ మార్గంలో వెళ్ళి భూతాసన విమానంపై నుంచి క్రిందనున్న రథాలను నుగ్గునూచం చేసినాడు.

తర్వాత అందరూ రథారూఢులై ధనుర్ధారులై మిగిలిన విద్యాధరేంద్రులు యుద్ధానికి వచ్చినారు. అప్పుడు ఆ విద్యాధర రాజులకు ప్రభాసాదులతో మహాసంగ్రామం నడిచినది. మహా సైన్య క్షయకారణమైనది. అక్కడ ద్వంద్వ యుద్ధంలో అన్యోన్యం ఇరువాగుల వారూ పోరాడు తుండగా మానుష. దానవ. ఖేచరమహారథు లెందరో నిహతులైనారు.

తన అనుచరులతో పాటూ. ధూమ్రలోచనుని వీరసేనుడు చంపినాడు. వీరసేనుడు కూడా విరథీభూతుడై హరిశర్మతో హతుడైనాడు. విద్యాధరవీరుడు హిరణ్యాక్షుడు అభిమన్యుతో. అభిమన్యుడు సునేత్రునితో హతులైనారు. అలాగే హరి భటుడూ మృతుడైనాడు. సునేత్రుని శిరస్సును ప్రభాసుడు ఛేదించి భూపతితం చేసినాడు.

జ్వాలామాలి. మహాయువు పరస్పరం ఒకరి నొకరు చంపుకున్నారు. కుంభీరకుడు. నీరసకుడు తమ దంతాలతో కూడా యుద్ధం చేసి మరణించినారు. భుజచ్ఛేదం వల్ల సుశర్మ. ఉపవిక్రముడు మడిసినారు.

అలాగే శత్రుభట. వ్యాఘ్రభట. సింహభటులు ప్రవహణుడనే విద్యాధర రాజుతో నిహతులైనారు. వాడు సురోహ విరోహులతో హతుడైనాడు. వారిరువురూ శ్మశానవాసి అయిన సింహబలునికి బలి అయినారు.

ఆ ప్రేతవాహనుడైన సింహబలుడు, కపిలకుడు కూడా చిత్రా పీడుడు, జగజ్వరుడనే కాంతాపతి, శూరుడు, సువర్ణుడు, మహాబలుడు కామ ధన క్రోధ పతులనే విద్యాధరేశ్వరు లిద్దరు తర్వాత బలదేవుడనే రాజు, విచిత్రా పీడుడు రాజపుత్రుడైన శతానీకునితో ఈ పదుగురు నిపాతితులైనారు.

ఈ విధంగా వీరులు హతులు కాగా విద్యాధర క్షయాన్ని చూచి శ్రుతశర్మ శతానీకునిపైకి తానే స్వయంగా ఎత్తి వెళ్ళినాడు. వారిద్దరి మధ్యా సాయంకాలం వరకు విపరీత సైన్యక్షయకరమై, దేవతలకు కూడా అచ్చెరువు గొలిపే యుద్ధం నడచినది.

సంధ్యాకాల నృత్యోత్సవ సమయం కాగా వందలాది కబంధాలు భూతాలకు ఆలంబమైనవి. చీకటి పడగా బహుసైన్య వినాశం వల్ల ఉద్విగ్నులై విద్యాధరులు బాంధవహననం వల్ల దుఃఖితులు కాగా మానవులు, అసురులు బలాత్కారంగా జయాన్ని సంపాదించుకొని వెళ్ళిపోయినారు. ఈ విధంగా ఉభయులూ యుద్ధం చాలించి స్వగృహాలకు వెళ్ళినారు.

ఆ సమయంలో సుమేరు నివేదితులైన ఇద్దరు విద్యాధర రథయూథాధిపతులు శ్రుతశర్మ పక్షాన్ని వదలివేసి, సూర్యప్రభుని వద్దకు వచ్చి నమస్కరించి ఇట్లా అన్నారు: "మాలో మహాయానుడొకడు, సుమాయుడొకడు, మూడవవాడు సింహబలుడు. మహాశ్మశానాధిపతిత్వాన్ని సిద్ధింప జేసుకొన్నవాడు, ఇతర విద్యాధరులకు లొంగనివారు.

శ్మశానాంతంలో సుఖంగా ఉన్న మా దగ్గరకు ఒకానొకప్పుడు సదాప్రసన్నురాలు, సద్యోగిని దివ్య మహాప్రభావ అయిన

శరభానన వచ్చినది. "నీ వెక్కడ ఉంటావు? అక్కడ నీ కేమి అపూర్వమైన విషయం కన్పించినది?" అని మేము నమస్కరించి ఆమెను ప్రశ్నింపగా ఈ వృత్తాంతాన్ని చెప్పినది.

యోగిని కథ:

"నేను ఇతర యోగినులతో పాటూ మహాకాళ దేవుని దర్శనార్థమై వెళ్ళిఉంటిని. అప్పుడు మా సమ్ముఖంలోనే భేతాళపతి అక్కడికి వచ్చి మహేశ్వరుడికి ఇట్లా విన్నవించుకొన్నాడు: "మా మహాసైన్యాధిపతిని విద్యాధరేశ్వరులు వధించినారు. ఆయన పేరు అగ్నికుడు. మహా రూపవతి అయిన ఆయన తనూజను తేజఃప్రభుడు హరించుకొని పోతున్నాడు.

ఆమె విద్యాధర చక్రవర్తిపత్ని కాగలదని సిద్ధులు ముందే మాకు చెప్పిఉన్నారు. కాబట్టి ఆమెను బలాత్కారంగా దూరం కొనిపోక ముందే విడిపించి మమ్ములను అనుగ్రహింప వలసినది"

అని ఈవిధంగా ఆర్తుడైన భేతాళుని వచనం విని — "మీరు వెళ్ళి ఆమెను విడిపించవలసినదని మహాదేవుడు మమ్ములను ఆజ్ఞాపించినాడు. మేము గగనగమనంతో వెళ్ళి ఆమెను చేరుకొన్నాము. చక్రవర్తి శ్రుతశర్మ కోసమై ఈమెను కొనిపోతున్నామని వారు చెప్పగా తేజఃప్రభుని, ఆత్మశక్తి చేత స్తంభింపజేసి ఆ కన్యను కొనివచ్చి దేవదేవునకు మేము సమర్పించినాము. ఆయన ఆమెను వారి స్వజనానికి అప్పగించినాడు. ఈ అపూర్వ దృశ్యాన్ని నేను స్వయంగా చూచినాను. అందువల్లనే అక్కడ కొన్ని దినాలు నివసించి ఆ దేవునికి ప్రణమిల్లి ఇక్కడికి వచ్చినాను."

ఈ విధంగా మాతో చెప్పిన ఆ యోగిని శరభాననను మేము తిరిగి ఇట్లా ప్రశ్నించినాము: "అమ్మా! నీవు సర్వజ్ఞురాలవు. కానున్న విద్యాధర చక్రవర్తి ఎవరు?" "సూర్యప్రభుడు కానున్నాడు" అని ఆమె చెప్పగా సింహబలు డిట్లన్నాడు: "ఇది సత్యంకాదు. దేవతలు ఇంద్రసహితులై శ్రుతశర్మ పక్షంలో గట్టిగా నిలబడి ఉన్నారు."

ఈ మాట విని ఆమె అన్నది కదా: "నా మాట మీద నమ్మకం లేకపోతే చెప్తాను వినండి. త్వరలోనే సూర్యప్రభునకు శ్రుతశర్మకూ మధ్య యుద్ధం జరుగగలదు. సింహబలుడెప్పుడైతే యుద్ధంలో హతుడౌతాడో ఆ అభిజ్ఞానాన్ని బట్టి ఈనా మాట సత్యమని విశ్వసించండి." ఇంతవరకుచెప్పి ఆ యోగిని వెళ్ళిపోయినది. ఆ రోజులూ గడచిపోయినవి.

ఇప్పుడు మనం ప్రత్యక్షంగానే చూస్తున్నాం. మానవునితో సింహబలుడు హతుడైనాడు. ఆ అభిజ్ఞానం వల్ల ఈమె చెప్పినది నిజమేనని నమ్మి మీరే సర్వఖేచర చక్రవర్తి కాగలరని మేమిలా మీ పాద సరోజ యుగ్మాన్ని సమాశ్రయిస్తున్నాము. తమ ఆజ్ఞను శిరసా వహిస్తాము."

ఇట్లా వారిద్దరు (మహాయాన, సుమాయకులు) ఖేచరేంద్రులు చెప్పగా, మయాదియుతుడై విని సూర్యప్రభుడు సంతోషించి వారిని యథార్హంగా సమ్మానించినాడు.

ఆ మాట విని అక్కడ శ్రుతశర్మ అధికాధికంగా ఉద్విగ్నుడైనాడు. అతనిని బహుధా ఓదార్చడానికి దేవేంద్రుడు విశ్వావసుని పంపించినాడు. "గుండె దిటవు చేసుకొమ్ము. సర్వదేవ

సహితంగా నీకు రేపటి ఉదయం రణాగ్రంలో సహాయపడతాను" అని అతనికి ధైర్యం కల్గించే అనురాగపూర్వకమైన సందేశాన్ని విశ్వావసుడు వినిపించినాడు.

పరబల భేదనంతో కలిగిన సంతోషంతో. సమరాగ్రంలో శత్రుక్షయాన్ని కూడా చూచిన సూర్యప్రభుడు తిరిగీ తన భార్యలను వేరుగా ఉంచి, ఆ రాత్రి సచివ సమేతుడై తనవాస గృహాన్ని ప్రవేశించినాడు.

ఇది మహాకవి శ్రీ సోమదేవభట్ట విరచితమైన
కథాసరిత్సాగరంలో సూర్యప్రభలంబకంలో
పంచమ తరంగం.

# షష్ఠ తరంగం

ఆ రాత్రి తన భార్యలను వదలి వేరుగానే శయనస్థుడై రణోన్ముఖుడైన సూర్యప్రభుడు తన మంత్రి వీతభీతితో ఇట్లా అన్నాడు :

"నాకు నిద్ర రావడం లేదు. సత్త్వవంతుడైన వీరునికి సంబంధించిన అపూర్వమైన కథను దేనినైనా చెప్పు. అది ఈ రాత్రి వినోదం కల్పించేదిగా ఉండాలి.''

ఈ సూర్యప్రభుని మాట విని వీతభీతి 'తమఆజ్ఞ' అని ఈ క్రింది కథను చెప్పసాగినాడు.

## గుణశర్మ కథ

''భూలోకానికి అలంకార ప్రాయమైన ఉజ్జయినీ పట్టణం కలదు. అశేష రత్నరాసులతో నిండి వినిర్మల గుణ సంయుత మైన నగరంలో మహాసేనుడనే పేరుగల రాజున్నాడు. అతను గుణప్రియుడు; కళానిలయుడు. సూర్యచంద్రులిద్దరి రూపాన్నీ ధరించినవాడు. ఆయనకు ప్రాణ సమానురాలైన అశోకవతి అనే రాణి కలదు. ఆమెతో సమానమైన రూపవతి జగత్త్రయంలోలేదు. ఆ దేవితో కలిసి ఆ రాజ్యాన్ని ఆ రాజు పరిపాలిస్తున్నాడు. అతని వద్ద గుణశర్మ అనే బ్రాహ్మడు-మాన్యుడు, ప్రియుడు ఉన్నాడు. ఆయన శూరుడు; అతిరూపవంతుడు: వేదవిద్యా విశారదుడు;

యువకుడు; సకలకళాశాస్త్రాలలో పండితుడు; అస్త్రవిద్యలో పారంగతుడు. ఆ విప్రుడు సర్వదా ఆ రాజును సేవిస్తూ వస్తున్నాడు.

ఒకసారి అంతఃపురంలో నృత్త కథా ప్రస్తావం జరుగుతుండగా ఆ రాజు, ఆ రాణి తమ ప్రక్కనే ఉన్న గుణశర్మతో ఇట్లన్నారు: "నీవు సర్వజ్ఞుడవు. అందులో సందేహం లేదు. అయితే మాకొక కుతూహలం ఉన్నది. మీకు నృత్యం చేయడం వచ్చునా? వస్తే దానిని ప్రదర్శించి మమ్ములను అనుగ్రహించండి."

ఈ మాటవిని హసన్ముఖుడై గుణశర్మ ఇట్లన్నాడు: "నాకు నృత్యం వచ్చిన మాట నిజమే. కానీ సభలో ప్రదర్శించడానికది యుక్తమైనదికాదు. హాసనం, మూఢనృత్తం తరచూ శాస్త్రగర్హితాలైనవి. అందులోనూ రాజుముందు, రాణిముందూ ప్రదర్శించడం ఛీ....ఛీ.... సిగ్గుచేటు."

ఈ మాట అనగా, రాణి కుతూహలం కొద్దీ ప్రేరేపించగా రాజు తిరిగి ఇట్లన్నాడు: "రంగాదులలో నృత్యం చేయడమంటే పురుషులు సిగ్గుపడవచ్చును. ఇది మిత్రగోష్ఠిలో ఏకాంతంగా జరుగుతున్న నృత్యం. ఇందులో నైపుణ్యప్రదర్శనమే ప్రధానం. నేను నీకు రాజును కాదు, నీవు నాకు మిత్రుడవు. నీవు స్వతంత్రుడవు. నీ నృత్య కౌశలాన్ని చూడనిది నేను భోజనం చెయ్యను-'' అని రాజు పట్టుబట్టగా ఆ విప్రు డందుకు అంగీకరించినాడు. భృత్యులుగా నున్నవారు రాజంత పట్టుబట్టగా ఆయన మాట నెలా ఉల్లంఘించగలరు?

ఆ తర్వాత యువకుడైన గుణశర్మ అక్కడ ఆంగికాభినయం చేసినాడు. రాజు, రాణి ఇద్దరూ కూడా మానసికంగా నృత్యం చేసినారు. అది ముగిసిన తర్వాత రాజు అతనికి వీణను,

వాయించుటకై ఇచ్చినాడు. వీణను శ్రుతి చేస్తూ చేస్తూ ఆ బ్రాహ్మడిట్లా అన్నాడు: "దేవా! ఈ వీణ ప్రశస్తమైనది కాదు. నాకు మరొకటి ఇప్పించండి. ఈ వీణా తంత్రుల మధ్యలో ఒక శునక కేశం ఉన్నది. ఈ తంత్రుల ఝంకార లక్షణాన్ని బట్టి నేనీ సంగతిని గ్రహించినాను" —అని చెప్పి గుణశర్మ ఒడినుంచి వీణను పక్కకు పెట్టినాడు.

అప్పుడు రాజు తంత్రిని తడిపి తీసి చూడగా అందులో నుంచి ఒక శునక వాలం బయటికి వచ్చినది. అతని సర్వజ్ఞతను ఆ విధంగా తెలుసుకొని ప్రశంసించి, అతి విస్మితుడై మహాసేన నృపాలుడు మరొక వీణను తెప్పించినాడు.

ఆ వీణను, గుణశర్మ పాడుతూ వాయించినాడు. మూడు మార్గాలలో సంచరిస్తూ, గంగాఝరివలె ప్రవహిస్తూ ఆ వాదనం కర్ణపావన నిస్వనమైనది. అలా రాణితో పాటు ఉన్న ఆ చిత్రీభూతుడైన రాజు ఎదుట శస్త్రాస్త్ర విద్యా విశేషాలను కూడా అతను ప్రదర్శించినాడు.

అప్పుడు రాజిట్లా అన్నాడు: "నీకు యుద్ధ విద్య తెలిసినట్టయితే చేత ఆయుధం పట్టకుండానే శస్త్రధారి అయిన నన్ను ఓడించు." ఆ మాటకు గుణశర్మ ఇట్లన్నాడు: "దేవా, మీరు శస్త్రాలను తీసుకొని క్రమంగా నాపై వేయండి. నేను మీరు చెప్పినట్టు చేస్తాను."

ఆ తర్వాత రాజు ఖడ్గాది ఆయుధాలను దేని దేనినైతే గ్రహించి వేసే వాడో దాని దెబ్బ నుంచి గుణశర్మ అవలీలగా తప్పుకుంటూ, దానినే బంధించి, అపహరించి, అపహరించి రాజు హస్తాన్నీ, గాత్రాన్నీ కూడా అక్షతుడై స్తంభింప జేసినాడు.

అప్పుడు, ఈ బ్రాహ్మణోత్తముడు రాజ్య సహాయ సఖుడు అని ప్రస్తుతిస్తూ అతని అతి సర్వాతిశయత్వాన్ని గ్రహించినాడు. మరి రాణి అశోకవతి గుణశర్మ రూపాన్ని, గుణాలను చూచి చూచి తద్గత చిత్త అయినది.

"ఇలాంటి వానిని పొందక పోతే నా జీవితానికి ఫల మేమిటి?" అని ఆలోచించి యుక్తితో ఆ రాణి రాజుతో ఇట్లన్నది: "ఆర్యపుత్రా! ఈ గుణశర్మ నాకు వీణా వాదనం నేర్పునట్టుగా తాము ప్రసన్నులై ఆజ్ఞాపించ వలసినది. ఇప్పుడే ఆయన వీణావాదన కౌశలాన్ని చూచి నాలో ఏదో ప్రాణాధికమైన రసోదయం కలిగినది."

అప్పుడు గుణశర్మతో ఆ రాజిట్లా అన్నాడు: "దేవికి మీరు వల్లకీ వాదనంలో శిక్షణ ఇవ్వవలసినది."

"మీ ఆజ్ఞ ప్రకారమే కానివ్వండి. ఒక మంచి రోజున ప్రారంభింతాం" అని చెప్పి ఆ రాజును వీడ్కొని గుణశర్మ తన ఇంటికి వెళ్ళిపోయినాడు.

అయితే వీణాభ్యాసం మొదలు పెట్టకుండా చాలానాళ్ళు గడుపుతూ వచ్చినాడు. రాణిగారి దృష్టి మరొకవిధంగా ఉన్నదని గ్రహించి అపనయ శంకితుడైనాడు.

ఒక రోజు రాజు భోజనం చేస్తుండగా ప్రక్కన కూర్చున్న గుణశర్మ, వంటవాడు ఒక వ్యంజనం వేస్తుండగా వద్దు వద్దని వారించినాడు. ఇదేమిటని రాజు ప్రశ్నింపగా ఆ ప్రాజ్ఞుడిట్లా అన్నాడు: "ఈ వ్యంజనం విష భరితమైనది. దాని లక్షణాలను బట్టి నేను గ్రహించాను. వంటవాడు మీకు వేస్తుండగా వాని

ముఖంలో భయకంపనం కన్పించినది. ఏదో అనుమానంగా దొంగచూపులు చూస్తున్నాడు. దీనిని పరీక్షించడానికి ఎవరికైనా వెంటనే పెట్టించండి. ఈ భోజనం తిన్నవాని విషాన్ని నేను హరింప జేయగలను" అని అతను చెప్పగా ఆ వంటవానినే ఆ వంటకాన్ని తినవలసిందిగా రాజు ఆజ్ఞాపించినాడు.

వాడు తిన్నవెంటనే మూర్ఛిల్లినాడు. గుణశర్మ మంత్రంతో ఆ విషాన్ని తొలగించినాడు. అప్పుడు రాజు నిజమేమిటని వంటవానిని గద్దింపగా వాడిట్లా చెప్పినాడు: "దేవా! గౌడరాజు విక్రమశక్తి మీకు విషప్రయోగం చేయవలసిందిగా నన్ను ఇక్కడకు పంపించినాడు. అతను మీకు శత్రువుకదా! నేను విదేశీయుణ్ణి గనుక, పాకశాస్త్రంలో ప్రవీణుడను గనుక ప్రభువుల వారికి విన్నవించుకొని మీ మహానసంలో (వంటశాలలో) ప్రవేశించినాను.

—ఇప్పుడు వ్యంజనం మధ్యంలోపెట్టి విషాన్ని మీకు ఇవ్వదలచినాను. దానిని ఈ ధీశాలి కనిపెట్టినాడు. ఆ తర్వాత సంగతంతా మీకు తెలిసిందే" అని వంటవాడు చెప్పగా వానిని దండించి గుణశర్మ యెడల సంప్రీతుడై తన ప్రాణదాత అని వెయ్యి గ్రామాలను అతనికి దానం చేసినాడు.

మరునాడు రాణి బలవంతం మీద రాజు, గుణశర్మను ఒప్పించి వీణలో రాణికి శిక్షణ గరపడానికి ఆరంభం చేయించినాడు. ఆ తర్వాత గుణశర్మ వీణనేర్పుతుండగా రాణి విలాస హాసాదులు చేయమొదలిడినది.

ఒకసారి ఏకాంతంలో పదే పదే గోళ్ళతో గీరుతూ, భీరుడైన అతను వారిస్తుండగా స్మరశరాతుర అయిన రాణి అశోకవతి

ఇట్లా అన్నది: "వీణా వాదనమనే మిషతో ఓ సుందరుడా! నిన్ను నేను అర్థించాను. నాలో నీపై గాఢమైన అనురాగం జనించినది. కాబట్టి నన్ను అనుభవించు." ఈ మాట అంటున్న రాణితో అతనిట్లన్నాడు: "దేవీ! అట్లా అనవద్దు. నా ప్రభువునకు నీవు భార్యవు. కాబట్టి ఇలాంటిది తగదు. నా వంటివాడు ప్రభు ద్రోహాన్ని తలపెట్టడు. సాహసంచెయ్యకు."

ఆ మాటలన్న గుణశర్మతో రాణి ఇట్లన్నది: "నీ రూపము, నీ కళాకౌశలము ఇదంతా నిష్ఫలం కదా! నాలాంటి ప్రియురాలిని నీరసుడవై ఎలా ఉపేక్షించ గలుగుతున్నావు?"

అందు కతను అపహసిస్తూ ఇట్లా అన్నాడు: "నీవన్న మాటనిజమే. రూపానికి, విదగ్ధతకు ఫలమేమిటి? పరదారాపహరణంతో కీర్తిమలినం కాకూడదు. ఇహంలో పరంలో కూడా నరకార్ణవంలో పడిపోకూడదు"

ఆ మాటకు కోపించినట్టుగా ఆ రాణి అతనితో ఇట్లన్నది: "నా మాట నీవు వినక పోతే నాకు మరణమే శరణ్యం. తప్పదు కాబట్టి నేను నిన్ను చంపించి అవమానితురాలనై చనిపోతాను."

అప్పుడు గుణశర్మ అన్నాడు కదా: "సరే అట్లాగేకానీ. అధర్మంతో కల్పకోటి శతాలు బ్రతకడం కంటే ధర్మపాశబద్ధుడై ఒక క్షణం జీవించినా మంచిదే. పాపం చేయకుండా ప్రశంసార్హమైన మృత్యువును వరించడం మంచిది. పాపం చేసి రాజశాసనానికి బలికావడం గర్హించ దగినది."

ఈ మాట విని కూడా ఆ రాణి తిరిగి అతనితో ఇట్లన్నది: "నాకూ నీకూ కూడా ద్రోహం చేయవద్దు. నేను చెప్పినట్టు విను.

ఈ రాజు అశక్యమైనా నా మాటను అతిక్రమించడు. కాబట్టి ఆయనను వేడుకొని నిన్ను ఏదో ఒక దేశానికి అధిపతిని చేస్తాను. సామంతులందరూ నీకు అనుయాయులుగా ఉండేటట్టు చేస్తాను. అప్పుడు నీవే గుణోజ్జ్వలుడైన రాజవుతావు. అప్పుడు నీకింక భయమేమున్నది? ఎవరు నిన్ను ఎలా పరిభవించగలరు? కాబట్టి నన్ను నీవు నిస్సందేహంగా నీదానిని చేసుకోవచ్చును. అందువల్ల అన్యథా జరుగదు."

ఈ విధంగా చెప్తున్న ఆ నృపాంగన అనురాగ బంధితురాలని తెలుసుకొని గుణశర్మ యుక్తితో అప్పటికి తప్పించుకొనుటకై ఇట్లన్నాడు: "అంతగా నిర్బంధిస్తే నీవు చెప్పినట్టే చేస్తాను. వెంటనేచేస్తే ఇది బయటపడి పోవచ్చును. కాబట్టి తగదు. కొన్నాళ్లు ఓపిక పట్టవలసింది. అప్పుడు నా మాటలోని సత్యం తెలుస్తుంది. సర్వనాశ కారణమైన మీ విరోధంతో నాకు వచ్చేదేమిటి?" అని ఆశ కల్పించి ఆమె నప్పటికి సంతోషపెట్టి, ఆమెను తిరిగీ కలుసుకుంటానని మాట ఇచ్చి గుణశర్మ బయటికి వచ్చి నిట్టూర్చినాడు.

అలా కొన్నాళ్ళు జరగగా ఆ మహాసేన భూపతి తన శత్రువు సోమకేశ్వరుడు కోటలో ఉండగా ముట్టడించినాడు. అప్పుడు అదే సమయములో గౌడనాథుడు మహాసేన మహారాజు సేనను ముట్టడించి నాడు.

అప్పుడు మహాసేన భూపతి తన దగ్గరనున్న గుణశర్మతో ఇట్లన్నాడు: "మనం ఒకనిని ముట్టడించి ఉన్నాం. మరొక శత్రువు మనలను ముట్టడించినాడు. ఇప్పుడేమో మనసైన్యం ఇరువురితో పోరాడడానికి చాలదు. యుద్ధం చేయకుండా ఇలా ఇరుకునపడి ఎంతకాలమని మనం ఊరకే ఉండగలం? ఈ సంకటావస్థలో మనకర్తవ్యమేమిటి?'' అని రాజు ప్రశ్నింపగా పార్శ్వస్థుడైన గుణశర్మ ఇట్లన్నాడు:

ఆ తర్వాత అతని నిశ్చయమేదో తెలుసుకొని పగబట్టినది. ఒకసారి దుఃఖం నటిస్తూ ఏడుస్తూ ఉన్నది. మహాసేనుడు ఆ సమయంలో వచ్చి ఆమె అలా ఉండడం చూచి: "ఇదేమిటి ప్రియా! నిన్నెవరేం చేసినారు? వెంటనే వానిని ధన ప్రాణాలతో లోగొంటాను."

ఈ మాటను విని ఏదో కష్టపడు తున్నట్టుగా ఆమె అన్నది: "నాకు అపకారం చేసిన వానిని నిగ్రహించే శక్తి నీకు లేదు. కాబట్టి అతని విషయం వృథాగా బయటపెట్టి మాత్రం లాభమేమున్నది?" అని ఏదో అనురాగం పొరలి పోతున్నట్టుగా మిథ్యా వచనాలతో ఇట్లన్నది:

"ఆర్యపుత్రా! నీవు మరీ నిర్బంధిస్తే చెప్తాను విను. గౌడేశ్వరుని నుంచి ధనం సంపాయించు కొనడానికి వానితో కుట్రపన్ని గుణశర్మ నీకు ద్రోహం తలపెట్టినాడు. ఈ ద్విజాధముడు గౌడేశ్వరుని రాజు చేయవలెనని రహస్యంగా తన కాప్తుడైన ఒక దూతను పంపించినాడు. అక్కడ వంటవాడు ఆ రాజు నకాప్తుడుగా ఉండి ఆ రాజుతో అన్నాడు కదా — 'నీ కార్యాన్ని నేను నిర్వర్తిస్తాను. ధనక్షయం చెయ్యకండి'— అని చెప్పి ఆ గుణశర్మ దూతను దండించి, ఆ వంటవాడు, నీకు విషం పెట్టడానికై ఇక్కడికి వచ్చినాడు. అక్కడ గుణశర్మ పంపిన దూత ఆ బంధనం నుంచి తప్పించు కొని పోయి, గుణశర్మ వద్దకు వచ్చినాడు. అతను చెప్పిన వృత్తాంతమంతా విని వంటవానిని గుణశర్మే మన మహానసంలో ప్రవేశింప జేసినాడు.

ఆ తర్వాత ఈ ధూర్త బ్రాహ్మడు విషం పెడుతున్న వానిని పట్టి చంపినాడు. అక్కడ నుంచి ఈ వంటవాని తల్లి,

భార్య, చెల్లెలు అతనిని వెతుక్కుంటూ ఇక్కడికిరాగా, బుద్ధిమంతు డైన గుణశర్మ, వారిని దండించి భార్యను, తల్లిని చంపించి వేసినాడు. వాని తమ్ముడేమో దైవవశాత్తూ తప్పించుకొని పలా యితుడై నా మందిరంలో ప్రవేశించినాడు.

అతను సర్వవృత్తాంతాన్నీ చెప్తూ నన్ను శరణు జొచ్చి నాడు. ఆ సమయంలోనే గుణశర్మ నా వాస గృహంలోనికి ప్రవే శించినాడు. అతనిని చూచి, అతని పేరు విని వాడు భయంతో నా దగ్గర నుండి బయటపడినాడు. ఎక్కడికి పారి పోయినాడో నాకు తెలియదు.

గుణశర్మ కూడా వానిని చూచి తన భృత్యులు పూర్వం చూపించి ఉన్నారు గనుక వెల వెల బోతూ ఏదో ఆలోచిస్తూ న్నట్టుగా ఉండి పోయినాడు.

"గుణశర్మా! ఏమిటిప్పుడు ఇలా అయిపోయినావు?" అని జిజ్ఞాసతో నేను ఎవరూలేని సమయంలో అతనిని అడిగినాను. అప్పుడతను నన్ను తనవశం చేసుకోదలచి ఇదంతా ఎక్కడ బయట పడి పోతుందో నన్న భయంతో ఇట్లన్నాడు: "దేవీ! నేను నీ అనురాగాగ్నితో దగ్ధుడనౌతున్నాను. నన్ను నీ వానిని చేసుకో. లేకపోతే నేను జీవించను. నాకు ప్రాణరక్షణఇవ్వు" అని చెప్తూ శూన్యంగా ఉన్న వాసగృహంలో నా పాదాలపై పడినాడు.

అప్పుడు వెంటనే కాళ్ళను విదిలించుకొని సంభ్రమంతో నేను లేవగా అతను కూడా లేచి అబలను గనుక బలాత్కారంగా నన్ను ఆలింగనం చేసుకొన్నాడు. తక్షణమే పల్లవిక అనే నా చేటి అక్కడికి వచ్చినది. దానిని చూడగానే గుణశర్మ భయంతో బయటికి వెళ్ళి పోయినాడు.

అప్పుడు ఆ పల్లవిక రాక పోయేఉంటే తప్పకుండా ఆ పాపి నా శీలాన్ని ధ్వంసం చేసేవాడు. ఇదీ సంగతి" అని అబద్ధాలు చెప్పి విరమించి ఆ రాణి ఏడువసాగినది. మొదట అబద్ధాలు పుట్టి తర్వాత చెడిపెలు పుట్టినారు కదా!

రాజు అదంతావిని వెంటనే క్రోధంతో మండిపడినాడు. ఆడవారి మాటలను నమ్మడం గొప్పవారి విచక్షణా శక్తిని కూడా నశింప జేస్తుంది కదా!

అప్పుడు రాజు తనకాంతతో ఇట్లా అన్నాడు: "సుందరీ, సమాశ్వసించు. ఆ ద్రోహికి తప్పకుండా మరణశిక్ష విధిస్తాను. అయితే ఇదంతా యుక్తిగా చేయవలసి ఉన్నది. లేక పోతే అది అపఖ్యాతికి కారణం కావచ్చును.

అతను నాకు ఐదుసార్లు ప్రాణదానం చేసెనన్నది సుప్రసిద్ధమైన విషయం. మరి నీకు చేసిన అపకారాన్ని లోకానికి తెలియ జేయడం యుక్తంకాదు'' అని రాజు చెప్పగా విని రాణి ఇట్లన్నది: "ఈ తప్పు అవాచ్యమైతే మరి ఇతను గౌడేశ్వరుని స్నేహంతో ప్రభుద్రోహం తలపెట్టెనన్న దోషం అవాచ్యం కాదు కదా!"

ఈ మాటవిని అది యుక్తమేనని చెప్పి ఆ రాజు మహాసేనుడు తన కొలువు కూటానికి వెళ్ళినాడు. అక్కడ సర్వులూ రాజ దర్శనార్థమై వచ్చినారు. రాజులు, రాజపుత్రులు, సామంతులు, మంత్రులూ కూడా వారిలో ఉన్నారు. ఈ లోగా గుణశర్మ కూడా ఇంటి నుంచి రాజసన్నిధికి బయలుదేరుతూ దారిలో అనేకమైన అపశకునాలను చూచినాడు.

అతని ఎడమవేపు కాకి వెళ్ళినది. ఒక శునకం ఎడమనుంచి కుడి వైపునకు వెళ్ళినది. ఒక పాము దక్షిణం నుంచి ఎడమవైపునకు పోయినది. ఎడమ భుజం స్కంధంతో పాటూ అదిరినది. ఈ అపశకునాలన్నీ తనకేదో అశుభం కలగ గలదని తప్పక సూచి స్తున్నవని ఆ అశుభమేదైన తనకేకానీ తనప్రభువునకు కలుగ కుంటే చాలుననీ అనుకొని లోలోపల ఆలోచించుకుంటూ అతను రాజాస్థానానికి వచ్చినాడు. రాజకులంలో ఏ విరుద్ధ సంఘటనా కలుగకుండుగాక అనుకుంటూ భక్తితో నమస్కరించి కూర్చు న్నాడు. రాజు పూర్వంవలె అతనిని అభినందించలేదు. పైగా క్రోధోద్ధతమైన దృష్టితో కడకంట చూచినాడు.

ఇదేమిటని గుణశర్మ శంకిస్తుండగా రాజు సింహాసనంనుంచి లేచి గుణశర్మ భుజంపై కూర్చున్నాడు. విస్మితులైన సభ్యులను గూర్చి ఆ రాజిట్లన్నాడు: "గుణశర్మ విషయంలో నేను చెప్పే న్యాయం వినండి" అన్నాడు.

ఆ మాట విని గుణశర్మ ఇట్లా విన్నవించుకొన్నాడు. "నేను భృత్యుడను. తాము ప్రభువులు. మన వ్యవహారం సమానమెట్లా అవుతుంది? కాబట్టి ముందు మీరు సింహాసనంపై కూర్చోండి. తర్వాత మీ యిష్టం వచ్చినట్టు ఆజ్ఞాపించండి" అని ఆ ధీరుడు చెప్పగా, మంత్రులు కూడా ప్రబోధించగా రాజు తిరిగి సింహా సనాన్ని అధివసించి సభాస్తారులతో ఇట్లన్నాడు:

"మీకు సర్వమూ తెలుసు. క్రమాగతులైన మంత్రులను వదలి ఈ గుణశర్మను నేను నాతో సమానంగా చూస్తున్నాను. అయినప్పటికీ గౌడేశ్వరునితో చేరి ఇతను నాకు ద్రోహం తలపెట్టి నాడు. దూతలను పంపడం, రప్పించుకొనడం ద్వారా ఇది నా

చెవిని పడినది'' అని చెప్పి ఆ రాజు వారికి తన రాణి అశోకవతి చెప్పిన అసత్యవృత్తాంతాన్నంతా అభివర్ణించినాడు. తనకు ఆత్మ ధ్వంసం కలుగుతుందని అబద్ధాలల్లి ఆమె చెప్పినదంతా ఈ రాజు నిజమైనట్టుగా సభాస్తారుల ముందు వెల్లడించినాడు.

అప్పుడు గుణశర్మ ఇట్లన్నాడు: ''దేవా! ఇలాంటి అసత్యం తమకు విన్నవించిన వారెవరు? ఈ ఆకాశ చిత్రాన్ని నిర్మించినదెవరు?'' ఆ మాట వినగానే రాజు: "ఓ పాపీ! ఇది సత్యం కాక పోతే పిండివంటలోపల నున్న విషం సంగతి నీ కెట్లా తెలిసినది?''

ఆ మాటకు గుణశర్మ "సర్వమూ ప్రజ్ఞవల్ల తెలుస్తుంది'' అన్నాడు. అప్పుడు అతని మీది కోపంతో ఇతర మంత్రులందరూ అది అశక్య మన్నారు. — ''దేవా! తత్త్వాన్ని అన్వేషించకనే ఇలా అనడం పాడికాదు. నిర్విచారుడైన ప్రభువును నీతిజ్ఞులు ప్రశంసించరు.'' ఈ విధంగా పదే పదే చెప్తున్న గుణశర్మ పైనికి ఉరికి ఛురికను వానిపై విసరినాడు.

ఆ ప్రహారాన్ని కరణ ప్రయోగంతో తప్పించుకొనగా ఆ రాజు అనుచరులైన ఇతర వీరులు అతనిని కొట్టనుంకించినారు. అతను యుద్ధ కరణాల చేత ఆ బాకులను తప్పించుకొని గుణశర్మ వారందరితోనూ సమానంగా నిలిచినాడు.

ఆశ్చర్యజనకమైన హస్త లాఘవం ఎరిగిన వాడు గనుక కరణప్రయోగంతో వారందరూ అన్యోన్య కేశపాశాలతో బంధితు లౌనట్టు చేసినాడు. బలప్రయోగంతో ఆ రాజాస్థానం నుండి బయటికి వచ్చి తన వెంటబడిన నూర్గురు యోధులను చంపివేసి నాడు.

ఆ తర్వాత తన అంచలంలో కట్టుకొని ఉన్న అంతర్ధానాం జనాన్ని కనులకు పెట్టుకొని అదృశ్యుడై ఆ క్షణంలోనే ఆదేశం విడిచి పోయినాడు.

దక్షిణాపథాన్ని ఉద్దేశించి పోతూ దారిలో ఇట్లా అనుకొన్నాడు: "తప్పకుండా ఆ అశోకవతి ఈ మూఢుడైన రాజును ప్రేరేపించి ఉంటుంది. అనురక్తలై అవమానితలైన స్త్రీలు విషంకంటే అధిక ప్రమాదకారులు. అలాగే నిజాన్ని తెలుసుకోలేని రాజులు సాధువులకు అసేవ్యులు."

ఇట్లా ఏవేవో తలపోసు కుంటూ గుణశర్మ ఎలాగో ఒక ఊరు చేరుకొని అక్కడ మఱ్ఱిచెట్టు క్రిందనున్న ఒక బ్రాహ్మణోత్తముని చూచినాడు. ఆయన శిష్యులకు పాఠం చెప్తున్నాడు. ఆయనను సమీపించి నమస్కరించినాడు. ఆయన కూడా అతిథి సత్కారంచేసి కాసేపుండి ప్రశ్నించినాడు:

"ఓ బ్రాహ్మడా! ఏ శాఖను పాఠం చెప్పుకొంటున్నావు చెప్పు" అన్నాడు. అప్పుడా బ్రాహ్మణునితో గుణశర్మ ఇట్లన్నాడు: "పన్నెండు శాఖలను అధ్యయనం చేస్తున్నాను. సామవేదం నుండి రెండు. ఋగ్వేదం నుండి రెండు. యజుర్వేదం నుండి ఏడు. అథర్వవేదం నుండి ఒకటి."

ఆ మాటవిని: "అయితే నీవు దేవ స్వరూపుడవు" అని ఆ బ్రాహ్మణుడు ఆకారంతోనే ఉత్కర్షను తెలియజేస్తున్న గుణశర్మను వినయంతో తిరిగి ఇట్లా ప్రశ్నించినాడు: "మీ దేశమేది? మీ జన్మతో అలంకృతమైన అన్వయమేది? పేరేమిటి? ఇంత ఎలా అధ్యయనం చేయగలిగినారు? ఎక్కడ? ఇదంతా చెప్పవలసింది."

## గుణశర్మ జన్మవృత్తాంతం

ఆ ప్రశ్నలకు గుణశర్మ ఈ విధంగా చెప్పసాగినాడు: "ఉజ్జయినీ పట్టణంలో ఆదిత్యశర్మ అనే ఒకానొక బ్రాహ్మణ పుత్రుడున్నాడు. అతని చిన్నతనములోనే తండ్రి చనిపోయి నాడు. తల్లి తన పతితో పాటే అగ్ని సాత్కృత అయినది. అప్పు డతను మేనమామ గారి ఇంటిలో, అదే పట్టణంలోనే వేదాలను. విద్యలను. కళలను అధ్యయనం చేస్తూ పెరిగినాడు. ఆయన పేరు ఆదిత్యశర్మ.

— విద్యలు నేర్చుకొని జపవ్రతాదులను అనువర్తిస్తూ వస్తున్న అతనికి ఒకానొక ప్రవ్రాజకునితో సఖ్యం ఏర్పడినది. ఆ పరివ్రాట్టు మిత్రుడైన ఆదిత్యశర్మతో పాటూ శ్మశానానికి వెళ్ళి యక్షిణీ సిద్ధి కోసమై హోమం చేయసాగినాడు.

అక్కడ స్వర్ణ విమాన గమన, వరకన్యా పరివృత అయిన సాలంకృత దివ్యకన్య ఒకతె ఆ హోమకుండంలో నుంచి ఆవిర్భ వించి మధుర వాక్కులతో ఇట్లన్నది: "నా పేరు విద్యున్మాల. నేను యక్షిణిని. వీరందరూ ఇతర యక్షిణులు. ఈ నా పరి వారంలో నుంచి నీకు నచ్చిన ఒకతెను తీసుకో. నీ ఈ మంత్ర సాధనకు ఫలం ఇంత వరకే. నా మంత్ర సాధనను పూర్తిగా నీ వెరుగవు. అందువల్ల నేను నీకు సిద్ధించడంలేదు. అనవసరంగా మరింత క్లేశాన్ని తెచ్చి పెట్టుకోవద్దు." ఈ విధంగా ఆ యక్షిణి చెప్పగా పరివ్రాట్టు అందుకంగీకరించి, ఆమె పరివారంలో నుంచి ఒక యక్షిణిని పరిగ్రహించినాడు. ఆ తర్వాత విద్యున్మాల తిరోధానం చెందినది.

ఆ ప్రవ్రాజకునకు సిద్ధించిన యక్షిణిని ఆదిత్యశర్మ ఇట్లా ప్రశ్నించినాడు: "విద్యున్మాలకంటె ఉత్తము రాలైన యక్షిణి

కలదా?" ఆ మాట విని ఆ యక్షిణి: "కలదు సుందరా కలదు. విద్యున్మాల, చంద్రలేఖ, మూడవది సులోచన. ఈముగ్గురిలోనూ ఉత్తమురాలు సులోచనే" అని చెప్పి, కోరినప్పుడెల్లా వస్తానని వెళ్ళిపోయినది.

ఆదిత్యశర్మతో పాటూ ఆ ప్రవ్రాజకుడు ఆ యక్షిణి ఇంటికి వెళ్ళినాడు. అక్కడ ప్రతిదినము ప్రవ్రాజకుని యెడ ప్రీతురాలైన ఆ యక్షిణి కాలోపగామిని అయి ఇష్టభోగాల నన్నిటినీ సమకూరుస్తూ వచ్చినది.

ఒకసారి ఆదిత్యశర్మ ప్రవ్రాజకుని ద్వారా ఆమెను అడిగించినాడు. సులోచనా మంత్రవిధిని ఎరిగిన వారెవ్వరో కనుక్కొమన్నాడు. అతనితో ఆ యక్షిణి ఇలా చెప్పినది: "దక్షిణ దిగ్భాభాగంలో తుంబవనం అనే స్థానం ఉన్నది. అక్కడ విష్ణుగుప్తుడనే ప్రవ్రాజకుడు వీణా తీరంలో నివాస మేర్పరచుకొని ఉన్నాడు. అతను ప్రవ్రాజకుడు: భదంతుడు (బుద్ధసన్యాసి). అతనికిది సవిస్తరంగా తెలుసును."

ఈ సంగతిని యక్షిణి మాటలవల్ల తెలుసుకొని కుతూహలంతో ఆదేశానికి వెళ్ళడానికి ఆదిత్యశర్మ ఉద్యుక్తుడైనాడు. ప్రీతితో ప్రవ్రాజకుడు తోడు వెళ్ళినాడు. అక్కడ వెదకి వెదకి ఆ భదంతుని కనుగొని చేరి భక్తితో మూడేళ్ళతనికి శుశ్రూష చేసినాడు. అలాగే పరివ్రాట్టునకు సిద్ధించిన యక్షిణితో అవసరమైన వానిని తెప్పించి మానవాతీతమైన ఉపచారాలను కూడా చేయించినాడు.

ఆ తర్వాత భదంతుడు సంతుష్టుడై ఆదిత్యశర్మకు అతనర్థించిన సులోచనా మంత్రాన్ని విధాన పూర్వకంగా ఉపదేశించి

నాడు. ఆ తర్వాత ఆదిత్యశర్మ ఆ మంత్రాన్ని జపించి సమాప్తి చేసి ఏకాంతంలో యథావిధిగా హోమం చేసినాడు.

ఆ తర్వాత విమానస్థురాలైన ఆ యక్షిణి సులోచన జగదాశ్చర్యదాయి అయిన రూపంతో ప్రత్యక్షమయినది: ఈ విధంగా అన్నది: "రమ్ము రమ్ము: నేను నీకు సిద్ధురాలనైతిని. ఇక నీకేం కావాలి? నా కన్యకా భావాన్ని ఆరునెలలు నీవు తొలగింపరాదు. నిజంగా నీవు నా మూలంగా మహావీరుడు. బుద్ధిపాత్రుడు. సులక్షణుడు. సర్వజ్ఞకల్పుడు. అజేయుడు అయిన పుత్రుని పొందదలిస్తే ఈ నియమం పాటించాలి" అని ఆమె చెప్పగా అతను అందుకు అంగీకరించినాడు. అప్పుడు ఆ యక్షిణి ఆదిత్యశర్మను విమానంలో కూర్చుండ బెట్టుకొని అలకాపట్టణానికి వెళ్ళిపోయినది.

ఆమె దగ్గరే ఉన్నప్పటికీ కేవలం చూస్తూ నియమానుసారంగా ఆరునెలలు అసిధారావ్రతాన్ని సాధించినాడు. అప్పుడు సంతుష్టుడైన కుబేరుడు దైవానుకూలం వల్ల స్వయంగానే ఆదిత్యశర్మకు సులోచనను దత్తం చేసినాడు.

ఆ బ్రాహ్మనికి ఆ సులోచనకు నేను కొడుకుగా పుట్టినవాడను. గుణవంతుడనని. నాకు మా తండ్రి గుణశర్మ అనే పేరు పెట్టినాడు. అక్కడనే యక్షాధిపతి వద్దనున్న మునిధరుని వద్ద క్రమంగా వేదాలను. విద్యలను. కళలను అధ్యయనం చేసినాను.

ఒకానొకప్పుడు ఎందుకో ఇంద్రుడు కుబేరుని వద్దకు వచ్చినాడు. ఆయనకు వారంతా ఎదురువెళ్ళినారు. అక్కడ ఉన్న వారందరి వేపు ఇంద్రుడు చూచినాడు. మా తండ్రి ఆదిత్యశర్మ

విధివశాత్తూ ఆ సమయంలో ఏదో పరధ్యానంగా ఉండి వెంటనే లేచి నిలబడలేదు. అప్పుడు దేవేంద్రుడు క్రుద్ధుడై: "ఛీ. ఛీ మూఢుడా! నీవు మర్త్యలోకానికి వెళ్ళు. ఇక్కడ ఉండడానికి నీవు యోగ్యుడవు కాదు" అని శపించినాడు. సులోచన నమస్కరించి అనునయింపగా శక్రుడు "అయితే ఇతను స్వయంగా మర్త్యలోకానికి పోవలసిన పనిలేదు. ఇతని కొడుకు వెళ్ళనీ ఆత్మా వై పుత్ర నామాసి అంటారు కదా! నా మాట వ్యర్థం కారాదు — "అని ఇంద్రుడు శాంతించినాడు.

ఆ తర్వాత మా తండ్రి నన్నుకొనివచ్చి మా మేనమామ ఇంటిలో వదలివేసినాడు. ఉజ్జయినిలో నేనుండవలసి వచ్చినది. ఎవరికెలా జరగాలో అలాగే జరుగుతుంది. తర్వాత దైవవశాత్తూ అక్కడున్న రాజుతో నాకు మైత్రి ఏర్పడినది. ఆ తర్వాత అక్కడ ఏంజరిగినదో సర్వమూ చెప్తాను విను" అని అశోకవతి చేసినదీ రాజు కోపించి తనతో ఘర్షణ పడిన విషయమూ సర్వమూ ఆమూలాగ్రంగా చెప్పినాడు.

తిరిగి గుణశర్మ ఇట్లన్నాడు: "ఇలా జరగడం వల్ల నే నా ఊరినుండి పారి పోయి దేశాంతరం వెడుతూ ఇక్కడ నేను మిమ్ములను దర్శించు కొన్నాను."

ఈ మాటలను విని ఆ బ్రాహ్మణుడు గుణశర్మతో ఇట్లన్నాడు: "అయితే ప్రభూ! మీ దర్శనం వల్ల నేను ధన్యుడనైనాను. మా ఇంటికి దయచేయ వలసింది. నన్ను అగ్నిదత్తుడంటారు. ఈ గ్రామం మా అగ్రహారం. మీరు హాయిగా ఉండవచ్చును" అని చెప్పి అగ్నిదత్తుడు తన ఇంటికి అతనిని తీసుకొని పోయినాడు.

బుద్ధిమంతుడైన గుణశర్మను, బహుగోమహిషీ హయప్రపూర్ణమై సంపన్నమైన తన ఇంటికి ఆ విప్రుడు కొని పోయినాడు. అక్కడ స్నానాంగరాగాదులతో, వస్త్రాభరణాలతో, వివిధ భోజనాదులతో అగ్నిదత్తుడు అతిదిసత్కారం చేసినాడు. గుణశర్మకు, తన కుమారి అనన్య సామాన్య లక్షణాలు చూచి భవిష్యత్తు చెప్పవలసినదన్న మిషతో, సుందరి అను పేరుగల తన పుత్రికను చూపెట్టినాడు.

గుణశర్మ కూడా అనన్య సామాన్య రూప అయిన ఆమెను చూచి ఈమెకు సవతులుండగలరని అగ్నిదత్తునితో చెప్పినాడు. ఆమె ముక్కుమీద చిన్న మచ్చ గలదు గనుక దాని ఫలితం నేనిలా చెప్తున్నాను. మరొక మచ్చ వక్షఃస్థలంపై కూడా ఉంటుంది. దాని ఫలం కూడా ఇదే. ఈ మాట ఆయన చెప్పగా తండ్రి ఆజ్ఞపై ఆమె అన్న ఉత్తరీయం తొలగింపగా అక్కడ మచ్చ కనిపించినది.

అత్యాశ్చర్య భరితుడైన అగ్నిదత్తుడు గుణశర్మతో అప్పుడిట్లన్నాడు: "నీవు సర్వజ్ఞుడవు. ఈమె కున్న రెండు మచ్చలూ అశుభ ప్రదాలు కావు. భర్త శ్రీమంతుడైతే తరచూ సపత్నులుంటారు. దరిద్రుడైతే ఒక భార్యనే భరించలేడు గనుక బహుభార్యలెక్కడ నుండి వస్తారు ?"

ఆ మాటవిని గుణశర్మ తిరిగి ఇట్లన్నాడు: "మీ మాట నిజమే. సులక్షణ అయిన ఇలాంటి ఆకారం గల కన్యకకు అశుభమెలా ప్రాప్తిస్తుంది ?" అని చెప్పి ప్రసంగ వశాత్తూ గృహస్థు ప్రశ్నింపగా ఇట్లా విశదీకరించినాడు : " ఒకొక్క అంగంపైనున్న మచ్చలఫలం స్త్రీ పురుషులకు ఒకొక్క విధంగా ఉంటుంది " అని వివరించినాడు.

అంతట ఆ గుణశర్మను చూచి ఆ సుందరి చకోరి చంద్రుని తాగివేస్తున్నట్టుగా ఉత్సుకురాలై చూపులతోనే త్రాగివేయ సాగినది.

అంతట అగ్నిదత్తుడు ఏకాంతలో గుణశర్మతో ఇట్లన్నాడు: " మహాభాగా! ఈ కన్య సుందరిని నీకు నేను దానం చేస్తాను. ఇక ఏ విదేశాలకూ నీవు వెళ్ళవద్దు. మా ఇంటిలోనే హాయిగా ఉండిపో." ఆ మాటవిని గుణశర్మ ఇట్లన్నాడు:

" ఇట్లా చేస్తే నా భార్యగానే ఉంటుంది. అయితే అనవసరంగా రాజు అవమానించడం వల్ల సంతప్తుడనైన నాకు ఇది సంతృప్తి నివ్వదు. కాంత, చంద్రోదయం, వీణ, పంచమధ్వని ఇవన్ని సుఖంగా ఉన్నవారిని సంతోషింప జేస్తాయి. దుఃఖితులైన వారిని బాధిస్తాయి.

స్వయం అనురక్తురాలైన స్త్రీ అవ్యభిచారిణి అవుతుంది. అస్వతంత్రురాలై తండ్రి ఇచ్చిన కన్య అశోకవతి వలె ప్రవర్తిస్తుంది. ఇక్కడికి ఉజ్జయినీ పట్టణం దగ్గరలోనే ఉన్నది. ఈ సంగతి తెలిసి ఆ రాజు నా కెప్పుడో ఉపద్రవం తేవచ్చును. కాబట్టి తీర్థయాత్రలు చేసి వచ్చి, ఆజన్మ పాపాలను కడిగి వేసుకొని, ఆ తర్వాత ఈ శరీరాన్ని వదలి సుఖి నౌతాను''

ఈ విధంగా చెప్తున్న అతని మాటలు విని అగ్నిదత్తుడు నవ్వుతూ అన్నాడు: " నీకు కూడా ఇలాంటి భ్రమ ఉంటే ఇక ఇతరుల సంగతి చెప్పవలసిన దేమున్నది? నీవు పరిశుద్ధుడవై ఉండగా తెలియక జరిగిన అవమానం వల్ల హాని ఏ మున్నది? బురదనెత్తి ఆకసం పైనికి విసిరితే అది విసరిన వాని నెత్తిననే

పడుతుంది. ఆ రాజే తన అజ్ఞానం వల్ల కలిగిన ఫలితాన్ని త్వర లోనే పొందగలడు. మోహాంధుని, అవివేకిని లక్ష్మి చిరకాలం సేవింపదు.

— అశోకవతిని చూచి స్త్రీలందరి మీదా నీకు వైరస్యం కలిగి ఉంటే, వారిలో పతివ్రతను చూచి శ్రద్ధతో ఆ లక్షణాన్ని కూడా తెలుసుకోగలవు. ఉజ్జయినీ నగరం దగ్గరే అంటావా? మా కన్యను నీ కివ్వడం, నీ విక్కడ ఉండడం ఇవేవీ ఎవరికీ తెలియ నీయ కుండా చేస్తాను. తీర్థయాత్రలు చేస్తానంటావా? యజ్ఞాదు లను నిర్వర్తించడానికి తగిన సంపత్తి ఎవరి దగ్గర ఉండదో వారి కది పెద్దలు విధించినారు. అన్యథా దేవపిత్రగ్నిక్రియలు, వ్రతా దులు, జపాదులతో తన ఇంటిలోనే పుణ్యనిష్పత్తి చేసుకొనే వానికి దారులు బట్టి తిరగడం వల్ల సుకృతం ఎక్కడ లభిస్తుంది? చేయి తలక్రింద పెట్టుకొని భూశాయి అయి భిక్షాటన చేసుకొనే వాడు కేవలనిర్ధనుడు. ముని సమానత్వాన్ని పొంది నప్పటికీ పాంథసంక్లేశాలనుంచి తప్పించుకోలేడు.

— ఇక దేహత్యాగం చేసి సుఖ పడతానంటావా? అది కేవలం నీ భ్రమ. ఇంతకంటే కష్టతరమైన దుఃఖం ఆత్మఘాతికి మరొకటుండదు! కాబట్టి ఈ అనుచితమైన మోహం యువకుడు, విద్వాంసుడు అయిన నీకు తగదు. నీ అంతట నీవే కర్తవ్య మేమిటో విచారించుకో. నా మాటలోని సత్యం తెలుస్తుంది. నీ కోసమై ఇక్కడ ఒక సువిశాలమైన సుందర భూగృహాన్ని గుప్తంగా నిర్మిస్తాను. ఈ సుందరిని వివాహం చేసుకొని నీవలా ఉండాలను కుంటే రహస్యంగానే భూగృహంలో ఉండవచ్చును."

ఈ విధంగా అగ్నిదత్తుడు ప్రబోధింపగా ప్రయత్నపూర్వ కంగా గుణశర్మ అందుకంగీకరించి ఇట్లా అన్నాడు: "నేను మాట

ప్రకారమే అనుసరిస్తాననుకోండి. ఈ సుందరిని భార్యగా చేసుకొన్నవాడు ఆమె నెలా వదలి పెడతాడు? అయితే నేనీ దశలో ప్రతిక్రియ చేయని యెడల నీ కుమార్తెను వివాహమాడను. నేను ముందు దేవుని ఆరాధించి, కొంతకాలం నిగ్రహంతో ఉండి, ఆ కృతఘ్నుడైన రాజునకు ప్రతీకారం చేస్తాను."

ఈ మాట విని అగ్నిదత్తుడు అందుకు సమ్మతించినాడు. గుణశర్మ కూడా అక్కడ ఆ రాత్రి సుఖంగా విశ్రమించినాడు.

మరునాడు అగ్నిదత్తుడు ఆయన సుఖంగా ఉండుటకై రహస్యంగా పాతాళ వసతి వంటి భూగృహాన్ని నిర్మింపజేసినాడు. అక్కడ ఉండి గుణశర్మ రహస్యంగా అగ్నిదత్తునితో ఇట్లన్నాడు. "ఏ దేవుని ఏ మంత్రంతో భక్తి పూర్వకంగా నేను ఆరాధిస్తే మంచిదో, ఏ దేవుడు ఈ వ్రతచర్యతో వరదుడౌతాడో చెప్పండి."

ఇట్లా అన్న ఆ ధీరునితో అగ్నిదత్తుడిట్లా అన్నాడు: "నాకు మా గురువు ఉపదేశించిన కుమారస్వామి మంత్రం కలదు. దానితో నీవు ఆ తారకాంతకుని, దేవసేనానిని ఆరాధించు. ఆయన జన్మార్థమై శత్రుపీడితులైన దేవతలందరూ కోరగా కాముడు, దగ్ధుడైనప్పటికీ మహేశ్వరునితో సంకల్పజన్ముడుగా నిర్మితుడైనాడు.

మహేశ్వరుని వల్ల అగ్ని కుండంనుంచి, అగ్నినుంచి, జంబు దుబ్బుల నుంచి, కృత్తికల నుంచి ఆయన జన్మించెనని చెప్తారు. ఆయన జన్మ విచిత్రమైనది. పుట్టగానే దుర్ధర్షమైన తేజస్సుతో ఆయన జగత్తునంతటినీ ఆనందింప జేసినాడు. దుర్జయుడైన తారకాసురుని సంహరించినాడు. ఆయన మంత్రాన్ని

పతిత్వాన్ని సముపార్జించు కొన్నాడు. ఇతర రాజ కన్యలను పరిణయం చేసుకొని, సముద్ర తీరంలో కూడా పరాఙ్ముఖుడు కానివాడై ఆ గుణశర్మ సమాప్రిట్టు సుందరీ సమేతుడై ఇష్ట భోగాలను చిరకాలం అనుభవించినాడు.

ఈ విధంగా పురుష విశేష జ్ఞానశూన్యుడై మందబుద్ధి మహాసేన భూపతి పూర్వం ఆపదల పాలైనాడు. అలాగే ధైర్య మొక్కటే సహాయంకాగా కృతబుద్ధి అయిన గుణశర్మ అత్యుత్తమమైన సంపదను సముపార్జించు కున్నాడు.

— ఈ విధంగా తనమంత్రి వీతభీతినుంచి ఈ ఉదార కథను సూర్యప్రభుడు ఆ రాత్రి విన్నాడు. వీరుడై మహా సమర సాగరంనుంచి ఉత్తీర్ణుడగుటకై అధికోత్సాహాన్ని పొంది పడుకొని క్రమంగా నిద్రపోయినాడు.

ఇది మహాకవి శ్రీ సోమదేవభట్ట విరచితమైన

కథాసరిత్సాగరంలో సూర్యప్రభ లంబకంలో

షష్ఠతరంగం సమాప్తం.

# సప్తమతరంగం

మరునాటి ఉదయం సచివులతో పాటూ మేల్కాంచిన సూర్యప్రభుడు సర్వదానవాది బలాలతోనూ కలిసి యుద్ధ భూమికి వెళ్ళినాడు. శ్రుతశర్మ కూడా విద్యాధర బలాలతో పాటూ అక్కడికి వచ్చినాడు. యుద్ధ దర్శనార్థమై సర్వదేవాసురాదులు కూడా అక్కడికి చేరుకొన్నారు.

రెండు సేనలు అర్ధచంద్రవ్యూహాన్ని పన్నినవి. ఆ రెండు బలవత్సేనలకు మధ్య యుద్ధం ప్రవర్తిల్లినది. శబ్దిస్తూ, పరువెత్తుతూ, పరస్పరం ఖండించుకుంటూ పత్రారూఢములై అతి జవంతో బాణాలు కూడా యుద్ధం చేసినవి.

కోశా(ఒర)ననాగ్రం నుంచి వెలువడి సుదీర్ఘములు పీత శోణితములై, లోలములైన ఖడ్గలతలు కృతాంతుని నాలుకలవలె ప్రకాశించినవి. శూరుల వికసిత ముఖాంభోజాలపై ఎగురుతున్న చక్రసంహతితో ఆ ఆహవమహాసరస్సు రాజవంశ క్షయం కోసమైనది. పగులుతూ, ఎగురుతూ తెగిపడుతున్న శూరుల తలలతో ఆ సంగ్రామం కృతాంత కందుక క్రీడా సన్నిభమైనది.

రక్తాసేకంతో నిర్ధూతధూళి ధ్వాంతమైన రణాంగణంలో మహారథుల మధ్య క్రోధోద్రిక్తమైన ద్వంద్వ యుద్ధాలు కొనసాగినవి. సూర్యప్రభునికి శ్రుతశర్మతోను, దామోదరునితో ప్రభాసునకును ద్వంద్వ యుద్ధం చెలరేగినది.

అలాగే మహోత్పాతునితో సిద్ధార్థుడు యుద్ధం చేసినాడు. ప్రహస్తుడు బ్రహ్మగుప్తునితో నిర్భీకుడై పోరాడినాడు. ప్రజ్ఞాఢ్యుడు చంద్రగుప్తునితో, సంగమునితో వీత భీతి ఎదుర్కొన్నారు. సర్వదమనుడు అతిబలుని మార్కొన్నాడు. ధురంధరునితో కుంజరకుమారకుడు కలబడినాడు.

ఈ విధంగా ఇతర మహారధులు శత్రుమహారథులతో వేరు వేరుగా పోరాటం సాగించినారు.

మొదట మహోత్పాతుడు బాణాలను బాణాలతో ఖండించి, సిద్ధార్థుని ధనుస్సును విరుగగొట్టి అతని సారదిని, అశ్వాలను పరి మార్చినాడు. సిద్ధార్థుడు కూడా విరథుడై కోపంతో శత్రువుపై ఉరికి అయోదండంతో వాని అశ్వాలతో పాటూ రథాన్ని కూడా చూర్ణం చేసి వేసినాడు.

ఆ తర్వాత పాదచారి అయిన సిద్ధార్థుడు పాదచారిగానే ఉన్న మహోత్పాతునితో బాహుయుద్ధం చేసి క్రిందపడవేసినాడు. అతని చంపుటకై ప్రయత్నిస్తుండగనే ఖేచరుడైన అతనికి తండ్రి అయిన భగుడు ఎత్తుకొని రణస్థలి నుంచి బయటికి వెళ్ళి పోయినాడు.

ప్రహస్తబ్రహ్మగుప్తులు పరస్పరం విరధీకృతులై ఖడ్గ యుద్ధంతో అనేక విధాలా పోరినారు. ప్రహస్తుడు యుక్తితో కత్తినడ్డుకునే డాలును ఎగురగొట్టి బ్రహ్మగుప్తుని నేలపై కూల్చి నాడు. పడిపోయిన అతని తలను నరకబోతుండగా అతని తండ్రి అయిన బ్రహ్మ స్వయంగా నివారించినాడు. అప్పుడు దానవు లందరూ దేవతలను చూచి అపహసిస్తూ "మీరు మీ కొడుకులను

కాపాడుకొనుటకు వచ్చినారు కానీ యుద్ధం చూడడానికి కాదు "
అని అన్నారు.

వీతభీతితో ధనుస్సు ఖండితంకాగా, సారథి హతుడు కాగా ప్రద్యుమ్నాస్త్రంతో హృదయంపై కొట్టినాడు. ప్రజ్ఞాఢ్యుడు చంద్రగుప్తుని పదాతిని చేసి, తాను కూడా పదాతి అయి ఖడ్గ యుద్ధంలో తలను ఖండించి వేసినాడు.

ఆ తర్వాత తన కొడుకును చంపెనన్న కోపంతో చంద్రుడు స్వయంగా వచ్చి ప్రజ్ఞాఢ్యునితో యుద్ధం చేసినాడు. వారిద్దరి మధ్య యుద్ధం సమంగా కొనసాగినది. ప్రియంకరుడు రథ హీనుడై ఖడ్గంతో ఒక్కే ఒక దెబ్బతో అక్రముని రెండుగా చీల్చి వేసినాడు.

ధనుస్సు భిన్నం కాగా, అంకుశంతో హృదయం క్షతం కాగా సర్వదమనుడు అవలీలగా అతిబలుని రణంలో చంపివేసి నాడు.

అలాగే ధురంధరుని కుంజరకుమారకుడు, అస్త్రప్రత్యస్త్ర యుద్ధంలో పదే పదే విరథుని చేసినాడు. పదే పదే విక్రమశక్తి అతనికి రథాన్ని సమకూర్చినాడు. సంకటావస్థలో అస్త్రాలతో అడ్డగిస్తూ రక్షించినాడు. ఆ కుంజరకుమారకుడు పరువెత్తి అక్కడనున్న ఒక మహాశిలను తీసుకొని క్రుద్ధుడై విక్రమశక్తి రథంపై వేసినాడు. చూర్ణీభూతమైన స్యందనంలో విక్రమశక్తి గతుడుకాగా అదే రాతితోనే అతను ధురంధరుని చూర్ణం చేసినాడు.

సూర్యప్రభుడు శ్రుతశర్మతో యుద్ధం చేస్తూ, విరోచన వధతో అగ్రహోదగ్రుడై ఒక బాణంతో దముని కొట్టినాడు. ఆ

క్రోధం వల్ల అశ్వినీదేవతలు బాణాలు వదులుతూ యుద్ధానికి వచ్చినారు.

సునీథుడు ఎదిరించగా వారితో మహాయుద్ధం కొనసాగినది. స్థిరబుద్ధి కూడా పరాక్రముని శక్తితో మోది ఆ వధతో క్రుద్ధులైన అష్టవసువులతో సమరం సాగించినాడు. విరథీకృత భాసుడైన మర్దనుని చూచి ప్రభాసుడు దామోదర రణాసక్తుడై నప్పటికీ ఒకే ఒక బాణంతో చంపివేసినాడు.

ప్రకంపనుడు అస్త్రయుద్ధంలో తేజఃప్రభుని చంపి ఆ వధతో క్రుద్ధుడైన అగ్నిదేవునితో యుద్ధం చేసినాడు. ధూమకేతువు యమపుత్రుడైన యమదంష్ట్రుని చంపగా అతని తండ్రి యమ ధర్మరాజుతో యుద్ధం జరిగింది. సింహదంష్ట్రుడు బండతో సురోషణుని పిండి పిండి చేసి అతని వధ వల్ల కుపితుడైన నిరృతితో యుద్ధం చేసినాడు.

కాలచక్రుడు కూడా చక్రంతో వాయుబలుని రెండుగా చీల్చివేసినాడు. ఆ కోపం వల్ల కుపితుడైన వాయుదేవునితో యుద్ధం చేసినాడు. నాగాద్రి వృక్షరూపాలతో విమోహం కల్పిస్తున్న కుబేరదత్తుని మహామాయుడు తార్క్ష్యవజ్రాగ్ని రూపధరుడై చంపివేసినాడు. అప్పుడు క్రుద్ధుడైన కుబేరునితో యుద్ధం కొనసాగినది. ఇదే విధంగానే ఇతర దేవతలు కూడా తమ అంశలో పుట్టిన వారిని వధించిరన్న కోపంతో యుద్ధం చేసినారు.

ఆ యా విద్యాధరాధిపులు నిమిష నిమిషానికి నిహతులౌతున్న మానవులు, దానవులూ అనేక ప్రసిద్ధ విద్యాధర రాజులను వారి సర్దారులనూ వధించినారు.

ఇంతలో ప్రభాసునికి దామోదరునికి మధ్య పరస్పరం అస్త్రప్రత్యస్త్ర భయంకరమైన యుద్ధం చెలరేగినది. అంతలో దామోదరుడు ఛిన్నచాపుడై, సారథి చనిపోగా మరొక చాపం తీసుకొని తానే పగ్గాలను పట్టుకొని యుద్ధం చేసినాడు.

ఆ సమయంలో అతనిని మెచ్చుకొంటున్న బ్రహ్మను ఇంద్రుడిట్లా ప్రశ్నించినాడు: "భగవాన్! అసహ్యంపుకో దగిన వానిని చూచి సంతోషిస్తున్నారేమిటి?"

అప్పుడు బ్రహ్మ అతనితో అన్నాడు కదా: "సంతోష పడకుండా ఎలా ఉంటాము? ఈ దామోదరుడు ప్రభాసునితో ఇంత సేపు యుద్ధం చేయగలుగు తున్నాడంటే అదేమంత సామాన్య విషయం కాదు. దామోదరుని లాంటి హరిఅంశలో పుట్టినవాడు తప్ప మరొక రిలా చేయలేరు. ఒక ప్రభాసుని ముందు యుద్ధంలో దేవతలందరూ అత్యల్పులు. నముచి అను పేరుగల సురమర్దనుడైన అసురుడుండెనుగదా. అతనికి పుట్టినవాడీ ప్రభాసుడు. అతను సర్వరత్నమయుడై పుట్టినాడు. ఆ ప్రభాసుడు ఇప్పుడు దుర్జయుడై భాసునకు పుత్రుడుగా జన్మించినాడు. భాసుడు కూడా పూర్వం కాలనేమి అనే మహాసురుడు. తిరిగి హిరణ్యకశిపుడు, కపింజలుడై, సుముండీకుడైనవాడే ఈ సూర్యప్రభుడు. పూర్వం హిరణ్యాక్షుడే తర్వాత సునీథాసురుడైనాడు.

— ప్రహస్తాదులైన ఈ సర్వదైత్య దానవులూ మీతో పూర్వం హతులైన వారే. తిరిగి అసురులుగా జన్మించినారు. మయాదులు అందువల్లనే వీరిపక్షం వహించినారు. సూర్యప్రభాదులు నిర్వర్తించిన రుద్రయజ్ఞ ప్రభావంవల్ల విస్రస్త బంధనుడై బలి ఈ సంగ్రామాన్ని చూడడానికి వచ్చినాడు. తన సత్య

వచనాన్ని కాపాడుకుంటూ ఆయన పాతాళ లోకాలలోనే ఉంటాడు. అలా నీ రాజ్యకాల పర్యంతం ఉండి తర్వాత తాను ఇంద్రుడౌతాడు.

— వీరందరికీ ఇపుడు త్రిపురారి చేదోడుగా ఉన్నాడు. కాబట్టి ఇది మీకు జయకాలం కాదు. ఆగ్రహంతో లాభంలేదు. వీరితో సంధి చేసుకొనండి" అని కమలాసనుడు దేవేంద్రునితో చెప్తుండగా, అంతలో ప్రభాసుడు పాశుపత మహాస్త్రాన్ని వదలినాడు. అది చూచి, ఆ రౌద్రాస్త్రం విజృంభించి సర్వ సంహారం చేస్తుందని పుత్రప్రీతి వల్ల హరి తన చక్రాన్ని ప్రయోగించినాడు.

అప్పుడు సమానాలైన ఆ రెండు దివ్యాస్త్రాల మధ్య యుద్ధం కొనసాగినది. అకాండ విశ్వసంహార సంభ్రాంతితో భువనత్రయం గడగడ లాడినది. "నీవు నీ అస్త్రాన్ని ఉపసంహరించుకుంటే నేను నా అస్త్రాన్ని ఉపసంహరించు కుంటాను" అని హరి అనగా ఆ ప్రభాసుడిట్లా జవాబిచ్చినాడు: "విడిచిన అస్త్రం వృథా కారాదు. అది పరాఙ్ముఖమైపోనీ. దామోదరుడు రణం వదలిపోతే నేను నా అస్త్రాన్ని ఉపసంహరించు కుంటాను."

ఆ మాటకు భగవాన్ హరి ఇట్లన్నాడు: "నా చక్రం కూడా వృథా కారాదు కదా! మన అస్త్రాలు వైఫల్యం చెందకూడదు." ఆ మాటకు ప్రభాసుడు కాలవిదుడు గనుక ఇట్లన్నాడు: "అయితే మీ చక్రం నా రథాన్ని నిహతం చేయనీ."

సరే నని హరి చెప్పి దామోదరుని రణాంగణం నుంచి మళ్ళించినాడు. ప్రభాసుడు చక్రాన్ని గ్రహింపగా అది రథంపై పడినది.

ఇంకొక రథాన్నెక్కి అతను సూర్యప్రభుని దగ్గరకు వెళ్ళి నాడు. అలాగే దామోధరుడు కూడా శ్రుతశర్మ వద్దకు వెళ్ళినాడు.

సూర్యప్రభునకు, శ్రుతశర్మకు మధ్య ద్వంద్వ యుద్ధం పరాకాష్ఠ చెందినది. శ్రుతశర్మ ప్రయత్న పూర్వకంగా ఏ ఏ అస్త్రాన్నైతే ప్రయోగించే వాడో వానినెల్లా ప్రత్యస్త్రాలతో సూర్య ప్రభుడు ఒక క్షణంలో పడగొట్టేవాడు. శ్రుతశర్మ ఏ ఏ మాయను ప్రయోగిస్తే సూర్యప్రభుడు అదే ప్రతి మాయలతో దానిని నిహతం చేసేవాడు.

ఆ తర్వాత అతి కోపనుడై శ్రుతశర్మ బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించినాడు. వెంటనే సూర్యప్రభుడు కూడా పాశుపతాస్త్రాన్ని ప్రయోగించినాడు. ఆ రౌద్రమహాస్త్రంతో బ్రహ్మాస్త్రాన్ని ప్రతిహతం చేసేలోగా, దానితో శ్రుతశర్మ అవమానపడేలోగా, ఇంద్రప్రభృతులైన లోకపాలురు చుట్టూ వజ్రాదులైన పరమాస్త్రాలను కుపితులై ప్రయోగించినారు.

ఆ పాశుపతం ఆ ఆయుధాల నన్నింటినీ జయించి, శ్రుతశర్మను చంపుటకై మహోద్ధృతంగా జ్వలించినది. అప్పుడు సూర్యప్రభుడు ఆ మహాస్త్రానికి ఇలా విజ్ఞప్తి చేసినాడు: "శ్రుతశర్మను నీవు చంపవద్దు. బంధించి నాకు సమర్పించు.''

ఆ తర్వాత బలవంతంగా సురలందరూ సన్నద్ధులైనారు. వారిని జయించాలన్న కోరికతో ప్రేక్షకులైన ఇతర అసురులు కూడా సన్నద్ధులైనారు. తక్షణమే మహాదేవుడు ప్రేరేపించగా ప్రమథగణానికి చెందిన వీరభద్రుడు వచ్చి ఇంద్రాదులకు శంకర సందేశాన్ని ఇలా వినిపించినాడు:

"మీరు కేవలం యుద్ధాన్ని చూడడానికి వచ్చినారు. మీరే యుద్ధానికి దిగితే ఇదెలా సక్రమ మౌతుంది. ఇతరులు కూడా ఇలాగే మర్యాదావలంఘనం చేస్తే అసమంజస మౌతుంది కదా!"

ఈ మాటకు దేవతలిలా సమాధానం చెప్పినారు: "మా కుమారులందరూ హతులుకాగా, ఇంకా హతులౌతుండగా మేమెలా యుద్ధం చేయకుండా ఉండగలం? పుత్రప్రీతి అపరిత్యాజ్యమైనది. అది ప్రతిక్రియను కోరుతుంది. వారందరూ నిహతులు కాగా యథాశక్తి మేము ప్రతీకారానికి దిగినాము. ఇందులో అక్రమ మేమున్నది?'' ఇలా వారంటుండగా వీరభద్రుడు వెళ్ళి పోయినాడు.

ఆ తర్వాత సురలకు, అసురులకు మధ్య భీషణసంగ్రామం చెలరేగినది. సునీథుడు అశ్వినీ కుమారులతోనూ, ప్రజ్ఞాఢ్యుడు చంద్రునితోనూ, స్థిరబుద్ధి వసువులతోనూ, కాలచక్రుడు వాయుదేవునితోను, ప్రకంపనుడు అగ్నితోనూ, సింహదంష్ట్రుడు నిర్ఋతితోను, ప్రథమనుడు వాయువుతోను, ధూమకేతువు వరుణునితోనూ, మహామాయుడు కుబేరునితోను అస్త్రప్రత్యస్త్రాలను ఉపయోగించి అన్యోన్యం పోరాడినారు.

ఆ తర్వాత ఏఏ వేల్పు ఏఏ పరమాస్త్రాన్ని వేస్తాడో ఆయా అస్త్రాలనన్నింటినీ హరుడు హుంకారంతోనే వినష్టం చేస్తూ వచ్చినాడు. కుబేరుడు గదనెత్తగా సామంతో శర్వుడే వారించినాడు. ఇతర దేవతలందరూ భగ్నాస్త్రులై యుద్ధాన్ని వదలి వెళ్ళి పోయినారు.

ఆ తర్వాత సూర్యప్రభుని పైనికి శక్రుడు క్రోధంతో స్వయంగా యుద్ధానికి దిగినాడు. ఎన్నెన్ని ఆయుధాలనో

వదలినాడు. వాటినన్నింటినీ అవలీలగా ఎగురగొట్టి ఆకర్ణాకృష్ట నారాచశతంతో ఇంద్రుని కొట్టినాడు.

అప్పుడు క్రుద్ధుడైన సురాధిపతి వజ్రాన్ని చేతపట్టినాడు. అదిచూచి రుద్రుడు హుంకరించినాడు. అందుతో అది నష్టమై పోయినది.

ఆ తర్వాత మహేంద్రుడు పరాఙ్ముఖుడై వెళ్ళిపోగా, నారాయణుడు స్వయంగా క్రోధంతో కోటిముఖాలైన శరాలను వేసి ప్రభాసునితో యుద్ధం చేసినాడు. ఎన్నిఅస్త్రాలను వేసినా అతను సమంగా పోరాడినాడు. హతాస్త్రుడై, విరథుడై, మరొక రథాన్నెక్కి ఆ దైత్యారితో నిర్విశేషంగా యుద్ధం చేసినాడు.

అప్పుడా విష్ణుమూర్తి కుపితుడై జ్వలిస్తున్న చక్రాన్ని వదలినాడు. ప్రభాసుడుకూడా అభిమంత్రించి దివ్యఖడ్గాన్ని ప్రయోగించినాడు. ఆ రెండు ఆయుధాలూ యుద్ధం చేస్తుండగా మెల్లగా చక్రానిదే పైచేయి అవుతున్నట్టు గమనించి హరుడు హుంకరించినాడు. అంతలో ఆ ఖడ్గము, చక్రమూ కూడా అంతర్ధానమైపోయినవి. దానితో అసురులు ఆనందించినారు. దేవతలు విషాదం చెందినారు.

సూర్యప్రభుడలా విజయం పొంది, శ్రుతశర్మ బద్ధుడుకాగా, దేవతలు వృషధ్వజుని సంస్తుతించినారు. అందుతో సంతుష్టుడై అంబికాపతి దేవతలనిలా ఆదేశించినాడు. "సూర్యప్రభుని ప్రతిజ్ఞను వదలిపెట్టి ఇంకేదైనా వరాన్ని కోరండి"

"ఓదేవా! మీరేప్రతిజ్ఞ చేసినారో దానిని అన్యథాకరించడానికి ఎవరికి శక్తికలదు? అయితే శ్రుతశర్మ విషయంలో

మేమూ ఒక ప్రతిజ్ఞ చేసిఉన్నాము. అదికూడా అసత్యం కారాదు. వంశక్షయం కాకూడదు'' అని చెప్పి విరమించిన దేవతల నుద్దేశించి తిరిగి శంకరుడిట్లా అన్నాడు. "సంధిచేసుకుంటే అది సాధ్యమౌతుంది. మీరు సంధి చేసుకొనండి. శ్రుతశర్మ తన అనుచరులందరితో పాటూ సూర్యప్రభునకు ప్రణామం చేయుగాక! ఆ తర్వాత ఉభయులకూ హితమైన విధానాన్ని నేను చెప్తాను." దేవత లందులకు సరేనని సూర్యప్రభునకు శ్రుతశర్మ ఆనతుడగునట్టుగా చేసినారు.

ఆ తర్వాత తమతమ శత్రుత్వాలను వదలిపెట్టి ఒకరినొకరు కంఠాశ్లేషం చేసుకొన్నారు. దేవాసురులు శాంతవైరులై పరస్పరం సంధి చేసుకొన్నారు.

ఆ తర్వాత అఖిల సురాసురులు వింటుండగా భగవాన్ శంభుడు సూర్యప్రభునితో ఇట్లన్నాడు. "నీవు దక్షిణవేదికి చక్రవర్తివి కమ్ము. ఉత్తరవేద్యర్ధాన్ని శ్రుతశర్మకివ్వు. త్వరలోనే నీకు ఇంతకు నాలుగంతలు వృద్ధి సంప్రాప్తింపనున్నది. అశేష ఖేచరులైన కిన్నరాదుల సామ్రాజ్యం కూడా నీకు లభింపనున్నది. అది లభించినపుడు దక్షిణవేద్యర్ధాన్ని ఆ కుంజరకుమారకునకు ఇవ్వు. అతనొక విశేషపదవిలో ఉన్నాడు. ఈ యుద్ధంలో నిహతులైన ఉభయపక్ష వీరులూ అక్షత గాత్రులై ప్రాణాలతో లేచి నిలుతురుగాక!'' అని పార్వతీపతి అంతర్ధానం చెందినాడు. ఆ రణంలో చనిపోయిన వారందరూ అంతలో నిద్రనుంచి మేల్కొన్నట్టుగా అక్షతగాత్రులై కన్పించినారు.

ఆ తర్వాత సూర్యప్రభుడు శంకరాజ్ఞను శిరసావహించి ఒంటరిగా విస్తీర్ణమైన భూభాగంలో ఎత్తుగానున్నచోట కూర్చు

న్నాడు. శ్రుతశర్మరాగా తన సింహాసనార్ధంలో స్వయంగా అతనిని కూర్చుండబెట్టుకున్నాడు. ఆయన వయస్యులైన ప్రభాసాదులు, శ్రుతశర్మ వయస్యులైన దామోదరాదులు వారికిరువైపులా కూర్చున్నారు. అక్కడే సునీథుడు, మయుడు, ఇతర దానవులు కూర్చున్నారు. అలాగే ఉచితాసనాలలో విద్యాధరేశ్వరులు ఉపవిష్టులైనారు.

ఆ తర్వాత సప్తపాతాళ పతులందరూ ప్రహ్లాదప్రముఖులు, దైత్యదానవేంద్రులూ ఆనందంతో అక్కడికివచ్చినారు. ఇంద్రుడు లోకపాలాదులు, బృహస్పతి తోడురాగా విద్యాధరుడైన సుమేరుడు, సువాస కుమారకుడు అక్కడికి వచ్చినారు. దను ప్రభృతులైన సర్వ కశ్య పాంగనలూ భూతాసన విమానంపై విచ్చేసినారు. వీరందరూ తమలో తాము ప్రీతితో ఒకరినొకరు పలుకరించుకొని కూర్చున్నారు.

సిద్ధి అనే పేరుగల దనుసఖి ఇలా అన్నది: "ఓ సురాసురులారా! దేవిదనువు ఇలా మీకు చెప్తున్నది. ఈ ప్రేమ సమాజంలో ఉన్న సౌమనస్యం, సుఖం మాకు ఎంతోబాగా కన్పిస్తున్నది. ఇలాంటి ఆనందం మీరింతకు ముందు ఎప్పుడైనా అనుభవించినారా? అనుభవించి ఉంటే చెప్పండి. పరస్పరం దుఃఖదారుణమైన విరోధ భావమెప్పుడూ కల్పించుకో కూడదు.

హిరణ్యాక్షాదులైన పెద్దవారు స్వర్గాధిపత్యం కోసం విరోధులైనారు. వారంతా ఇప్పుడు గతించి పోయినారు. ఇప్పుడు ఉన్నవారిలో ఇంద్రుడు జ్యేష్ఠుడు. ఇక విరోధమెందుకు? ఇక మీద శత్రుత్వం లేకుండా సుఖంగా అన్యోన్యంగా ఉండవలసింది. అది మాకు సంతోషాన్నిస్తుంది. లోకాలకు శుభము చేకూరుస్తుంది."

సిద్ధిముఖంగా భగవతి దనుర్వచనం విని ఇంద్రుడు తనవేపు చూడగా బృహస్పతి ఆమెతో ఇట్లన్నాడు: "దేవతలకు అసురుల యెడ ఎప్పుడూ అనుబంధం లేదు. వీరందరూ దేవతల యెడ అనవసరంగా ఏదో ఒక అపకారం చేస్తూ ఉంటారు."

ఇలా దేవగురువు అనగా దానవేంద్రుడు మయుడిట్లా అన్నాడు: "అసురులకు వైరుధ్యమే ఉంటే నముచి మృతసంజీవనమైన హయాన్ని ఉచ్చైశ్శ్రవాన్ని ఇంద్రునకెలా ఇస్తాడు? ప్రబలమైన తన శరీరాన్నే సురలకెలా సమర్పిస్తాడు? బలి చక్రవర్తి ముల్లోకాలనూ హరునికి దానం చేసి కారాగారం లోనికి ఎందుకు ప్రవేశిస్తాడు? అయోదేహుడు తన దేహాన్ని విశ్వకర్మ కెలా దానం చేస్తాడు? ఇలా ఎంతని చెప్పను? అసురులెప్పుడూ నిత్యసంభావ్యులుగా ఉన్నారు. మోసంతో వారిని బాధించకపోతే అసురులు దుష్క్రియ చేయడమనేదే ఉండదు."

ఈ విధంగా మయాసురుడు అనగా సిద్ధి చెప్పినట్టుగానే దేవాసురులు పరస్పరం కౌగిలించుకొని మిత్రులైనారు.

ఈ లోగా దేవిభవాని పంపిన ప్రతీహారి జయ అక్కడకు వచ్చినది. సర్వులూ ఆమెను సత్కరించినారు. ఆమె సుమేరునితో ఇట్లన్నది: "దేవి నన్ను మీ దగ్గరకు పంపినది. ఆమె ఇట్లా నిన్ను ఆదేశిస్తున్నది. నీకు కామచూడామణి అనే కన్యక పుత్రిక ఉన్నది కదా! సూర్యప్రభునకు వెంటనే కన్యాదానం చేయవలసినది. ఆమె నాకు భక్తురాలు" అని జయ చెప్పగా వినమ్రుడైన సుమేరుడు ఇట్లా అన్నాడు:

"దేవి ఆదేశాన్ని శిరసావహిస్తాను. ఇది మా యెడ దేవి చూపిన పరమానుగ్రహం. ఇలాగే శివుడుకూడా మాకు ఆదేశించి ఉన్నాడు."

సూర్యప్రభునితో అప్పుడు జయ ఇట్లన్నది. "నీవీమెను నీ భార్య లందరిలో ప్రథమురాలినిగా, పట్టమహిషినిగా చేసుకొన వలసినది. ఈమెకూడా వారందరిలో కంటే నీకు అభిమతురాలు కాగలదు. ఈ విధంగా ప్రసన్నురాలైన గౌరీదేవి నిన్నాజ్ఞాపించి నది'' అని చెప్పి సూర్యప్రభునితో అర్చితురాలై, భవానీప్రతీహారి జయ అంతర్ధానమైనది.

ఆ రోజే సుమేరుడు వెంటనే లగ్నం పెట్టించినాడు. రత్న ఖచిత స్తంభ కుట్టిమమైన వేదిని అక్కడ నిర్మింపజేసినాడు. ఆ కాంతిజాలంతో అగ్నితో ఆచ్ఛాదితమైనట్టుగా ఉన్నదది. అక్కడికి తన కూతురు కామచూడామణిని పిలిపింపజేసినాడు. లోలములైన దేవాసురనేత్రాలు ఆమె లావణ్యాన్ని త్రావివేస్తుండగా, ఉమ హిమవంతునికి పుట్టినది. ఈమె సుమేరునికి పుట్టినది. కాబట్టి వీరు సమాన సౌందర్యవతులైరేమో అన్నట్టు కన్పిస్తున్నారు.

పిదప వేదిపై కృతకౌతుక శోభితురాలు, సర్వాలంకార భూషిత అయిన ఆమెను సుమేరుడు సూర్యప్రభునకు దానం చేసినాడు. సూర్యప్రభుడు కూడా అప్పుడా కామచూడామణిని పరిగ్రహించినాడు. దనుప్రభృతులు కంకణం కట్టిన పాణిపంకజం లాజలను వేస్తుండగా, తక్షణమే అక్కడికి భవాని పంపగా వచ్చిన జయ అనశ్వరమైన దివ్యమాలను సమర్పించినది. సుమేరువు కూడా అనర్ఘములైన రత్నాలనప్పుడు వారికిచ్చినాడు. ఐరావతానికి పుట్టిన దివ్యమైన పట్టపుటేనుగును కూడా ఇచ్చినాడు.

రెండవసారి లాజవిమోచనం చేసినపుడు జయ రత్నావళి నిచ్చినది. దానిని మెడలో వేసుకుంటే మృత్యుబాధగాని, ఆకలి

దప్పుల బాధగానీ ఉండదు. సుమేరువుకూడా రెండింతలు రత్న సంచయాన్నిచ్చినాడు. ఉచ్చైశ్శ్రవః ప్రసూతమైన అత్యుత్తమ హయరత్నాన్ని బహూకరించినాడు.

మూడవసారి లాజమోచనం జరిగినపుడు జయ ఏకావళి నిచ్చినది. దానిని కంఠంలో వేసుకున్నవారికి యౌవనం ఎన్న టికీ క్షయంకాదు. అప్పుడు సుమేరుడు కూడా మూడింతల రత్న రాశినిచ్చి సర్వసిద్ధులకు ఉపయుక్తమైన ఒక దివ్యమైన అంగు ళీయకాన్ని ఇచ్చినాడు.

ఈ విధంగా వివాహం నిర్వృత్తం కాగా సుమేరువు సురా సురులను, విద్యాధరులను, దేవమాతలను సర్వులను ఉద్దేశించి ఇట్లా విజ్ఞప్తిచేసినాడు. "తామందరూ ఇప్పుడు మా ఇంట భోజనం చేయ వలసింది. నేను తలపై అంజలి ఘటించి అభ్యర్థి స్తున్నాను. తాము అనుగ్రహించ వలసింది." ఈ విధంగా సుమేరుడు చేసిన అభ్యర్థనను వారందరూ నిరాకరింపనుండగా అంతలోనే నందీశ్వరుడు అక్కడికి వచ్చినాడు.

వారందరూ ఆయనకు నమస్కరింపగా ఇట్లన్నాడు: "త్రిశూలి మీకిలా ఆజ్ఞాపిస్తున్నాడు. సుమేరుని ఇంటిలో మీరు తప్పకుండా భోజనం చేయవలసినది. అతను మాకు ఆత్మీయుడు. ఇలా భోజనం చేస్తే మీకు శాశ్వతంగా సంతృప్తి కలుగుతుంది" అని నంది చెప్పగా వారందరూ అంగీకరించినారు.

అక్కడికి అంతలోనే శంకరుడు పంపిన అనేక ప్రమథులు విచ్చేసినారు. వినాయక, మహాకాళ, వీరభద్రాదులు ఆ గణాలకు నాయకత్వం వహించినారు. వారు ఆ వేదిని యథాక్రమంగా

భోజనానికి సజ్జీకృతం చేసి వారిని కూర్చుండబెట్టినారు. దేవతలు ఖేచరులు, అసురులు, మానవులు వారందరూ కూర్చుండగా, వారికై విద్యాప్రభావంతో అక్షయంగా ఉద్భవించిన ఆహారాలను శంకరాదిష్ట కామధేనూద్భవములైన వానిని వారికి వడ్డించినారు.

యథార్థంగా, ఇచ్ఛావిధేయంగా, వీరభద్ర, మహాకాళ, భృంగి ప్రభృతులు ఒక్కొక్కరినీ సంతృప్తి పరచినారు. పదేపదే సంతోషంతో ఖేచర చారణులు-సమ్మిళితులైనారు. అలాగే దివ్య స్త్రీ నృత్య సుందరమైన సంగీతకములు జరిగినవి. వారందరూ భోజనం చేసిన తర్వాత నందీశ్వరాదులు దివ్యాలైన మాల్యాలను, వస్త్రాలను, ఆభరణాలను వారందరకూ ప్రదానం చేసినారు.

ఈ విధంగా దేవాదులను సమ్మానించి నంది ప్రభృతులైన అఖిలగణేశ్వరులు సర్వగణాలతో కలిసి, వచ్చిన దారినే వెళ్ళిపోయినారు.

ఆ తర్వాత సర్వదేవాసురులు వారి మాతృశ్రీలు వెళ్ళినారు. శ్రుతశర్మాదులు కూడా తమ తమ వారిని వీడ్కొని వెళ్ళిపోయినారు. భార్యలతోను, వయస్యులతోను, వధువులతోనూ సూర్యప్రభుడు విమానంలో మొదట సుమేరు తపోవనానికి వెళ్ళినాడు.

తన వయస్యుడైనట్టి హర్షుని మహీధరులకు, రత్నప్రభుని తమ్మునికి తన అభ్యుదయాన్ని గురించి తెలియజెప్పడానికి పంపించినాడు. సాయంకాలం రత్నఖచిత పర్యంకం కలదీ, మనోహరంగా నిర్మించినదీఅయిన, వధువు కామచూడామణి నివాస గృహంలోనికి ప్రవేశించినాడు.

అక్కడ గాఢాలింగనాలతోను, దశనచ్ఛద ఖండనములతోను మెల్లగా ఆ నవోఢసిగ్గును క్రమంగా తొలగించి వేసినాడు.

ముగ్ధ విదగ్ధమధురమైన. నవరతిలో అనిర్వాచ్యమైన. ఇతరులచే అనాస్వాదితమైన సుఖాన్ని ఆమెతో పాటూ సేవించినాడు. "ఇప్పుడు ఇతర స్త్రీలకు స్థానం నా హృదయం బయట మాత్రమే కలదు. లోన మాత్రం నీకొక్కదానికే స్థానం ఉన్నది" అని అత నామెను సంతోష పెట్టినాడు.

ఆ తర్వాత ప్రియాశ్లేష సుఖావహమైన నిద్రా. ఆ రాత్రీ కూడా రతాంతసుప్తుడైన ఆ సూర్యప్రభునకు నెమ్మదిగా తెల్లవారి నది. ప్రాతఃకాలం లేచి సూర్యప్రభుడు అక్కడ నుండి వెళ్ళి తమతో వచ్చిన నిజభార్యలందరినీ రంజింప జేసినాడు. వారందరూ నవవధూవ్రతుడైన వానిని నర్మవక్ర మధురస్నిగ్ధ ముగ్ధ వచ నాలతో క్రమంగా పరిహసించినారు.

ఈ లోగా ప్రతీహారి ఎరిగింపగా వచ్చి నమస్కరించి సుషేణుడనే విద్యాధరుడు కృతార్థుడైన అతనికి ఇట్లా విజ్ఞాపనం చేసినాడు: "దేవా! త్రికూటనాథాదులైన సర్వ విద్యాధరులూ కలిసి నన్ను ఇక్కడికి పంపించి తమ కిట్లా విన్నపం చేయ మన్నారు – "ఋషభాద్రిలో మూడవనాడు తమకు శుభాభిషేకం జరుగ గలదు. ఈ విషయమై అందరికీ తెలియజేయండి. అందుకై ప్రయత్నాలు చేయించండి"

ఆ మాటవిని ఆ దూతతో సూర్యప్రభుడిట్లా జవాబిచ్చినాడు: "నీవువెళ్ళి నా మాటగా త్రికూటాధిపతి ప్రభృతులకు చెప్పవల సింది. మీరే ఆ ఏర్పాట్లన్నీ చేయండి. అందరకూ చెప్పండి. మరి మేమంతా ఇక్కడ సిద్ధమయ్యే ఉన్నాము. మరి ఇతరు లందరకు మటుకు మేమే తెలియజేస్తాము"

ఈ ప్రతి సందేశాన్ని తీసుకొని సుషేణుడు అక్కడ నుండి వెళ్ళి పోయినాడు. సూర్యప్రభుడు కూడా ప్రభాసాదులను ఒక్కొక్కరినే పిలిపించి, యాజ్ఞవల్క్యాది మునులకు, దేవతలకు, రాజులకు, విద్యాధరులకు, అసురులకు వేరు వేరుగా తన అభి షేక మహోత్సవానికి రావలసిందిగా ఆహ్వానాలతో వారిని పంపించినాడు.

తాను ఏకాకిగా పర్వతోత్తమమైన కైలాసవాసానికి వెళ్ళి గౌరీశంకరులను పిలువవలెనని ఉద్యమించి పైనికి ఎక్కసాగి నాడు. అక్కడ శుభ్రభూతి సితమైన గిరిని దేవర్షి సిద్ధాదులకు సంసేవ్యమై అపర శంకరుడుగా కన్పించు దానిని చూచినాడు.

సగంవరకూ ఎక్కిన తర్వాత, ఆ పైన ఎక్కడ మనేది అసాధ్యంగా భావించి, అటు చూడగా అక్కడ ఒక విద్రుమ ద్వారం కన్పించినది. అందులో ప్రవేశించడానికి ఎంతసిద్ధుడైనా సాధ్యం కాలేదు. అప్పుడు ఏకాగ్రమనస్కుడై శశిశేఖరుని సంస్తుతించి నాడు.

ఆ తర్వాత ఆ ద్వారాన్ని తెరుచుకొని గజముఖ పురుషు డిట్లా అన్నాడు: "రమ్ము. లోనికి ప్రవేశింపుము. భగవాన్ హేరంబుడు నీ యెడ సంతృప్తుడైనాడు." అప్పుడు సూర్య ప్రభుడు అందులో ప్రవేశించి విస్మితుడై జ్యోతిర్మయ సువిశాల శిలాతలంపై ద్వాదశాదిత్య సంకాశుడై, ఏకదంష్ట్రుడై గజాననంతో, లంబోదరంతో, త్రినేత్రంతో, పరశుముద్గరాలతో కూర్చునిఉన్న వినాయకుని చూచినాడు.

నానాప్రాణిముఖాలతోనున్న ప్రమథగణాలు ఆయన చుట్టూఉన్నారు. ఆయనను చూడగానే నమస్కరించి, ఆయన

పాదాలకు అభివందనం చేసినాడు. ఆ విఘ్నేశ్వరుడు ప్రీతుడై వచ్చిన కారణం అడిగి మృదుమధుర వచనాలతో 'ఈ దారిని ఎక్కి వెళ్ళు' అని చెప్పినాడు.

ఆ దారిన పడి పంచయోజనాలు ఎక్కిన తర్వాత, పద్మరాగమయమైన మరొక మహాద్వారం కన్పించినది. అందులోనికి ప్రవేశం దొరకక అక్కడకూడా పినాకపాణిని ఏకాగ్రమనస్కుడై సహస్రనామ స్తోత్రంతో సంతోషింపజేసినాడు. అక్కడ కుమారస్వామి స్వయంగా ద్వారం తెరచి అతనిని లోన ప్రవేశపెట్టమని విశాఖుడను వానితో చెప్పినాడు.

లోనప్రవేశించి సూర్యప్రభుడు జ్వాలానలద్యుతి అయిన స్కందుని సందర్శించినాడు. తనలాగా ఉన్న శాఖ విశాఖులు మొదలైన ఐదుగురు కుమారులతో చేరిఉన్నాడు. దుష్టగ్రహ, శిశుగ్రహాదులు, కోటి సంఖ్యాకులైన గణేశులు శరణాగతులై ఆయన చుట్టూరా ఉన్నారు. ఆయనకూడా అతని రాకకు కారణమడిగి తెలుసుకొని సంతోషించి ఆ శరజన్ముడు మరొక ఆరోహణ మార్గాన్ని చూపించినాడు.

ఇలా క్రమంగా ఇతరరత్న ద్వారాలు అయిదింటిని దాటి భైరవ, మహాకాళ, వీరభద్ర, నంది, భృంగి వారి అనుచరులూ యథాక్రమంగా ఆయా దారులవద్ద నిరోధింపగా దాటి అద్రి పృష్ఠంలో ఉత్తమమైన స్ఫటికద్వారాన్ని చేరుకొన్నాడు.

అక్కడ దేవదేవుని స్తుతిస్తూ రుద్రులలో ఒకరు సాదరంగా ప్రవేశపెట్టగా స్వర్గాధికమైన మహేశ్వరపదాన్ని చూచినాడు. అక్కడ దివ్యసౌరభయుతమైన మారుతం వీస్తున్నది. అంతటా

సర్వదా పుష్పఫలప్రదాలైన పాదపాలున్నవి. అక్కడ గంధర్వులు గానం చేస్తున్నారు. అప్సరసలు నాట్యం చేస్తున్నారు.

అద్రిపై ఒక ప్రక్కన స్ఫటిక మయమైన సింహాసనంపై కూర్చొని, త్రిలోచనుడు, శూలపాణి, స్వచ్ఛస్ఫటిక దేహుడు, బద్ధ పింగ జటాజూటుడు, చారు చంద్రార్ధశేఖరుడు అయిన శివుడున్నాడు. పార్శ్వంలో భగవతి పార్వతి ఉపసేవిస్తూఉన్నది.

సూర్యప్రభుడు ఆనందంతో దేవీసహితుడైన ఆ మహేశ్వరుని పాదాలపై పడినాడు. ఆ తర్వాత భగవాన్ హరుడు అతని వీపుపై చేయిఉంచి లేపి కూర్చుండబెట్టి 'నీరాకకు గతమే' మని అడిగినాడు. "నా అభిషేకం దగ్గర పడినది. మీ సన్నిధానం కోసమై ప్రార్థించడానికి వచ్చినాను" అని సూర్యప్రభుడు జవాబిచ్చినాడు.

అప్పుడు ఈశ్వరుడు — "కుమారా! నీ వింత కష్టపడి ఇంత దూరం రావడమెందుకు? నీవు స్మరించిన మాత్రంతో అక్కడ ఉండే వాడనుగదా! అదలా ఉండనీ. నేను వస్తాను" అని చెప్పి ఆ భక్తవత్సలుడు దగ్గరనున్న ఒక ప్రమథుని పిలిచి ఇట్లా ఆజ్ఞాపించినాడు. "నీవు వెళ్ళి అభిషేకార్థం ఇతడిని ఋషభపర్వతానికి కొనిపోవలసినది. విద్యాధర చక్రవర్తులకది మహాభిషేక స్థానం కదా!"

ఈ ఆజ్ఞవిని సూర్యప్రభుడు శివునకు ప్రదక్షిణం చేసిన తర్వాత, ఆ ప్రమథుడు అతనిని దగ్గరకు తీసుకొన్నాడు. వెంటనే ఆ ఋషభ పర్వతానికి తీసుకొనివెళ్ళి వదలినాడు. తన ప్రభావం వల్ల తక్షణమే అదృశ్యుడైనాడు.

సూర్యప్రభుని దగ్గరకు అక్కడున్న వయస్యులందరూ వచ్చినారు. కామచూడామణి మొదలైన భార్యలందరూ వచ్చినారు. విద్యాధరాధిపులు వచ్చినారు. ఇంద్రాదులైన దేవతలు, మయుడు మొదలైన అసురులు వచ్చినారు. మహర్షులు, శ్రుతశర్మ, సుమేరువు, సువాసకుమారకుడు కూడా విచ్చేసినారు. సూర్యప్రభుడు వారందరినీ యథోచితంగా సమ్మానించినాడు. రుద్రాద్రి వృత్తాంతం విన్నతర్వాత అతనిని వారందరూ అభినందించినారు.

ఆ తర్వాత వివిధౌషధి సంయుతము, నదీనదాంభోధి తీర్థ సంహితమూఅయిన జలాన్ని ప్రభాసాదులు మణికనకమయ కుంభాలతో స్వయంగా కొనివచ్చినారు. అప్పుడు గౌరీసహితుడైన భగవాన్ పురారి అక్కడకు విజయం చేసినాడు. ఆయన పాదాలకు దేవ, అసుర, విద్యాధర, నృపతి, మహర్షులు ప్రణామం చేసినారు.

ఆ సురదానవ ఖేచరులు సర్వులూ పుణ్యాహఘోషం చేస్తుండగా ఆ పుణ్య జలాలతో ఋషులు సూర్యప్రభుని విద్యాధర రాజ్య చక్రవర్తిగా సింహాసనం మీద కూర్చుండబెట్టి అభిషేకం చేసినారు. విజ్ఞానమయుడైన మయాసురుడు ఆయనకు పట్టం కట్టి కిరీటం పెట్టినాడు.

తూర్యములు మ్రోగుతుండగా, దేవదుందుభులు నినదిస్తుండగా, అప్సరసలు నృత్యం చేస్తుండగా మహర్షి సమూహం ఆ కామచూడామణిని అభిషేకించినారు. సూర్యప్రభునకు సమార్హమైన మహాదేవినిగా ఆమెను అభిషేకించినారు.

ఆ తర్వాత దేవతలు, దానవులు వెళ్ళిపోగా సూర్యప్రభుడు బంధు సుహృద్ వయస్యులతో కలిసి విద్యాధర చక్రవర్తి అయి మహాభిషేకోత్సవం చేసుకొన్నాడు.

మహేశ్వరుడు చెప్పినట్టుగా శ్రుతశర్మకు ఉత్తర ధ్రువార్ధం ఇచ్చి మిగతా ప్రియులతో వయస్యులతో చిరకాలం ఖేచర రాజ్య లక్ష్మిని అనుభవించినాడు.

ఈ విధంగా హరప్రసాద ప్రభావంవల్ల మానవుడైన సూర్య ప్రభుడు కూడా పూర్వం విద్యాధర చక్రవర్తిత్వాన్ని పొంది ఉన్నాడు"

ఇలా విద్యాధర ధుర్యుడైన వజ్రప్రభుడు ఆ కథను వత్స రాజు ముందు వ్యాఖ్యానించి, నరవాహన దత్తునకు నమస్కరించి గగనానికి ఎగిరి పోయినాడు.

అతనలా వెళ్ళగా నరవాహన దత్తుడు తనదేవి మదన మంచుకతో కలిసి తనతండ్రి వత్సరాజు గృహంలో విద్యాధరేంద్ర పదవీలాభాన్ని నిరీక్షిస్తూ నివసించినాడు.

ఇది మహాకవి శ్రీ సోమదేవభట్ట విరచితమైన

కథాసరిత్సాగరంలో సూర్యప్రభలంబకంలో

సప్తమ తరంగం సమాప్తం.

